శ్రీ

# మల్లభూపాలీయము

## నీతిశతకము

మహోపాధ్యాయ

ఎలకూచి బాలసరస్వతీకృతము

విద్వాన్:

వేదము లక్ష్మీనారాయణశాస్త్రి, బి. ఓ. యల్.

రచించినవ్యాఖ్యతో కూడినది.

చెన్నపురి:

శాస్త్రులు అండ్ సన్స్

ప్రకటితము.

1954

# పద్యకావ్యములు

ప్రతి 1-కి

అధ్యాత్మరామాయణము ...
అనంతుని ఛందము, (ఛందోదర్పణము) ...
అనిరుద్ధచరిత్రము ...
అన్యవాదకోలాహలము, ద్విపద, లఘుటీక ...
అంబరీషోపాఖ్యానము, సటీక ...
అప్పకవీయము, క్రొత్తకూర్పు ...
అప్పకవీయవిమర్శ, శ్రీ గిడుగు రామమూర్తిగారిది ...
ఆనందగరాట్ఛందము ...
ఆంధ్రకుమారసంభవము - ఆదిపూడి సోమనాథరావు ...
ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) ...
ఆంజనేయదండకము, హనుమద్దండకము ...
ఆంధ్రభాగవతము, పద్యకావ్యము, 2 సంపుటములు ...
ఆదిపర్వము, పద్యకావ్యము, పెద్దచ్చు ...
„ టీక, పాఠప్రతి ...
ఆంధ్రభారతము, పద్యకావ్యము—
ఆది సభా పర్వములు 1 సంపుటము ...
అరణ్యపర్వము ...
విరాటోద్యోగపర్వములు ...
భీష్మద్రోణపర్వములు ...
కర్ణశల్యసౌప్తిక స్త్రీపర్వములు ...
శాంతిపర్వము ...
అనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక,
స్వర్గారోహణపర్వములు ...
[illegible], [illegible] సంపుటము ...
[illegible] ...

శ్రీ

# మల్లభూపాలీయము

## నీతిశతకము

మహోపాధ్యాయ

ఎలకూచి బాలసరస్వతీకృతము

విద్వాన్:

వేదము లక్ష్మీనారాయణశాస్త్రి, బి. ఓ. యల్.

రచించినవ్యాఖ్యతో కూడినది.

చెన్నపురి:

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్

వారిచే ప్రకటితము.

1954

# అవతారిక

"సిద్ధిః సాధ్యే సతామస్తు ప్రసాదాత్తస్య ధూర్జటేః,
జాహ్నవీఫేనలేఖేవ యన్మూర్ధ్ని శశినః కళా."

ఎలకూచి బాలసరస్వతికృత మగు మల్లభూపాలీయమునకు మూలము సంస్కృతభాషయందలి "సుభాషిత త్రిశతి." దానిని రచించిన

## శ్రీభర్తృహరికవింగూర్చి ప్రశంసాలేశము

భర్తృహరి విఖ్యాతప్రాచీనకవులలో నొకఁడు. అతనిని అతని గ్రంథములనుగూర్చి విశ్వసనీయము లగు చరిత్రాంశములు కానరావు. అతని జీవితములోని కొన్నియంశములు మాత్రము కథారూపమున నవుశ్రుతముగా సంప్రదాయబద్ధమై లోకమున వ్యాపించి యున్నను నవి యొండొంటికిపొంది పొసఁగి యుండకపోవుటచే నావివిధగాథలకు సామరస్య మేర్పఱుచుట దుస్సాధ్యమే యగును. భర్తృహరి ఉజ్జయినీరాజవంశ్యుఁ డనియు, తనకు రాజ్యపరిపాలనార్హత యున్నను తనభార్యదుశ్శీలముచే సంసారబంధమునకు రోసి రాజ్యమును తమ్ముఁ డగు విక్రమార్కున కప్పగించి తాను వానప్రస్థుఁ డయ్యె ననియు నొక ప్రతీతి కలదు. ఈవిక్రమార్కుఁడే విక్రమశకాబ్దమునకు మూలపురుషుఁడు. అది యటుండ నిండు. భర్తృహారిరచితము లగు శతకములనుండి యతనికి జీవితమున నాశాభంగము మిక్కిలిగ నేర్పడె ననియు, స్వకుటుంబమునో ఇరుగుపొరుగులనో సూక్ష్మదృష్టితోఁ బరిశీలించుటవలన స్త్రీలశీలమున నతనికి సంశయము బలపడియె ననియు సుస్పష్ట మగును. అతనినిగూర్చి గ్రంథస్థము లైన కొన్నివిషయముల నిట పేర్కొందము.

1. పూర్వోక్తసంఘటనను వివరించుచో నొకానొకగ్రంథమున భర్తృహరి భార్యపేరు అనంగసేన అని యున్నది. 2. ఇంకొకగ్రంథమున భర్తృ

హరి తండ్రి వీరసేనుఁ డనుగంధర్వుఁ డనియు, నీతనికి భర్తృహరి విక్రమా దిత్యుఁడు, సుభటవీర్యుఁ డను ముగ్గురు కుమారులును మైనావతి యనుకుమార్తె యునుగా నలుగురు సంతాన మనియు తెలియవచ్చును. 3. భర్తృహరి తల్లి సుశీల; ఆమెమూలమున నితఁడు మాతామహునిరాజ్యమున కధికారియై, దానిని తనసోదరుఁడు విక్రమాదిత్యున కొసఁగె ననిమఱియొక గాథ. 4. భర్తృ హరిభార్య పద్మాక్షి యని యింకొకకథ. 5. చంద్రగుప్తుఁ డనుబ్రాహ్మణునకు నాల్గువర్ణములనుండియు నల్గురుభార్య లనియు, వారికి యథాక్రమమున వర రుచి, విక్రమార్కుఁడు, భట్టి, భర్తృహరి యనుకుమారులు జనించి రని మఱియు నొకగాథ. ఇట్టిగాథలనుండి కవిచరిత్రమును నిర్ధారించు టెంత కష్ట మో చదువరు లూహింపవచ్చును. కాని వానిమూలమున మనకవి "రాజ న్యుఁడు, ఇహమును రోసి విరాగియై సన్యసించి యడవులఁ బట్టినవాఁడు, గొప్ప విద్వాంసుఁడు, యోగి, కవి" యనునంశము లూహించుకొనవచ్చును.

## శతకరచనము

భర్తృహరి శతకత్రయమునకు కర్త యనుట సార్వజనీనక మగు నభి ప్రాయము. ఆశతకత్రయమును లఘువుగా పఠించువారి కందలి శ్లోకములు పర స్పరాకాంక్ష లేని కూర్పులుగఁ దోఁచును. ఈసందర్భమును పురస్కరించు కొనియు, నిందలిశ్లోకములు కొన్ని యితరకావ్యములఁ గనఁబడుటచేతను ఇవి స్వతంత్రరచనములు కాక బహుకావ్యములనుండి సంగ్రహించిన శ్లోకముల కూర్పు అని యొకసిద్ధాంతము బయలుదేఱినది. ఎవఁడో యొకకవి శతకములను రచించి భర్తృహరి కంటఁగట్టె ననియు నింకొకసిద్ధాంతము పుట్టినా, దానికి పండితాదరణము కలుగలేదు. మొదటి సిద్ధాంతమును విపులముగా పరిశీలించితి మేని కావ్యేతరములలోఁ గనపట్టు నిందలిశ్లోకములసంఖ్య యత్యల్పము; ఆ కావ్యములు సైతము భర్తృహరి యనంతరము పుట్టినవియు, అట్టేప్రశస్తములు కానివియు నగును. మనకవి వానిని స్వతంత్రముగా రచింపక యేర్చికూర్చియే యుండిన తనగ్రంథమునకు నామాంతర మొసఁగియే యుండును. శ్లోకములను

మన మనుకొనునంత విశ్లిష్టములు కావు. వివిధవర్గములుగ విభజింపఁదగిన లక్షణములు నిండుగాఁ గలవు. సూక్ష్మదృష్టితో పఠించువారికి అవి యిహమును రోసిన హృదయమునుండి పొంగిపొరలు భావపరంపరలుగ, లోకవృత్తమును గని అతి వ్యాకులముపాలైన హృదయమందలి యావేగము నణఁపజాలక వెలువరించిన యావేదనముగ స్ఫురింపక తప్పదు. ఆయాసందర్భముల వేదనపాలైనపుడు తనహృదయభావమును వెలువరించి యుండుటచే అవిరతకథనమున గోచరించు పరస్పరాన్వయము ఆశ్లోకముల కన్పట్టదు. దీనిని పురస్కరించుకొని అనీతిపరులు స్వీయరచనములకు గౌరవ మాపాదించుకొనుతలంపుచే వానిని భర్తృహారికి అంటఁగట్టి ప్రక్షిప్తములను పెంచిరి. ఆప్రక్షిప్తముల నసలువానినుండి బహిష్కరించుట కాలగతివలన నతిక్లిష్టమైనది.

## కాలము

ఈకవి తన గ్రంథమునఁ దన్నుఁ దనకాలమునుగూర్చి లేశమాత్రమును బ్రస్తావింప లేదు. కనుక పండితప్రతీతిని, గ్రంథస్థప్రమాణములను, ఇతరకవుల వ్రాఁతలను సాధనములుగాఁ గొని నిర్ధారింపవలసి యున్నది.

భర్తృహరి శకపురుషుఁ డగు విక్రమార్కునిభ్రాత యని పండితప్రతీతి గదా! ప్రాచీనచరిత్రాన్వేషకు లీయంశము సాక్షేపించినట్లు కానరాదు. విక్రమశకము క్రీస్తుపూర్వము ౫౭-వ సం॥ న నారంభ మగుట శిష్టుల యనుమతి నందిన విషయము.

ఇఁక గ్రంథస్థనిదర్శనము లంతగా కవికాలనిర్ణయమున కుపకరింపకపోవుటయేగాక సందిగ్ధములుగ కూడ నున్నవి. ఆశతకములు వేదాంతపరిభాషాజటిలములు. అయినను వేదాంతసిద్ధాంతములు వందలకొలఁదిసంవత్సరములుగా చర్చితములై పూర్వపక్షసిద్ధాంతీకరణముల నివృత్తి నొందినవి గావున కేవలము వానియాధారమున కాలనిర్ణయము సాధ్యము గాదు. ఈసిద్ధాంతములను లోకసామాన్యమునకు ప్రప్రథమమున వెల్లడిచేసినవారు కుమారిలభట్టులు;

వీ ఎనిమిదవశతాబ్దమువారు. తర్వాతివారు ఆదిశంకరులు; వీరు తొమ్మిదవశతాబ్దమువారు అని కొందఱును, కా రని కొందఱును వాదింతురు. కావున వేదాంతము తొమ్మిదవశతాబ్దమాదిగా వ్యాప్తినందినా దానియుద్భవ మంతకు బహుకాలము పూర్వమే యనుట సువిదితముగదా? కనుక వేదాంతపరిభాష నాశ్రయించి మనము కవికాలము నూహింప నెంచుట సమంజసము కాదు.

ఈశతకములలోఁ బురాణముల ప్రసక్తియుఁ గలదు. పాశ్చాత్య పండితులదృష్టిలో పురాణము లిటీవల వేయిసంవత్సరముల క్రిందటివేగాని అంతకు మునుపటివి కావు. వారిలోఁ గొందఱిమతమున నివి క్రీ. శ. పండ్రెండవ పదుమూఁడవ శతాబ్దముల నాఁటివి. కావున పాశ్చాత్యవిమర్శకుల యభిప్రాయము లీపట్టున మన కప్రయోజకములు. మఱియుం పురాణముల లోని ప్రక్షిప్తభాగముల విషయమున నెలాటి యభిప్రాయభేదములు ప్రబలి యున్నను ఆపురాణములమూలభాగములకుఁ గర్త వేదవ్యాసమహర్షియే యని భారతీయసంప్రదాయము; దీనిని త్రోసిరాజనుట అవివేకము. వ్యాసుఁడు క్రైస్తవశకమునకు వేలకొలఁదియేండ్లు మునుపటివాఁ డనుట నిశ్చయము. అందు వలన క్రీ. పూ. ప్రథమశతాబ్దము నాఁటికే పురాణములు ప్రాచీనతమము లనుట నిర్వివాదముగదా! కనుక కేవల పురాణప్రసక్తినిఁబట్టియు నొకగ్రంథము నర్వాచీన మనుట పొసఁగదు. ఇఁక బాహ్యప్రమాణములను పరిశీలింతము.

భర్తృహరిశతకములను వ్యాఖ్యానించినవారు మహాబలుఁడు, అపంచి రామచంద్రబుధేంద్రుఁడు, ధనసారుఁడు, రామర్షి, గుణవినయుఁడు, మీన నాథుఁడు, ఇంద్రజితుఁడు అనువార లని సంస్కృతవాఙ్మయచరిత్రకారులు శ్రీయుత కావ్యవినోదులు కృష్ణమాచార్యులవారు పేర్కొనియున్నారు. వారిలో నొకరైనను కవికాలనిర్ణాయకవిషయమై శ్రద్ధవూనినట్లు కానరాదు. కాని వారిలో రామచంద్రబుధేంద్రుఁడు రచించిన వ్యాఖ్య ఆంధ్రదేశమున నే గాదు; యావద్భారతమునను వ్యాప్తి నందియున్నది. ఆయన పీఠికలో "విప్రేణాభూతపూర్వం" అను శ్లోకమున "ఒకానొకప్పు డొకబ్రాహ్మణుఁడు

తనకు సూర్యప్రసాదముచే లభించినఫలమును తనప్రభు వగు భర్తృహరికి నొసఁగఁగా దాని నతఁడు తనప్రియభార్య కిచ్చెను. ఆమె దానిని తాను భుజింపక తనజారునకును, అతఁడు తన ప్రియేతరకును అర్పించి రనియుం, ఈ సంగతి ప్రత్యక్షమైనంతనే రాజు లోకవృత్తముపై నేవగొని విరాగియై కాననములఁ జేరెను." అన్న జనప్రతీతి నిట తడవియున్నాఁడు గాని దాని సత్యాసత్యముల విమర్శించినట్లు స్ఫురింపదు. సాధారణముగా ప్రసిద్ధపురుషులనుగూర్చి అవినీతులు తమబుద్ధిబలముకొలఁది గాథల నెన్నిటినో కల్పించుటయుం, వాని నట్టే సత్యము లని పామరజనము విశ్వసించుటయుం మనము నేఁటికిని చూచుచున్నాము. ఇది యొక గడ్డిఛాందసవృత్తము. వ్యాఖ్యాతలెల్లరు "రత్నము రత్నమేకదా! అది యేనాఁటి దన్నప్రశ్న మన కేల?" అన్న నుడికి దాసానుదాసులై తలయొగ్గిరే కాని సత్యాన్వేషణయత్నము చేసినవారే లేరు. ఇతరకవు లెవరుగాని తమ కవిస్తుత్యాదికములలో అతనికాలమును నిర్ణయించుటకు తగినంతవిశదముగా నతని ప్రశంస చేసినవారును కారు.

ఇట్లుండినను వేఱొకప్రబలాధారముచే దీనిని కొంతవఱకు నిశ్చయింప వచ్చును. పారసీకభాషలో 'కలిల-ఉ-దిమ్నా' అనుగ్రంథము గలదు. ఇది క్రీ. శ. 531-579 ప్రాంతముల పారసీకమును పాలించిన యొకానొక పాదుషాప్రోత్సాహమున రచియింపఁబడిన గ్రంథము. దానికి మూలము మనసంస్కృతపంచతంత్ర మనుట సర్వాంగీకారముఁ బడసిన విషయము. కనుక పంచతంత్రము అథమపక్షము క్రీ. శ. ఆఱవశతాబ్దారంభకాలముననే ప్రాచుర్యమందియుండె ననుట కేలాటి సంశయమును గన్పట్టను. పంచతంత్ర మామూలాగ్రము స్వతంత్రరచన కాదు. నాఁటికి ప్రశస్తములై యుండినగ్రంథములు పెక్కింటినుండి బహుళముగా నుదాహరణములఁ గైకొనియున్నది. దానికాధారము లగుగ్రంథములలో నీ నీతిశతక మొకటి. అందుండి యొకశ్లోకము ("గజభుజఙ్గవిహఙ్గమబన్ధనం, శశి దివాకరయోర్గ్రహపీడనమ్; మతిమతాం చవిలోక్య దరిద్రతాం, విధి రహోబలవానితి మే మతిః," చూ. 85 పద్యము-మల్ల

భూపా.) ఉదాహృతము. ఈ యుదాహరణమే పారసీగ్రంథమునందును గలదు. కనుక నీతిశతకకర్త క్రీ. శ. 500-కు పూర్వమే యుండె ననుట స్థిరము. అనఁగా కవికాలము అయిదవశతాబ్ది కీవలికి లాగుటకు వీలులేదు.

మఱొకమతము భర్తృహరి క్రీ. శ. 7-వ శతాబ్దమువాఁ డనుట. దానికి భర్తృహరి కాళిదాసీయ మగు నొకశ్లోకమును ("భవన్తినమ్రాస్తరవః ఫలోద్గమై:....పరోపకారిణామ్" శాకుం. 5 అం.చూ. 61 మల్లభూ.) స్వగ్రంథమున నుదాహరించుటయు కాళిదాసు 6-వ శతాబ్దమువాఁ డనుమతమునే యాధారములు. దీని కాక్షేపణ మిది. కాళిదాసుకాలము బహువివాదగ్రస్తమై యుండినది, కాని చాలినన్ని ప్రమాణములను గొని అతఁడు క్రీ.పూ. ప్రథమశతాబ్దివాఁ డని పండితులు నిశ్చయించి యున్నారు కావున నీవాదము నిలువఁజాలదు. ఇంక నొకవిషయము. ఇత్సింగను చైనాయాత్రికుఁ డీదేశమునకు యాత్రమై 7-వ శతాబ్దాంతమున వచ్చియుండి భర్తృహరి తాను వచ్చుటకు పూర్వము నలుబదియేండ్లనాఁడు గతించినట్లు వ్రాసియున్నాఁడు. ఈభర్తృహరి వైయాకరణి. ఆధునికవిద్వాంసులమతమున శతకకవియు, వైయాకరణియు భిన్నులు. ఈమతమును నేఁటిదనుక నాక్షేపించినవా రొక్కరును కనఁబడరు. కనుక నేడవశతాబ్దసిద్ధాంత మడుగంటుచున్నది. భర్తృహరి తన గ్రంథమున నెచటను సమకాలికకవులనో, సమకాలికసంభవములనో తడవి యుండనికారణముచేతను, ఇతరు లెవరు నాతని పే రుదాహరింపనికారణముచేతను సాంప్రదాయికాభిప్రాయమునకు విరుద్ధముగా నేలాటిప్రబలప్రమాణములు గన్పట్టమివలనను పండితప్రతీతి ననుసరింపవచ్చును.

పైవిషయముల పర్యాలోచనఫలితముగా భర్తృహరి విక్రమార్కుని కాలమున అనఁగా క్రీ. పూ. ప్రథమశతాబ్దిమధ్యమున వెలసె నని నిశ్చయింపవచ్చును.

## భర్తృహరి ద్వితయము

సుభాషితత్రిశతికర్త భర్తృహరి యొకఁడును, వాక్యపదీయకర్త భర్తృహరి యొకఁడునుగా భర్తృహరు లిరువు రని కోల్బ్రూకు మహాశయుండు పేర్కొనియున్నాఁడు. ఈయభిప్రాయమును ప్రకాశమొనర్చుచు భట్టికావ్యప్రశంసయం దద్దానికర్త భర్తృహరి యనియు, అభర్తృహరిని విక్రముని సోదరునిగా శతకకర్తగా భ్రమింపరా దనియు హెచ్చరికయుం గావించియున్నాఁడు. ఈభర్తృహరు లిరువురు నొక్కరా? లేక భిన్నులా? ఈవిషయమై శ్రీ 'పథక్' అను పండితుఁడు సప్రమాణముగ నిట్లు రూపించియున్నాఁడు:—

"ఏడవశతాబ్దాంతమున భారతదేశమునకు వచ్చియుండిన చైనాయాత్రికుఁడు ఇత్సింగను నతఁడు తా నాదేశమునకువచ్చుటకు నలువదియేండ్లుపూర్వము వైయాకరణియు వాక్యపదీయకారుఁడు నగు భర్తృహరి మరణించియుండెనని వ్రాయుచు, "అతఁడు బౌద్ధుఁడు; రత్నత్రయమునందును, ద్వివిధశూన్యమందును దృఢభక్తివిశ్వాసములు కలవాఁడు" అని వ్రాసియున్నాఁడు. పదునొకండవశతాబ్దాంతమున నుండిన వాచస్పతిమిశ్రుఁడు వాక్యపదీయకర్త వేదబాహ్యుఁ డని పలికియున్నాఁడు. ఆకాలమున బౌద్ధులను వేదబాహ్యు లని మనవారు వ్యవహరించుచుండిరి. ఇత్సింగు పేర్కొన్నభర్తృహరి వైయాకరణి బౌద్ధుఁ డనుట కిది యుపబలముగా నున్నది. కుమారిలభట్టు వాక్యపదీయకర్తను నిరసించినవిధము చూడ నతఁడు కేవల బౌద్ధుఁ డై యుండె ననుట కే సంశయమును లేదు.

"సుభాషితత్రిశతికర్త యన్ననో వేదాంతవిషయతత్పరుఁడైన శివభక్తుఁ డగుట ఆగ్రంథమే యుద్ఘోషించుచున్నది. వేయేల? "దిక్కాలాద్యనవచ్ఛిన్న" యను నీతిశతక ప్రథమశ్లోకము ఈకవి వేదాంతతత్పరతను రూఢి కెక్కించును. దీని నాధారముగాఁ గొని భర్తృహరి క్రీ. పూ. ప్రథమ

శతాబ్దివాఁడు కాఁడన్న శ్రీ తెలంగుగారి వాదము ఇంతటితో గోడచాటగు చున్నది” అని.

## భర్తృహరియు భట్టియు

భట్టికావ్యకర్త యగు భట్టియే భర్తృహరి యని యొక ప్రతీతి గలదు. ఈ భట్టి శతకకర్త యగు భర్తృహరియా, వాక్యపదీయకర్త భర్తృహరియా యని శంక పుట్టుచున్నది.

భట్టి విష్ణుభక్తుఁడు; వాక్యపదీయకర్త బౌద్ధుఁడు. కనుక భట్టి వైయాకరణిభర్తృహరి కాఁడు. ఇఁక శతకకారుఁ డగుభర్తృహరి యగునేమో యాలోచింపవలసియున్నది. జనశ్రుతిని విడిచి యిరువురచరిత్రములను బరిశీలించిన నిద్దఱు నొక్కరే యనుట పొసఁగ కున్నది. భర్తృహరి క్షత్రియుఁడు, భట్టి బ్రాహ్మణుఁడు. భర్తృహరిది మధ్యభారతదేశము, భట్టిది యతని కావ్యప్రమాణములనుబట్టియే వలభీరాజాస్థానము. వీరిరువురిశైలులందును భేదము గల దని పండితులు ప్రమాణీకరించియున్నారు. భట్టిరచన పదప్రయోజన మెఱిఁగిన దై వ్యాకరణదోషలేశమును లేక ప్రౌఢ మై యర్థనిబిడమై యుండును. భర్తృహరిరచనంగూర్చి యిట్లు రూఢిగాఁ బలుకఁజాలము. కొన్నియెడల అన్వయక్లిష్టత, అసంగతాన్వయము, దుష్టపద పేశలపదప్రయోగము నందందు గోచరించును. మఱియు భట్టి విష్ణుభక్తుఁడు; శతకకర్త శివకేశవుల యం దభేదప్రతిపత్తిగల యద్వైతిగాఁ గన్పట్టినను శివపక్షపాతమును తెలిపియున్నాఁడు. పూర్వగ్రంథకర్త లీయిరువుర గ్రంథములనుండి యుదాహరించునపుడు వానిని భిన్నకవికృతములుగా వ్యవహరించిరి గాని యేకకవికృతములుగాఁ జూపరైరి. ఇంతకన్నను బలీయములగు ప్రమాణములుగాని వాదోపపత్తులుగాని లభించునంతవఱకు వీయిరువురును భిన్నవ్యక్తు లని నిశ్చయించుటయే యుక్తము.

## బౌద్ధమతసూచనలు

శతకములందు బౌద్ధమతసిద్ధాంతసూచనలు కల వందురు. బౌద్ధధర్మములను నీతుల నుపదేశించు గ్రంథముల నుండఁదగువిశేషలక్షణము లిందేవియుం గానరావు. బౌద్ధము లని యనుమానింపఁదగుపట్టులు సైతము రూఢియైనవి కావు. బౌద్ధమతపరిభాష యత్యల్పముగఁ గన్పడును. బౌద్ధమతము దేశమంతట ప్రబలియుండినవిషయము నాలోచించిన దానిప్రభావము కొద్దిగానో గొప్పగానో సార్వత్రికమై యుండక తప్ప దనుట స్ఫురించును. కనుక వాని చిహ్నె లటనట గనఁబడుట యొకవింత గాదు. మఱి వేదాంతదర్శనప్రదర్శకములకు శతకత్రయమున మితి లేదు. "త్రిభువన మపి బ్రహ్మామనుతే," 'లీయే పరబ్రహ్మణి,' 'పాణిః పాత్రం,' 'ఏకాకీ నిస్పృహాః,' 'మాతర్మేదిని' మున్నగు శ్లోకములు వేదాంతదర్శనప్రశంస యొనర్చును; 'విపది ధైర్య,' 'కరే శ్లాఘ్యస్త్యాగః,' 'శ్రోత్రం శ్రుతే నైవ,' మున్నగునవి వేదాభ్యాసమునఁ గవికిఁ గలగౌరవమును సూచించును. కవి పరామర్శించు యోగప్రక్రియయు, దశావతారములును, గంగానదియుఁ, హిమాలయములును అతఁడు బౌద్ధేతరుఁ డనుటనే చాటును.

## ఆంధ్రరచనము

ఇట్టి యీమహనీయంబగు శతకత్రయమును పలుభాషలలోనికి ననువదించి యున్నారు. క్రీ. శ. 1651-వ సం॥ నాఁటికే అబ్రహాము రోజరు దీనిని డచ్చి (ఒలాందావారి) భాషలోనికి పరివర్తనము కావించెను. దీనికి ఆంధ్రీకర్తలు ఎలకూచి బాలసరస్వతి, ఏనుఁగు లక్ష్మణకవి, పుష్పగిరి తిమ్మన అనువారు ముగ్గురు. ఈముగ్గురిలో నర్వాచీనుఁడు

## పుష్పగిరితిమ్మన.

తిమ్మన ఉత్తరరామాయణకర్త యగు కంకంటిపాపరాజు మిత్రుఁడు. పాపరాజు క్రీ. శ. 1790 ప్రాంతములవాఁ డని చరిత్రకారులు నిశ్చయించి

యుండుటచే నీతిమ్మకవియు పదునెనిమిదవశతాబ్దాంతమువాఁ డనుటకు సంది యము లేదు. తిమ్మకవి హనుమంతుని జననాదికమేగాక. యతనినిగూర్చి లోక మున చెల్లాచెదరై వ్యాపించియున్నగాథల నన్నిటిని సమకూర్చి భారతవాసిష్ఠ రామాయణములందలి యితివృత్తములతో మేళవించి సమీరకుమారవిజయమను నేడాశ్వాసములకావ్యమును రచించియున్నాఁడు. అందాదిని తన్నుఁగూర్చి,

"శ్రీహనూమత్పాదసేవాగతాఢ్యాత్మ
తత్త్వకవిత్వమహత్త్వవిదుఁడ
నాశ్వలాయనసూత్రహారి విశ్వామిత్ర
గోత్రాబ్ధిచంద్రుఁడఁ గుశలమతిని
అలపుష్పగిరి యప్పనార్యున కౌబళాం
బకును సుపుత్త్రుండ బ్రహ్మవేత్త
యైనవేంకటకృష్ణయార్యాగ్రణికిని వేంక
టాఖ్యకవీంద్రున కవరజుండ
సరసగుణయుతుండ వరకవిఁ దిమ్మనా
హ్వయుఁడ నేను జననమంది మనుట
కెల్ల ఫలము గల్గఁ గృతి యొక్కటి రచింప
నూహ సేయుచున్న నొక్కనాఁడు."

అని పలికియున్నాఁడు. ఇతఁడు భర్తృహరిశతకములలో నీతిశత కమునుమాత్రమే ఆంధ్రీకరించెను. కవి సంస్కృతాంధ్రముల సమానపాండి త్యము కలవాఁడైనను పాపరాజుకంటె నితనికవిత్వమున రసోదయము తక్కువ; లక్ష్మణకవి నీతిశతకపద్యములకన్నను కొంత లొచ్చుగనే యుండును. ఈకవి నివాసస్థలము నెల్లూరిమండల మని యామండలచరిత్రమునుబట్టి తేలు చున్నది.

## ఏనుఁగు లక్ష్మణకవి

తిమ్మనకు కొంత పూర్వుఁడు ఏనుఁగు లక్ష్మణకవి. లక్ష్మణకవి ఆఱువేల నియోగిశాఖకుఁ జెందినవాఁడు. ఈయనవంశములోని పూర్వపురుషులలో నొకఁ డగు జలపాలమంత్రి పెద్దాపురసంస్థానాధీశ్వరులయొద్ద నేనుఁగును బహుమానముగా పడయుంటచే వీరిపూర్వగృహనామము పైడిపాటివా రనునది ఏనుఁగులవారుగా మాఱెను. ఆజలపాలమంత్రి మునిమనుమఁడు లక్ష్మణమంత్రి. ఆయనమనుమడు మనకవి. ఈవంశము కవులవంశముగనే గనఁబడుచున్నది.

లక్ష్మణకవి రామేశ్వరమాహాత్మ్యము, విశ్వామిత్రచరిత్రము, సంస్కృత సూర్యశతకము, గంగామాహాత్మ్యము, సుభాషితరత్నావళి, రామవిలాసము మున్నగుగ్రంథముల నెన్నో వ్రాసియున్నాఁడు. ఈయన పదునెనిమిదవశతాబ్ద ముత్తరార్ధమున కవిసార్వభౌముఁ డని ప్రసిద్ధిగాంచిన కూచిమంచి తిమ్మకవికి సమకాలికుఁ డగుటయు, శ్రీవత్సవాయతిమ్మజగపతివారి కాశ్రితుఁ డగుటయు, ఆతిమ్మజగపతి 1797-లో పరిమపదించుటయుఁ గన్న నీకవి పదునెనిమిదవ శతాబ్ద ముత్తరార్ధమువాఁ డనియు, తిమ్మకవికి సమకాలికుఁ డనియు నిశ్చయింపవచ్చును.

లక్ష్మణకవి సుభాషితత్రిశతిని మనోహరముగ, యథామూలప్రౌఢముగఁ సందర్భసముచితశైలిలో రచియించె నని పెద్దలయభిప్రాయము. పద్యములు సరసముగ నుండు ననుట కతనిపద్యములను పండితులు పామరులుగూడ పఠించు చుండుటయే సాక్ష్యము.

లక్ష్మణకవి భర్తృహరిని అతనిగ్రంథమునుగూర్చి తనకు సాంబశివుఁడు కలలో పలికినటుగా నిట్లు పలికియున్నాఁడు:

> "భర్తృహరి యనఁదగిన భూభర్త నాదు
> భక్తిచే యోగిజనసార్వభౌముఁ డగుచు
> నీతి శృంగార వైరాగ్యరీతు లలర
> వృత్తశతకత్రయము రచియించె మున్ను.

వెలయు సుభాషితరత్నా
వళి యన భర్తృహరియోగివరకృతి వివిధో
జ్జ్వలగుణశోభితమయి సొం
పులుగుల్కఁ రసజ్ఞకంఠ భూషణ మగుచున్.
అమ్మహాకృతి నీవు రమ్యాంధ్రదేశ
భాషచే సరసముగఁ గబ్బము రచించి
మాకు సదుపాయనముగ సమర్పితంబు
సేయుము నితాంతభక్తి విశేషయుక్తి."

[సుభాషితరత్నావళి అవతారికాపద్యములనుండి.]

ఇఁక మన ప్రకృతగ్రంథము రచించిన ఎలకూచి బాలసరస్వతింగూర్చి ముచ్చటింతము.

## ఎలకూచి బాలసరస్వతి

భర్తృహరిసుభాషితముల నాంధ్రీకరించినవారిలో నితఁడు మొదటి వాఁడు. ఇతఁడు క్రీ. శ. పదునాఱవశతాబ్దాంతమందును పదునేడవశతాబ్ది పూర్వార్ధమునను ఉండినట్లు పెద్దలు నిశ్చయించియున్నారు. ఇతనికి మహోపాధ్యాయబిరుదము కలుగుట చూడ నితఁడు కవిగాకంటె పండితుఁడుగా ప్రసిద్ధికెక్కె ననుట తెల్లము. ఇతనికి సంస్కృతాంధ్రములు రెంటను ఉద్దండమగు పాండితీవిశేషము కల దనుట కీయన శతాగ్రగ్రంథకర్త యగుటయే తార్కాణము. ఈయన తాను రచించిన యాదవరాఘవపాండవీయ మను మూఁడర్థముల కావ్యమున తనవిషయము నిట్లు వర్ణించుకొనియున్నాఁడు.

"కవిసమీహితరంగకౌముదీనా
టకవిధానప్రతిష్ఠాఘనుండ
సారసారస్యసచ్చంద్రికాపరిణయ
ప్రముఖశతాగ్ర ప్రబంధకర్త

సంధ్రచింతామణివ్యాఖ్యానభాషావి
పరణాదిబహుతంత్రకరణచణుఁడ
వేదశాస్త్రపురాణవివిధసంగీతసా
హిత్యాది విద్యోపబృంహణుండ
ననఘు కౌండిన్యగోత్రుండ హరిపదాబ్జ
భక్తిశీలుండ నెలకూచి భైరవార్య
కృష్ణదేవతనూజుండ నే విచిత్ర
కావ్య మొక్కటి నిర్మింపఁగాఁ దొడంగి.

"మెండై నట్టి విచిత్రవైఖరులచే మీఁదౌ మహాకావ్యముల్
దండిం దొల్లియె చేసి రాదిమలు తత్కావ్యాధికశ్లాఘ్యమై
యుండన్ రాఘవకృష్ణపాండవకథాయుక్తప్రబంధంబు వా
క్పాండిత్యం బలరార శ్లేషరచనైకప్రౌఢి నే జేసెదన్."

అని వ్రాసికొనియున్నాఁడు. కాని యీమల్లభూపాలీయమున కవతారికాపద్యములు దొరకమిచే నందేమి వ్రాసికొనియున్నాఁడో తెలియరాదు.

ఈయన కృష్ణామండలవాసి యైనట్లును, అచటికి సమీపముననే యుండు నిజామురాష్ట్రములోని సంస్థానాధిపతులకు తన గ్రంథముల నంకిత మొనర్చి నట్లును తెలియనగుచున్నది. ఈయన తన చంద్రికాపరిణయ మనుగ్రంథమును పత్తియాలాధీశునకును, మల్లభూపాలీయమును జటప్రోలు సంస్థానాధీశ్వరులైన సురభిమల్లభూపాలునకును నంకితములు కావించెను. మల్లభూపాలుఁ డీ కవికి రెండువేలదీనారముల నొసఁగి బహూకరించెనఁట. కృతిపతివంశజు లగు శ్రీ సురభి రాజా వేంకటలక్ష్మారావు బహదూరువారిదివరలో నీమల్లభూపాలీయమును ప్రకటించియుండిరి. ఈకవి రచించిన యాదవరాఘవపాండవీయము త్ర్యర్థికావ్యములలో మొట్టమొదటిది. ఈయన రచించిన రంగకౌముది అప్పు డప్పుడె వెలువడుచున్న యక్షగానములలో నొకటియై నాటకముల కుపలక్షణ

ముగా నున్నట్లు తోఁచును. ఈయన ఆంధ్రశబ్దచింతామణి యనునన్నయ భట్టీయమునకు తెనుఁగుటీక వ్రాసెను. కనుక నితనిని ప్రబంధ, ద్వ్యర్థి కావ్య, కావ్యాలంకారసంగ్రహములను రచించిన భట్టుమూర్తితోఁ పోల్ప నగును.

## కవిత్వము

ఇతనికవిత్వమున జీవ మట్టిపడుచుండును. శైలి మనోహరమై, దీర్ఘసమాసభూయిష్ఠముకాక, తెనుఁగుశబ్దములమీఁది మక్కువ నెక్కువగఁ జాటును. ఈ శతకత్రయమునకు మకుటముగా నా యా శతకవిషయములకుచితమగునట్లుగా నిడిన "సురభిమల్లా నీతివాచస్పతీ," "సురభిమల్లా మానినీమన్మథా," "సురభిమల్లా వైదుషీభూషణా," అను సంబోధనములు మధురములై వీనులవిందై యున్నను గ్రంథమాద్యంతము శార్దూలమత్తేభవిక్రీడితవృత్తములు రెంటియందే రచియింపవలసిననిర్బంధమును, తత్ఫలముగా మూలములోని కొన్నిభావములను త్యజించుటయు, కొన్నిటిని విపులీకరించుటయు సంభవించి యేనుఁగు లక్ష్మణకవిగారిపద్యము లంత సరసముగా నున్నట్లు కన్పట్టవు. పద్యమకుటమునుబట్టి గ్రంథమునకు మల్లభూపాలీయ మను నామము సిద్ధించినది. ఇది మన తెనుఁగుశతకములకుఁగల సామాన్యలక్షణమే.

ప్రథమదళకములోని 'శక్యోవారయితుం' అను చివరిశ్లోకము త్యక్తము. 12, 18, 31, 48, 68, 74, 81-లలో కొన్ని మూలశబ్దము లాంధ్రీకరింపఁబడవు. "ప్రియసఖ, విపద్దణ్డాఘాత" యనుశ్లోకమునకు మాఱు వేఱొకభావము 87-వ పద్యము ప్రకటించును; దీనికి మూలశ్లోక మిప్పటిముద్రణములలో కానరాదు. ప్రతిశ్లోకములోను మూలకారుఁ డేవరుసను భావప్రకటనము గావించెనో యావరుసకు భంగము రానీయని తెనిఁగింపు తక్కినవారిది; ఈయన తెనిఁగింపున నానిర్బంధము లేదు. మూ. ప. 4, 5, 45, 56, 60, 69, 98 మొ॥ మూలములోని సంకుచితభావమును విపులముగా తెలిపియుండుటకు ప. 4, 56, 25, 61, 69, 93, 94 మొ॥ చూడునది. పుగటున నింపలికవిత్వము మనోహరమై యుండును.

ఈయన లక్షణసేతూల్లంఘనము చేయఁడు. కాని 'కూశెవ్వరు, రోఁత్రై' అను నొకటిరెండుమాత్రము విచార్యములు. యతివిషయమున 16, 18, 19 45, 60, 63, 64, 71, 72, 74, 97-పద్యముల చివరిపాదములు పరిశీలింపఁదగినవి. 87-వ పద్యమున నొకచోట ర-ఱ-లకు యతి కూర్పఁబడినది. మొఱకు, పెంపఱు, ఈడేఱు మున్నగుశబ్దములను రేఫయుంతముగాఁ బ్రయోగించుట చూడ నివి ర-ఱ-సాంకర్యమందినశబ్దము లేమో యని తోఁచును.

## శతకత్రయోపదేశము

కావ్యమూలమున నీత్యుపదేశ మీభరతఖండమున ననాదిసిద్ధమైన యాచారము. మహాభారతరచనమునకు సైతము పూర్వ మిట్టివి కల దనుట కందలి సూత్రప్రాయము లగు నీతివాక్యములే ప్రమాణములు. ఇట్టి రచనలకెల్లను ఆశయము ఐహికసౌఖ్యము లస్థిరము లనియు, నీతి, శాంతి, విరక్తులు అపేక్షణీయములనియు ప్రబోధించుటయే. అట్టిరచనములలో నీసుభాషితరత్నావళియొకటి. ఈరత్నావళి నీతిశృంగారవైరాగ్యము లనుమూఁడుశతకముల సంపుటము. దీనిని లఘువుగా నొకపరిపఠించువారి కిందు దైవాయత్తసూత్ర ముద్బోధితమని తోఁచును. అనాదిగా పునర్జన్మసిద్ధాంతము నాశ్రయించిన యీదేశమున నీతిబోధనమునందుఁగూడ భాగ్యాయత్తత చోరవచేసికొనుట యొక వింతకాదు. కనుక భర్తృహరిరచనలందును ఆసిద్ధాంతము తలయెత్తుకొని యున్నది. కాని సర్వము దైవాధీన మని నమ్మి పురుషకారమును సడ్డచేయని కొందఱిమతము వంటిది కా దితనిమతము. సమస్తమును దైవాధీన మయ్యును నా దైవము సైతము కర్మానుగుణముఁగ ఫలమిచ్చును కావున పౌరుషమును సత్కర్మాచరణమును అత్యంతావశ్యకము లని కవి సారెసారెకు విస్మరింప వీలుకానిపద్ధతిని ఉద్ఘోషించియున్నాఁడు. మఱియు కార్యారంభ మొనర్చుచో కార్యసిద్ధి యగునందాఁక విరమింపరా దనుట యీతని స్థిరోపదేశము.

## భర్తృహరి చాటిన సిద్ధాంతము లేవి ?

వేదములందును వేదాంతసిద్ధాంతములందును ధర్మపరులకు విశ్వాస మత్యవసరము. పరబ్రహ్మమందు లయించుటయే యానందమునకు పరమావధి. తత్సిద్ధికి ఆశాత్యాగము, వైరాగ్యానుభవము, కర్మోన్మూలనమును సాధనములు. ఇవియ ముఖ్యవేదాంతసిద్ధాంతములు. కనుక భర్తృహరి వేదాంతమతావలంబకుఁ డనుట విస్పష్టము. అచ్చటచ్చట యోగమును, దశావతారములను, గంగను, హిమాలయములను ప్రశంసించియుండుటఁ జూడ మానవులు తమ దైనందిన చర్యలలో నెట్టిదృష్టితో వ్యవహరింపవలె నని కవి యుద్దేశించెనో తెలియును.

పురుషుఁ డీలోకమున వాంఛింపఁదగినవానిలో నతిముఖ్యమైనది ఆత్మగౌరవము. తన్నెన్ని సంకటములు పైకొన్నను ఆత్మగౌరవమునకు స్వాతంత్ర్యమునకును లోటుపాటు కలుగనీయరాదని యెంతో మృదులమగుభాషలో నెన్నోపట్టుల కవి వివరించెను. మానవదృష్టి లక్షింపఁదగిన రెండవగుణముపట్టుదల, దృఢప్రవృత్తి; అభినివేశమును వ్యవసాయమును కొఱఁతవడిన నేకార్యమును సిద్ధింపదు; ధీరులు తాము పూనినకార్యమును సిద్ధి యగునంతవఱకు వదల రని రూఢిగా పలికెను. కవి మన కుద్బోధింప నెంచిన మూఁడవనీతి ధర్మానుష్ఠానము సాంఘికసేవ. పరోపకారాదిమహిమముల వర్ణించు పద్యము లతిసుందరములు, భావగంభీరములు నై యున్నవి. భర్తృహరిరచనలు ధైర్యమునందు సచ్ఛీలము నందు వాస్తవాభినివేశమును పురికొల్పును. సద్గుణము లన్నిటిలో సచ్ఛీలమే ఉత్తమోత్తమస్థాన మధిష్ఠించు ననుట కవిమతము. తన్మూలమున సాధింపఁదగిన శ్రేయములను పలురీతుల వివరించియున్నాఁడు కవి.

శృంగారశతకమున సామాన్యప్రసక్తములు కామాదికములు. వెన్నెల, మందమారుతము, సౌభాగ్యసంపద మున్నగునవి తరుణవయస్కులమనముల నెట్టిభావముల నుద్రేకింపఁజేయునో, అవి యెట్లు మనస్సును కలఁచివైచి శాంతిదూరముచేయునో, అభావముల వశీకరణ మొనర్చుకొని జితేంద్రియుం

లగుట కేది యుంపాయుమో కవి బహుహృద్యముగా మనసు నొప్పింపనిరీతిన వర్ణించెను.

వైరాగ్యశతకము వేదాంతసిద్ధాంతముల ప్రతిఫలింపఁజేయుచుండును. తృష్ణాచ్ఛేదన మావశ్యకము. ఐహికబంధనమునకు మూలము లోభము. వాని మూలమున ధనవంతులు మదాంధు లగుదురు; కావున వానివిషయమున జాగ్రత్తవహించుట శ్రేయము; ఇహలోకసౌఖ్యములందు తగుల్కొని శాశ్వత పరలోకమును విస్మరించి మనశ్శాంతిని కోల్పోవుటకన్న నడవులఁ జేరి శాంతి మనస్కులగుటయే పరమోత్కృష్టకార్య మనుట కవి యాశయము. వైరాగ్య తత్పరుఁడై సర్వశక్తి యగుభగవంతునియందు మనస్సును లీనముగావింపఁ గల్గిన సన్న్యాసి దేశపాలనము చేయుసెపమున భోగలాలసుఁ డగురాజుకన్నను ఉత్తముఁడు; ఆత్మైక్యముచే సన్న్యాసి శాశ్వతానంద మనుభవించు ననుట యతనియుపదేశము.

శ్రీరమేశచంద్రదత్తుగారు తాము వ్రాసిన ప్రాచీనభారతేతిహాసము అను గ్రంథమున నిట్లు లిఖంచియున్నారు.

"ప్రొఫెసరు లాసనుగారు భర్తృహరిశతకములంగూర్చి ప్రకటించిన యభిప్రాయముతో పాఠకు లెల్లరు నేకీభవింతురు. 'భర్తృహరి శ్లోకములు సంక్షిప్తములు, సూత్రప్రాయములు; కనుకనే యవి సర్వజనాదరణీయములైనవి. అతనికృతులు భారతీయసారస్వతమున నుత్తమస్థాన మలంకరించు ననుట నిస్సంశయము" అని నుడివియున్నారు. శైలి సగటున సులభమైనను కొన్నియెడల సంక్షేపప్రయత్నము విస్పష్టతను కొఱఁతపఱచును. చిన్నచిన్న శ్లోకములన్నను భావగంభీరములును లలితపదయుక్తములునుగ చిత్రింపఁబడుటచే నొకపరి చదివినంతనే మనమున నాటుకొనఁదగియుండును. ఈశ్లోకములను వ్యవహారించనివా రరుదు. పెద్దవృత్తములందు సైతము దీర్ఘ సమాసములు కానరావు. కొన్నిపట్టులమాత్రము శ్లోకము తుదిపాద మొక్కటే దీర్ఘసమాసప్రాయమైనను, దానిమూలమున శ్లోకభావము కుంటు

పడక గాంభీర్యయుక్త మగును; పేశలముగ ముగించుచో నంతహృద్యము కాకపోవచ్చును. దానివలన మాధుర్యమున కొక్కింతలోటు చేకూఱినను ఉద్దిష్టార్థము నిరాడంబరము సునిశితమునై మనోహర మగును. శైలి నీతిమత బోధనలకు సహజముగ నున్నది. శతకము లన్నిటియందును అలంకారములు సహజములు, అక్లిష్టములు, విషయస్ఫూర్తికి సహకారములు. భర్తృహరి భావములను సహృదయాహ్లాదకముగ దృష్టాంతముల నొసఁగుటలో మేలుచేయి; అతని వర్ణనలు చిత్రములు, చిత్తాకర్షకములు. అతఁడు ప్రకృతి పరిశీలనము సూక్ష్మతరదృష్టితో చేసినవాఁ డనుట నిస్సంశయము. ఇయ్యది యతనికి నీతిగర్భిత రచనమునకు మిక్కిలి తోడ్పడెను. స్వోద్దిష్టకృతిని అనుపమానముగా రచించుటలో నతని దంచె వేసినచేయి. దీని కతని గ్రంథము పరమజనాదరణీయ మగుటయే నిదర్శనము; అతనికి సంస్కృతసారస్వతమున నుత్తమస్థానము కలిగెను."

పాశ్చాత్యపండితుల యభిప్రాయములు కతిపయములతో నీయవతారిక పరిసమాప్తి నొందించెద.

"Scattered throughout the various departments of Sanskrit Literature, are innumerable apophthegms in which wise and noble, striking and original thoughts often appear in a highly finished and poetical garb. Owing to universality of this mode of expression in Sanskrit Literature, there are but few works consisting exclusively of poetical aphorisms. The most important are the two collections by the highly-gifted Bhartrihari entitled respectively, Nitisataka or century of conduct, and Vairagyasataka or century of renunciation." *Macdonnel.*

"Numbers of wise sayings have, from time immemorial been constantly quoted in conversation. Many, thus

orally current, were of such antiquity that to settle their authorship was impossible. But occasional attempts were made to give permanence to the floating wisdom of the day, by stringing together in stanzas, the most celebrated maxims and sayings, like beads on a necklace, representing a separate topic, and the authorship of a whole series being naturally ascribed to men of known wisdom like Bhartrihari, Chanakya, much in the same way as the authorship of the Puranas and the Mahabharata was referred to the sage Vyasa." *Monier Williams.*

సుభాషిత త్రిశతియనువాదకుల శైలిలోఁ గల తారతమ్యము తెలియుటకై మచ్చునకు ఒక్కొక్కపద్య ముదాహరించెద.

తిమ్మన

ఆపదలందు ధైర్యము మహాభ్యుదయంబున నోర్పుఁ బ్రౌఢవా
చాపటిమంబు రచ్చలను సంగరరంగమున న్పరాక్రమా
టోపముకీర్తినిచ్చయుఁ గడున్ వ్యసనంబు శ్రుతిన్ దలిర్పఁ బ్ర
జ్ఞాపరులొప్పుచుందు రివిసాజములై తమయందుఁ బొందఁగన్.

లక్ష్మణకవి

ఆపదలందు ధైర్యగుణ మంచితసంపదలందుఁ దాల్మియున్
భూపసభాంతరాళమునఁ బుష్కలవాక్చతురత్వ మాజి బా
హాపటుశక్తియున్ యశమునందనురక్తియువిద్యయందు వాం
ఛాపరివృద్ధియున్ బ్రకృతిసిద్ధగుణంబులు సజ్జనాళికిన్.

బాలసరస్వతి

ఆపత్తి న్ధృతి సంపద న్క్షమ శ్రుతిన్వ్యాసక్తి సద్గోష్ఠివా
చాపాండిత్యముపోరవిక్రమముభాస్వత్కీర్తిపై వాంఛయున్

రూపింప న్మహనీయులౌ జనులకెందు న్లక్షణంబు ల్సుమీ
యాపూర్ణప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ.

ఆంధ్రీకరణ త్రిశతిలో లక్ష్మణకవిరచిత నీతిశతకభాగము పలుతావుల దుర్లభ్యభాగ మగుచుండుటచే దానికి సంపూర్ణముగ వ్యాఖ్యరచింప బహుకాలముగఁ దలంపుఁగొనియుంటిని. అట్టితరుణమున నన్నిమల్లభూపాలీయ నీతిశతక భాగమునకు వ్యాఖ్యవ్రాయుటకు ప్రోత్సహించి ప్రచురించిన శ్రీయుతులు భాషోద్ధారక వావిళ్ల వేంకటేశ్వరశాస్త్రులవారి కెంతయు కృతజ్ఞుఁడను.

దీనిని రచించుటలో వావిళ్లవారియొక్కయు, కీ. శే॥ పండిత శ్రీ కాళే గారియొక్కయు, శ్రీ వేదము వేంకటరాయశాస్త్రులవారియొక్కయు ముద్రణములు నాకెంతో సాయపడినవి. వారికి నేనెంతయు కృతజ్ఞుఁడను. సంస్కృత నీతిశతకమునకు వ్యాఖ్యలు విపులముగాఁ గలవు; అట్టిదే తెనుఁగుశతకమునకుం గూడ నొకవ్యాఖ్యయున్న విద్యార్థులకు కవియుద్దేశము మఱింత విస్పష్టము కాఁగల్గును, కావ్యపఠనమునకును సత్ఫలము సిద్ధించు నన్నభావమే నా యీ ప్రయత్నమునకు మూలము. యథాశక్తి నాంధ్రభాషకు నేఁ జేసిన యీసేవ యందు అజ్ఞతాప్రమాదాదివశమున దొరలినదోషములను పరిశీలించి యెఱుక పఱచుచో రెండవకూర్పున సరిదిద్దుకొని ధన్యుఁడ నయ్యెదను.

చెన్నపురి.<br>3-10-45. } — వేదము లక్ష్మీనారాయణశాస్త్రి.

# పద్యసూచిక

శ్రీరస్తు

మహామహోపాధ్యాయ ఎలకూచి బాలసరస్వతికృత

# మల్లభూపాలీయము

# నీతిశతకము

## మంగళాచరణము

అవతారిక: గ్రంథాదిని మంగళాచరణమును జేయుట కవిసంప్రదాయము. నీతిశతకమును రచింపఁబూని మొదట జ్ఞానానందమయుఁడగు సర్వేశ్వరునకు నమస్కరించుచున్నాఁడు.—

శా. శ్రీమద్బాలసరస్వతీప్రకటలక్ష్మీహేతువై శాంతమై
యామోదావహమై నిజానుభవవేద్యంబై యనేహోదిగా
ద్యామేయప్రవిబోధరూపమహితంబై యొప్పు తేజంబు ప్రా
పై మీకున్నిరులీవుతన్ సురభిమల్లా నీతివాచస్పతీ. 1

నీతివాచస్పతీ = నీతికి బృహస్పతివంటివాఁడా, సురభిమల్లా = సురభి వంశమున జనించినమల్లభూపాలా [ఈమకుటము శతకమంతటికిని సమానము].

శ్రీమత్ = ఒప్పిదమయిన, బాలసరస్వతీ = బాలసరస్వతి (కవి)యొక్క— ప్రకట = ప్రసిద్ధమైన—లక్ష్మీ = సంపద(శోభ)కు—హేతువు = కారణము, ఐ = అయి, శాంతము = ప్రసన్నము, ఐ, ఆమోద + ఆవహము = సంతోషము కూర్చునట్టిది, ఐ, నిజ + అనుభవ + వేద్యంబు = తన్ననుభవించుటచేతనే తెలియఁదగినది, ఐ అనేహః = సమయము (కాలము)—దిక్ = దిక్కు—ఆది = మొదలగువానిచేత, అమేయ = మితియిడఁదగని (ఎల్లతావులందును ఎల్లకాలమందును ఉన్నట్టి అనుట). ప్రవిబోధ = జ్ఞానమే, రూప = రూపముగాఁ గలిగి, మహితంబు = మిక్కిలి

గొప్పది, ఐ, ఒప్పు, తేజంబు=వెలుఁగు (జ్యోతీరూపము), మీరున్, ప్రాపు= ఆశ్రయము, ఐ, సిరుల్=సంపదలను, ఈవుతన్=ఇచ్చునుగాక.

కవియగు బాలసరస్వతియొక్క శోభకు కారణమై, కాంతమై, సంతోషము కలిగించునదై, త న్ననుభవించువారికిమాత్రమే యెఱుఁగఁదగినదై, సర్వ ప్రదేశములందు సర్వకాలములందును ఉన్నదై, కేవలము జ్ఞానస్వరూపము నందియున్నపరమాత్మ నీతివాచస్పతి యగు సురభిమల్లభూపాలునకు సకలైశ్వర్యముల నొసఁగుఁగాక.

ఇది గ్రంథమునకు కృతిభర్త కాశీర్వాదరూపక మగు ప్రారంభము.

ఈవుతన్ - ఆశీశ్శాప ప్రార్థనార్థకములందు ఎడును, తను-అను ప్రత్యయము లగును.

ఇచ్చు+తన్—తన్-పరమగునపుడు 'ఇచ్చు-'నకు 'ఈవు' ఆదేశ మగును.

## మూ ర్ఖ ప ద్ధ తి

2. అవ. ప్రబంధములో వివిధస్వరూపములను ఆయాపద్ధతుల నిరూపింప నెంచి మూర్ఖవిద్వత్పద్ధతులలో వ్యావర్తకభావవిశిష్టత్వముచేత ఉభయపద్ధతులను నిరూపింపవలసి తొలుదొల్త ముఖ్యప్రసంగసంగతికి అన్యతరము లేనందున అశోకవనికాన్యాయమున మూర్ఖపద్ధతివర్ణన మారంభించుచున్నాఁడు. అందు ఆదిని సహృదయులకు అభావ మగుటచే మంచిమాట చెప్పిన వినువారు అరుదు అనుచున్నాఁడు.—

మ. సతతంబు న్మది మత్సరాఢ్యులు పరిజ్ఞాత, ల్మహీనాథు లా
తతసంపన్మదదుష్టచిత్తు, లితరు ల్తర్కింప నజ్ఞానదూ
షితభావు,ల్వినువార లేరి? యొడలన్ జీర్ణంబు లౌఁ గాక యా
ర్యతతు ల్నేర్చినసూక్తము, ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 2

సురభి...స్పతీ, పరిజ్ఞాతలు=తెలిసినవారు, సతతంబున్=ఎల్లప్పుడును,

మదిన్=మనస్సునందు, మత్సర+అధ్యులు=(వీఁడును మహాపండితునివలె ప్రసిద్ధిని పొందుటయా అను) అసూయచే కూడుకొన్నవారు; మహీనాథులు=రాజులు, ఆతత...చిత్తులు-ఆతత=ఎక్కువ తెగని, సంపత్=ఐశ్వర్యముపలని, మద=గర్వముచేత, దుష్ట=చెడ్డదయిన, చిత్తులు = మనస్సుకలవారు, (వినయవంతులు కారని భావము); తర్కింపన్ = ఆలోచింపఁగా, ఇతరుల్ = ఇతరులు (పైన పేర్కొన్న యిరువురును గాక తక్కినవారు), అజ్ఞాన దూషిత భావుల్ = తెలియమిచేత దుష్టమైన మనస్సుకలవారు (కనుక వారికి వినుట కధికారము లేదు. ఇఁక), వినువారలు, ఏరి=ఎక్కడ నున్నారు? ఆర్యతతుల్ = పెద్దలు· చేర్చిన, సూక్తముల్=మంచిమాటలు, ఒడలన్=ఒడలియందే, జీర్ణంబులు కాఁగాక = క్షయించునుగాక.

సాహిత వాక్యములను తెలిసినవారు "వీఁడును మహాపండితునివలె ఖ్యాతిని పొందవచ్చునా" యన్న యసూయతో నున్నారు. రాజులు "మాకుఁ దెలియదా? మాకొకఁడు చెప్పువాఁడును మేము వినువారమునా!" అని గర్వాంధులై యున్నారు. సామాన్యులకా వినునంతటి తెలివి లేదు. కనుక సాహితవాక్యము నాయందే యణఁగిపోవుచున్నది.

ఏరి - 'ఏఁడు' 'ఏరు' అని సర్వనామములు 'ఈ' యను నవ్యయము తోఁ గూడి క్రమముగా 'ఎక్కడ నున్నాఁడు? ఎక్కడ నున్నారు!" అనెడి యర్థములందు స్థిరపడినవి. ఏరీ-రూ. ఏరి.

3. అవ. తెలిసీ తెలియనివానిని రంజింపఁజేయుట అశక్యము అనుటః—

మ. నిలుపన్వచ్చుస్వభావమూర్ఖుఁడగువానింగొల్చి, యత్యంతము
న్నిలుప న్వచ్చు విశేషవేది యగువానింగొల్చి, యెందేని జ్ఞా
నలవాహంకృతిదుష్టుఁ డైనమనుజు న్రంజింప శక్యంబు గా
దలభాషాపతి కేనియు; న్సురభిమల్లా నీతివాచస్పతీ. 3.

సురభి...స్పతీ, స్వభావమూర్ఖుఁడు=పుట్టుకవల్లనే మొండి, అగువానిన్

=అయినట్టివానిని, కొల్చి=సేవించి, నిలుపన్ వచ్చున్=(మంచిమార్గమున) నిలఁ బెట్టవచ్చును; విశేషవేది అగువానిన్=విశేషముగా ఎఱిఁగియున్నవానిని, కొల్చి అత్యంతమున్ = (మిక్కిలి)అనాయాసముగా, నిలుపన్ వచ్చున్; జ్ఞానలవ+ అహంకృతి దుష్టుఁడు=తెలివియొక్క లేశముచేత కలిగిన గర్వముచే చెడ్డవాఁడు, ఐన, మనుజున్=మానవుని, ఎందేనిన్=ఎచ్చటనైనను ఏకాలమందైనను, అల భాషాపతికేనియున్=ఆబ్రహ్మదేవునకైనను, రంజింపన్=ఒప్పించుట, శక్యంబు కాదు=అలవి కాదు.

తెలియనివానికి సులభముగఁ దెలుపవచ్చును. చక్కఁగఁ దెలిసిన వానికి సమాధానముచెప్పుట మఱింత సులభము. స్వల్పజ్ఞానము కలిగి సర్వజ్ఞుఁడ నని గర్వపడువానిని సృష్టికర్త యగు బ్రహ్మదేవుఁడు సైతము రంజింపఁజేయఁ జాలఁడు.

అల - ప్రసిద్ధిని తెలుపు విశేషణము. రూ. అల్ల.

రంజనవిషయమున సైతము అసంబంధమును దెల్పుటచే అసంబంధాతిశయోక్తి అలంకారము.

4. అవ. మూర్ఖునిచిత్తము సంతోషపఱుప నశక్యమైన దని రెండు పద్యములచే సూచితము:—

శా. కాలాహిం దలఁ దాల్ప వచ్చు, విరిపొంకానం దరంగప్రజో
త్తాలం బైనపయోధిఁ జేతులనె యీఁద న్వచ్చు, నక్రోగ్రదం
ష్ట్రాళిలగ్నం బగుమానికంబు హరియింప న్వచ్చు, నెట్లేనిమూ
ర్ఖాళిం దెల్పఁగ రాదు, శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 4

శ్రీసురభిమల్లా, నీతివాచస్పతీ, విరిపొంకానన్=పూలదండవలె, కాల+ అహిన్ = నల్లనిత్రాఁచుఁబామును, తలన్ = తలయందు, తాల్పన్ వచ్చున్= ధరింపవచ్చును; తరంగ ప్రజ+ఉత్తాలంబు+ఐన = అలలసమూహముచేత మిక్కిలి పెలరేఁగియున్న, పయోధిన్=సముద్రమును, చేతులన్+ఎ = చేతుల

తోనె (ఇతరసాధనములసాయము లేకయే), ఈఁదన్ వచ్చు; నక్ర(ఉగ్ర+దంష్ట్రా) లగ్నంబు = మొసలినోటిలోని వాఁడికోఱలయందు తగులుకొన్నట్టిని, అగు, మానికంబు = మాణిక్యమును (ముత్యము ననుట), హరియింపన్ వచ్చున్ = బలవంతముగా తీసికొనవచ్చును; (కాని) ఎట్టేనిన్ = ఏయుపాయము చేతను, మూర్ఖ, ఆళిన్ = మొండిపట్టుపట్టిన మూఢమానవులవరుసను, తెల్పఁగన్ రాదు = ఒప్పించుట సాధ్యము కాదు.

"కాల+అహి"—నల్లత్రాఁచును జెప్పుట సులభముగా కోపమునకు వశమై బుసకొట్టుటచేతనే విషమును నాలుకమూలముగా వెసఁజల్లున దని భావము. విరిపోఁకానన్ - అనుట అపాయము లేకయే గాక అలంకారముగా కూడ ననియు భావము. "తరంగ......లంబు" ఈఁతయం దెంతటి సమర్థునైనను ముంచివేయు ననియు. "హరియింపన్" మిక్కిలి నొప్పించి యనియు, "ఉగ్ర...లగ్నంబు" అనుటచే ఆకార్య మతిప్రాణాపాయకరమునగు ననియు అభిప్రాయములు. సముద్రము వైశాల్యమునకును, భయంకరములగు జలజంతువులకొఱకును, నక్రకాలాహులు క్రౌర్యమునకును ఘాతుకత్వమునకును చెప్పఁబడినవి.

త్రాఁచుఁబామును పూలదండవలె శిరమునఁ దాల్పవచ్చును; అలలచే అల్లకల్లోలమగు సముద్రమును ఈఁది దాఁటవచ్చును, మొసలినోటిలోని కోఱల నడుమనుండు ముత్యమును బలాత్కారముగా తీసికొనవచ్చును; కాని, మొండి పట్టుపట్టిన మూర్ఖునిమనమును సమాధానపెట్టుటకు మాత్రము సాధ్యము కాదు. మొదటచెప్పినవి మూఁడును అశక్యములు; ఈనాల్గవది అశక్యతరము అని భావము.

పోఁకానన్ - పోఁకము+నన్: లు, ల, న-లుపరంబులగునపు డొకానొకచో మువర్ణకంబునకు లోపంబును, తత్పూర్వస్వరంబునకు దీర్ఘంబును విభాష నగు. చూ. 49 ప. పయోధి: ఉపపదసమాసము.

5. పై విషయమునే ప్రకారాంతరముగ వివరించుచున్నాఁడు:—

మ. వసుధంగుందెటికొమ్ము తెచ్చుకొనఁగావచ్చుం బ్రయత్నంబునన్

వెసఁ ద్రావ న్జల మెండమావులనె యేనిం గాంచవచ్చు, న్నిజం
బిసుకన్ నూనియుఁ బిండవచ్చుఁ, బ్రతిభాహీనాత్ముఁడౌ మూర్ఖుఁ దె
ల్పు సమర్థత్వము లేదిల, న్సురభిమల్లా నీతివాచస్పతీ. ౫

వసుధన్ = భూమియందు, ప్రయత్నంబునన్ = మిక్కిలియత్నించుట చేత, కుందెటికొమ్ము=కుందేటికొమ్మును (లోకములో లేనిదానిని), తెచ్చుకొనంగాన్ వచ్చున్=సంపాదింపవచ్చును. ఎండమావులనెయేనిన్ = మిట్ట మధ్యాహ్న వేళ బయళ్లయందు నీటివలెఁ దోఁచెడి సూర్యకిరణముల (మరీచికల) యందేయైనను, వెసన్=శీఘ్రముగా, త్రావన్=త్రాగుటకు, జలము=నీటిని, కాంచన్ వచ్చున్=పొందవచ్చును. నిజంబు=నిశ్చయముగా, ఇసుకన్=ఇసుకలోనుండి, నూనియున్=నూనెను, పిండన్ వచ్చున్=పిండవచ్చును. ప్రతిభాహీనాత్ముఁడు = బుద్ధిలేని వాఁడు, అగు, మూర్ఖున్ = మూర్ఖుని, తెల్పన్ = బోధించుటకు, ఇలన్ = భూమియందు, సమర్థత్వము=తగిన నేర్పు, లేదు.

దుర్లభమయినవస్తువును, దుష్కరమయిన కార్యమును సాధింప నుపాయములు కలవు కాని మూర్ఖచిత్తము రంజింపఁ జేయుసాధనము మాత్రము లేదు. ఎట్లనః లోకములో లేని కుందేటికొమ్మునైనను సంపాదింపవచ్చును; జలము కలదన్న భ్రమను పుట్టించు ఎండమావులలో నీళ్లయినను త్రాగవచ్చును; కాలత్రయమందును లేశమైన నూనె లేని యిసుకను అతిప్రయత్నముచే పిండి నూనెయేనియు దింపవచ్చును; గాని మూర్ఖులను మాత్రము సమాధానపెట్టుట సాధ్యము గాదు.

పైరెండుపద్యములలోను కాలాహిని తలఁదాల్చుట మున్నగువానిలో సంబంధము లేకున్నను సంబంధమున్నట్లు వర్ణించుటచే అతిశయోక్త్యలంకారము.

కుందెలు ః రూ. కుందేలు.

కుందేలు+కొమ్ము - కుందేలు షష్ఠీవిభక్తికము గాన 'టి' వర్ణాదేశమై "కుందేటికొమ్ము" అయినది. ఏనిన్ - ఏనియున్ = ఏని+ఉన్ - సముచ్చయ ఉకారలోపమున "ఏనిన్" అని శేషించును.

సూనియ: రూ. సూనె.

6. అవ: మూర్ఖుని సమాధానపఱుప నెంచుటయే యవివేక మనుట:

మ. దిరిసెంపువ్విరిచేత వజ్రమణి భేదింపం దలంచు, న్మద
ద్విరదేంద్రంబుమ్మృణాళతంతువునబంధింపంగనూహించు,మా
ధురి నింపం జనుఁ దేనెచే లవణపాథోరాశికి, న్మూర్ఖుఁ దె
ల్ప ఋజూక్తంబిడువాఁడు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ.

శ్రీసురభి......వాచస్పతీ; మూర్ఖున్=మూర్ఖుని, తెల్పన్ = తెలుపుటకు, ఋజు+ఉక్తంబు=మంచిమాటలను, ఇడువాఁడు=చెప్పయత్నించువాఁడు, దిరిసెంపువ్విరిచేతన్ = (అతికోమలమయిన) దిసెనపువ్వుచేత, వజ్రమణిన్=రవను, భేదింపన్=పగుల్చుటకు, తలంచున్=ఎంచును; మృణాళతంతువునన్=(ఏకొంచెము అడ్డుతగిలినను తెగిపోవునట్టి) తామరతూఁటిలోనిదారములతో, మద ద్విరదేంద్రంబున్=మదపుటేనుఁగును, బంధింపంగన్=కట్టివేయుటకు, ఊహించున్=తలఁచును. తేనెచేన్=తేనెతో, లవణపాథోరాశికిన్ = ఉప్పుసముద్రమునకు, మాధురి=తీపును,నింపన్ చనున్=నిండించుటకు యత్నించును.

దిరిసెనపువ్వుచేత వజ్రమును కోయఁజూచువాఁడును, తామరతూఁటిదారములతో మదపుటేనుఁగును బంధింపనెంచువాఁడును, తేనెచుక్కచేత ఉప్పుసముద్రమందలి నీటిని తియ్యగాఁ జేయుటకు యత్నించువాఁడును, మంచిమాటలతో మూర్ఖులను సమాధానపెట్టఁదలఁచువాఁడును సమానులు. పూర్వోక్తములగు మూఁడు కార్యములును దుష్కరములు; నాల్గవదగు మూర్ఖప్రసాదనము అత్యంతదుష్కరము అనిభావము.

నిదర్శనాలంకారము.

దిరిసెంపువ్విరి—'దిరిసెనము'-నకు రూపాంతరము దిరిసెము.

దిరిసెము+విరి=దిరిసెంపు+విరి=దిరిసెంపు+ను+విరి
=దిరిసెంపువ్విరి.

కర్మధారయమునందు ముపర్ణకమునకు పుంపులు బహుళముగా నగును.

వు, ంవు-లకు పరుషసరళములు పరములగునపుడు సుగాగమము బహుళముగా నగును. బహుళ మనుటచే స్థిరము పరమగునపుడును ఈయాగమ మొక్కచో నగును.

7. అవ. "మూర్ఖులకు మౌనమే భూషణము" అనుట:—

శా. స్వాయత్తంబుకడున్హితంబు నయిమౌర్ఖ్యంబప్రకాశంబుగాఁ
జేయన్ బ్రహ్మ సృజించినట్టివిబుధశ్రేణీసమాజంబులన్ [ణం
డాయన్మిక్కిలియుంబ్రియావహము మౌనంబొక్కటే భూష
బై యజ్ఞావళి కొప్పెడు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 7

సుర...స్పతీ, అజ్ఞావలికిన్=మూర్ఖులసమూహమునకు, బ్రహ్మ, సృజించినట్టి, విబుధశ్రేణీ సమాజంబులన్=పండితబృందముకూడిన సభలను, డాయన్=సమీపించుటకును, స్వాయత్తంబు-స్వ = తమకు (అపండితులకు)-ఆయత్తంబు= వశమైనదియు, కడున్ = మిక్కిలి, హితంబును = అనుకూలమును, అయి, మౌర్ఖ్యంబు = తమ అజ్ఞానమును, అప్రకాశంబుగాన్ చేయన్ = ప్రకాశింప కుండునట్లు మఱుగుపఱుచుటకును, మిక్కిలియున్=అధికముగా, ప్రియ+అవ హము = ప్రియముకలిగించునట్టిది, మౌనంబు = పలుకకయుండుట, ఒక్కటే= ఒకటిమాత్రమే, భూషణంబు=అలంకారము, ఐ, ఒప్పెడున్=ఒప్పుచుండును.

బ్రహ్మ మూఢులపై కరుణించి వారికొఱకు మౌనమును సృజించినాఁడు. అది యెప్పుడును వారివశమున నుండును; వారికి తప్పక మేలు చేయును; వారి యజ్ఞానమును తెలియరానీయక దాఁచును; గొప్పపండితుల సభలలో అలంకారముగా నొప్పును. దానిని విడిచినప్పుడు వారు హాస్యాస్పదు లగుదురు.

8. అవ. ఒకానొకపండితుఁడు స్వానుభవముచే నెఱిఁగిన "తెలివి లేనప్పుడు గర్వమును, తెలివి కలిగినప్పుడు వినయమును" ఉండుననువిషయ మును ప్రకటించుచున్నాఁడు.

మ. కరియుంబోలెమదాంధుఁడౌచున్నొరులం గైకొనకత్యుద్ధతుం

ష్కరుఁ డొక్కొక్కఁడు తా ఘనుండ ననుఁ, బ్రజ్ఞావంతులౌ ధీరశే
ఖరులం జూడఁగఁ జూడఁగా వరుసఁ దద్గర్వంబు రోగంబున
ట్లరుగ న్నీచుఁడఁ దా నను, సురభిమల్లా నీతివాచస్పతీ. 8

సురభిమల్లా, నీతివాచస్పతీ, ముష్కరుఁడు = మొండిపట్టుపట్టువాఁడు, ఒక్కొక్కరుఁడు = ప్రతివాఁడును, తొల్దొల్తన్ = మొట్టమొదట నేమియుం తెలియనికాలమున, కరియుంబోలెన్ = ఏనుఁగువలెనే, మద+అంధుఁడు = గర్వముచేత గ్రుడ్డివాఁడు, ఔచున్ = అగుచు, ఒరులన్ = ఇతరులను (ప్రజ్ఞావంతులను), కైకోక = లక్ష్యపెట్టక, (అల్పవిద్యో మహాగర్వీ అను న్యాయమున), తాన్ = తాను, ఘనుండను = గొప్పవాఁడను, అనున్ = అని పలుకుచుండును. ప్రజ్ఞావంతులు = పండితులు, ఔ = అగు, ధీరశేఖరులన్ = శాస్త్రబోధితమగు ఆచారాదికమును ధైర్యముగా నవలంబించు శిష్టులను, చూడఁగన్ చూడఁగాన్ = పలుమాఱు చూచుచుండుటచేత, తత్ గర్వంబు = ఆమదము, వరుసన్ = క్రమముగా, రోగంబు+అట్లు = వికారము పుట్టించు జ్వరమువలె, అరుగన్ = పోఁగా, (అణఁగఁగా), తాను, నీచుఁడన్ = అందఱికన్నను తక్కువవాఁడను (ఏమియుం తెలియని వాఁడను), అనున్ = అని చెప్పును.

మూఢుఁడు కొంచెముగ తెలిసికొనియుండు కాలమున ఏనుఁగువలె మదించి వివేకములేనివాఁడై తనకు సర్వమును తెలియును, తనకెదురు ఎవరును లేరు అని అల్పవిద్యా మహాగర్వమునకు మూలమను న్యాయమును సార్థకము చేయును. శాస్త్రాచారసంపన్నులగు శిష్టులను చూడఁగా చూడఁగా కొంచెకొంచెము తెలివి కలిగి, జ్వరముపోయి సుఖపడినట్లు, ఆగర్వము నశించి సుఖపడును.

ఎవఁడు అల్పజ్ఞుఁ డయినను తాను సర్వజ్ఞుఁ డనుకొనునో వాఁడే మూర్ఖుఁడు; ఎవఁడు సర్వజ్ఞుఁడైనను మూఢుఁ డనుకొనునో వాఁడే విద్వాంసుఁడు. మదము గర్వహేతువు, శిష్టసాంగత్యము వినయహేతువు అనిభావము.

కైకోక-కొనునకు కల, పడు, ని, మి, ను, క - అను ప్రత్యయములు పరములగునపుడు "కో" బహుళముగా నగును.

తాన్ ఘనుఁడను అనున్-తానుశబ్దము ఒకానొకచో "నేను" అను నర్థ మిచ్చునది కూడ నగును. 'ఘనుండను'—నీవు, మీరు, నేను, మేము విశేష్యము లగునపుడు విశేషణములకు బహుళముగా వు, రు, ను, ము-లు వరుసగా నాగమము లగును; అగుచో పూర్వ 'ఉ'కారము అకార మగును. చూడఁగఁ జూడఁగా-ఇచట ద్విరుక్తి వీప్సార్థము-ఎడతెంపులేక అని యర్థ మిచ్చును.

చూడన్-చూచునకు 'చూడు' ఆదేశము.

రోగంబు+అట్లు=రోగంబు+ను+అట్లు = రోగంబునట్లు. షష్ఠీసమాస.

9. అవ. నీచుఁడు నీచవిషయములందే సిగ్గయినను లేక ప్రవర్తించును అని దృష్టాంతపూర్వకముగఁ జెప్పుచున్నాఁడు:—

శా. ప్రువ్వుల్గారుచు, నీచుకంపుతఱచున్ రోఁతై, తలం బాసి పె
న్దువ్వన్ బ్రుంగినగర్దభాస్థిఁ దినుచున్, సుప్రీత మై, జాగిలం
బవ్వేల్పుందొరఁజూచి కొంకదు; గృహీతార్థావమానంబొరు
ల్నవ్వన్ నీచుఁడు లోఁగునే సురభిమల్లా నీతివాచస్పతీ ? 9

సురభి...వాచస్పతీ, జాగిలంబు=వేఁటకుక్క, ప్రువ్వుల్ = పురుగులు, కారుచున్=రాలుచు, నీచుకంపు=గబ్బు, తఱచున్=అధికముగా, రోఁత ఐ = ఏవ కలిగించునదై, పెన్దువ్వన్ = మిక్కిలి దుమ్మునందు, బ్రుంగిన=మఱఁగి యున్న, గర్దభ+అస్థిన్ = గాడిదయెముకను, తలిన్ పాసి=సమీపస్థలమును వదలి (దూరముగా), తినుచున్, సుప్రీతము ఐ=సాటిలేని ప్రీతిని పొంది, ఆ వేల్పుందొరన్=ప్రసిద్ధుఁడగు దేవతలకు ప్రభువగు ఇంద్రునైనప్పటికిని, చూచి, కొంకదు=సిగ్గుపడదు. నీచుఁడు, ఒరుల్=ఇతరులు, గృహీత+అర్థ+అవమానంబు =(తాను) కైకొనిన వస్తువుయొక్క తుచ్ఛత్వమును, నవ్వన్=పరిహాసము చేయుచుండినను, లోఁగునే=లొంగునా?

జాగిలంబు - పంది లోనగు నడవిజంతువులఁబట్టెడు వేఁటకుక్క-ఇట దీనిం జెప్పుట ఉత్తమాహారమును తెచ్చుకోఁగల్గియుండియు నీచవస్తుప్రీతి పొంది క్షుద్రగుణమునే ప్రకటించుటం దెల్పుటకు. కుక్క తనకు దొరకినది గాడిదయెముకయే యైనను, అదియు దుమ్మున మునిఁగి, పురుగులు రాలుచుండఁగా దుర్గంధముతో నిండి రోఁత పుట్టించుచుండినను, దానిని అతి ప్రీతితో కొఱుకుచు, తనప్రక్క దేవేంద్రుఁడే వచ్చి నిలిచియుండినా అతనిం గని సిగ్గుపడదు. ఇట్లే లోకములో నీచుఁడు తానుగ్రహించినవస్తువు ఎంతతుచ్ఛమైనను, లోకు లెంత నవ్వుచుండినను, ఆవస్తువును వదలక వారిని లక్ష్యముచేయక యుండును.

ఇందు మొదటి మూఁడుపాదములలో అప్రస్తుత మగు కుక్కనడవడిని ప్రస్తుతమగు మూర్ఖజనవర్తనమునకు ప్రతిగా చెప్పుటచే నిది అప్రస్తుతప్రశంసాలంకారము. నాల్గవపాదమున సామాన్యార్థముచే విశేషార్థమును సమర్థించుటచేత అర్థాంతరన్యాసాలంకారము.

ప్రత్యు-రూ. పురువు-పురుగు.

రోఁత+ఐ=రోఁతై - సంధి సరిగాదు.

వేల్పుందొర - వేల్పు+దొర - సమాసములందు ఉదంతస్త్రీసమములకు (ప్రథమావిభక్తిలో ఁడు, వు-ప్రత్యయములు రానిశబ్దములకు స్త్రీసమములని పేరు.) పరుషసరళములును, స్థిరములును పరములగునపుడు కొన్నిటను నుగాగమ మగును. లోఁగును+ఏ-ఈ 'ఏ' క్రియయొక్క సహజార్థమును వ్యతిరేకముగా మార్చినది.

10. అవ. అవివేకమువలనఁ గలుగు అనర్థాదికముం దెల్పుచు వివేకముయొక్క ఆవశ్యకతను ప్రదర్శించుచున్నాఁడు:—

మ. తొలుత న్మిన్ననుండి శంభుజడలందు న్వ్రాలె, నాపిమ్మటన్
మలరా మేటిపయింబడె న్మహి మహిజా తెంబొంగె న్నూనుభం

గుఁబాథోనిధిఁజొచ్చెగంగ;యవివేకుల్సేయునుద్యోగము
ల్పలుఁ బాట్లం జనుఁ జూ కడు న్సురభిమల్లా నీతివాచస్పతీ.

సురభి...వాచస్పతీ, గంగ=గంగానది, తొలుతన్=మొదట, మిన్నున నుండి=ఆకాశములోనుండి, శంభుజడలందున్ = శివునిజడలలోనికి, వ్రాలెన్= దిగెను. ఆపిమ్మటన్=ఆటుపిదప, మలరాయేటిపయిన్ = కొండలరాజగు హిమాద్రిమీఁద, పడెన్=పడెను, మఱిన్=మఱియును, మహిన్ = భూమిమీఁదికి, జాఱెన్=జాఱెను. పొరిన్=మరల, (ఆభూమినుండి), నూఱుభంగులన్=నూఱు చీలికలుగా, పాథోనిధిన్ = సముద్రమును, చొచ్చెన్=ప్రవేశించెను. అవివేకుల్=వివేకములేనివారు, చేయు+ఉద్యోగముల్ = చేయుప్రయత్నములు, కడున్=మిక్కిలి, పలున్ పాట్లన్ చనున్ చూ = అనేకములయిన శ్రమములను పొందును గదా!

గంగానది ప్రథమమున ఆకాశముననుండి శివునితలమీఁదను, అచ్చటి నుండి హిమవత్పర్వతముమీఁదను, అపర్వతమునుండి భూమిమీఁదను, భూమి నుండి సముద్రమునకును పడుచునే యుండెను. అనఁగా ఆకాశమును వదలినది మొదలు గంగ ఒకచోటనేనియుం స్థిరముగా నిలువ లేదు. అట్లే తెలివి పోఁగొట్టుకొన్నవాఁడును క్రమముగా పలువిధములగుపాట్లను అనుభవించును.

సూర్యవంశీయుఁడు భగీరథుఁడు-కపిలునిచే భస్మీభూతులైన తన అఱువదివేల పితరులకును మోక్షము సంపాదింప నెంచి, దీర్ఘతప మొనర్చి గంగను భూలోకమున కవతరింపవేఁడెను. ఆదేవియు దిగునప్పటి తనయురవడిని భరింపఁ జాలువానిని విర్పఱుపు మనఁగా నతఁడు గంగను శిరమున ధరింపు మని పరమ శివుని ప్రార్థించెను. ఆయన యట్లే చేసెను. భాగీరథియుం శివునిశిరమున వ్రాలి, తర్వాత హిమాలయముమీఁదుగా భూమి కవతరించెను. అటుపిమ్మట పాతాళమును ప్రవేశించి సగరపుత్రులకు ముక్తి యొసఁగె నని రామాయణము.

గంగకే యిట్టిగతి కలుగఁగా ఇతరులసంగతి చెప్పవలయునా అనిభావము.

అవివేకుల్...గముల్—శివునిసైతము పాతాళమునకు అణఁచివేయు

శక్తి తనకుఁ గల దని గంగ కభిప్రాయము. అందుల కాదేవుఁ డామెను తన జడలందు బంధించి యటునిటు కదలనీయక గర్వభంగము కావించెను.

పలుక్ పాటుల్—నది విషయమున అనేకశాఖలు గా ననియు, మూర్ఖుల విషయమున అనేకసంకటముల ననియు నర్థము.

ఇందు ఒకటివెంబడి నొకటిగా అనేకాధారములు చెప్పియుండుటచేత మొదటి మూఁడుపాదములలో పర్యాయాలంకారము; చివరిపాదమున సామాన్యార్థసమర్థనముచే అర్థాంతరన్యాసము.

చూ-చూడుము, చూడుఁడు అనునర్థమున వచ్చు అవ్యయము.
మిన్ను: ఇది ఔపవిభక్తికము, అనౌపవిభక్తికముకూడ నగు శబ్దము.
పాటు+లు=పాటులు, పాట్లు. టు-లోని ఉకారమునకు లోపము.

---

## విద్వత్పద్ధతి

11. అవ. మూర్ఖపద్ధతికి విలక్షణముగా విద్వత్పద్ధతి వర్ణింపఁబడుచున్నది. లేదా, వివేకము అత్యంతావశ్యకము గావునను, అదిశాస్త్రపరిజ్ఞానముచే సాధింపఁదగినది గనుకను, అదియు విద్వాంసుల కధీనమైనది కాఁబట్టియు నాపద్ధతి యారంభింపఁబడుచున్నది.

మ. చదువుల్చెప్పుచుశిష్యులన్ మనుచుప్రజ్ఞావంతు లెందేనిఁబెం
పొదవన్గొల్లని కమ్మఁజూపుమణుల ట్లున్నం, ధరాభర్త కే
శొదగా; కర్థము లేకయుండియు నుదగ్రుల్పండితగ్రామణుల్
మది నూహింప నలంతులే సురభిమల్లా నీతివాచస్పతీ? **11**

నీతివాచస్పతీ, సురభిమల్లా; చదువుల్=వేదాదివిద్యలను, చెప్పుచున్=బోధించుచు, శిష్యులను, మనుచు=పోషించునట్టి, ప్రజ్ఞావంతులు = పండితులు, ఎందేనిన్=ఏదేశమునందు, పెంపు ఒదవన్=అతిశయముగునట్లుగా, గొల్లనికిన్= (రత్నములవెల నిశ్చయించు) తెలివిలేనివానికి, అమ్మన్ = విక్రయించుటకు

చూపు=చూపించునట్టి, మణులు+అట్ల=రత్నములవలె, ఉన్నన్ = ఉందురో, (అది), ధరాభర్తకే = ఆదేశమునేలు రాజునకే, కొద = కొఱఁత; కాక = కాకపోయిన, అర్థము లేక ఉండియున్ = ధనము లేకున్నప్పటికిని, ఉద గ్రుల్=మిక్కిలిశ్రేష్ఠులయిన, పండిత గ్రామణుల్=పండితోత్తములు, మదిన్= మనస్సునందు, ఊహింపన్=చక్కఁగా నాలోచించిన, అలంతులు+ఏ=అల్పు లగుదురా? (కాఁజాలరు.)

రత్నలక్షణ మెఱిఁగి దానికి మదింపువేయఁదగిన సామర్థ్యములేనివానికి రత్నములను చూపుట యెటువంటిదో, శాస్త్రపరిజ్ఞానము నూహింప నశక్తుఁడగు ప్రభువురాజ్యమున గొప్పపండితు లుండుటయు నటువంటిదే. తెలివిలేనివాఁడు మణులకు తక్కువవెలకట్టిన అది వాని అవివేకమును ప్రకటించును గాని మణి వెల యేమాత్రమును తగ్గదు. అట్లే పండితులదారిద్ర్యమును ప్రభువుపోఁగొట్ట కున్న అతఁడు బుద్ధిహీనుఁ డనిపించుకొనును గాని, పండితోత్తముల సామర్థ్య మునకు ధనహీనతచే నెట్టిలోపమును కలుగఁజాలదు. అనఁగా శ్రేయమును గోరు ప్రభువు విద్వాంసులమనోరథములను పూరింపవలయు నని భావము.

గ్రామణి-గ్రామాధిపతి, శ్రేష్ఠుఁడు.

ఏని-అవ్య. కళ. ఏని+ఉన్ = ఏనియున్ - యువర్ణము లోపింపఁగా ఏనిన్ అగును. ఎందేని - ఇందలి 'ఏని' వాక్యాలంకారనిబద్ధము.

అలంతులు+ఏ—'ఏ' వ్యతిరేకార్థబోధకము.

విరోధాభాసాలంకారము; దృష్టాంతమును.

12. అవ. ధనవంతులకన్నను బండితులే రాజులచే నాదరింపఁదగినవా రనుట.

శా. ఏనాఁటు న్జన దేరి కిచ్చిన, సుఖోద్వృద్ధంబ రైయుండు, ని
త్యానందంబొనరించు,ముచ్చుల కశక్యంబౌ హరింప,న్బ్రియం
బూనన్విద్యయొపో మహాధనము,మాన్యుండైన విద్యాధ్యుఁ జేఁ

డా నొంపన్దగు నల్కఁచే సురభిమల్లా నీతివాచస్పతీ? 12

(ఏది), ఏరికిన్ ఇచ్చినన్ = ఎవరి కిచ్చినను, ఏనాఁటన్ = ఏకాల మందును, చనదు = పోవదో, సుఖ+ఉద్ వృద్ధంబు+అ = సుఖమును పెంచు నట్టిదే, ఐ, ఉండున్=ఉండునో, నిత్యానందంబు = ఎడతెగని సంతోషమును, ఒసరించున్=ఇచ్చునో, ముచ్చులకున్=దొంగలకును, హరింపన్ = దొంగ లించుటకు, అశక్యంబు ఔన్ = సాధ్యముకాదో, ప్రియంబు ఊనన్ = సంతసము కలుగునట్లుగా, (అట్టి), విద్య యె=విద్యయొక్కటే, మహాధనము+పో=నిశ్చయముగా గొప్పధన మగును. మాన్యుండు ఐన=పూజింపఁదగిన, విద్యాఢ్యున్=విద్యావంతుని, అల్కచేన్=కోపముచేత, ఱేఁడు+అ=రాజా, నొంపన్ తగును = నొవ్వఁజేయవచ్చును. (రాజు నొప్పింపవచ్చునా అని ప్రశ్న.)

విద్యయందు ధనమునకుఁ గల దోషము లేవియుం లేవు. దానికి లేని గుణము లనేకములు విద్యకుఁ గలవు. విద్యాధనమును కోరినవారి కెల్లప్పు డిచ్చుచుండినను తఱుఁగక మఱింతవృద్ధి యగుచునే యుండును; ఎల్లప్పుడు సుఖమునే కలుగఁ జేయును; ఎడతెగని సంతోషము నిచ్చును; దొంగ లెన్నఁటికిని అపహరింపఁ జాలరు. ఇట్టి విద్యాధనముగలవారియెడ సామాన్యధనము గలరాజులు దురాగ్రహముచే అనాదరణము చూపి వారిని నొప్పింప రాదు; తప్పక గౌరవించి ఆదరింపవలయును.

ఉపమాన మగు ప్రసిద్ధధనముకంటెను ఉపమేయ మగువిద్యాధనమునకు ఆధిక్యము చెప్పుటచే వ్యతిరేకాలంకారము.

పో—పోమ్మునకు రూపాంతరము: శబ్దములకడఁ జేరినపుడు నిశ్చయ మును బోధించును.

13. అవ. పండితులు సంపదకు కట్టుపడరు అనుట.—

మ. గురుశాస్త్రార్థగరిష్ఠు లైనబుధుల న్గోపింపఁగా రాదు; రా
జ్యరమల్ వారికి దొడ్డ గావు; తృణ మెట్లు; ట్లుద్యద్దశాంతబం

ధురదానార్ద్రకపోల యైనకరికి న్దొడ్డా మృణాళంబు, గా
వ్యరసాస్వాదనభోజ శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ ? 13

కావ్యరసాస్వాదనభోజ-కావ్యరస=కావ్యములసారమును, ఆస్వాదన = అనుభవించుటను, భోజ=భోజునితో సమానమైనవాఁడా, నీతివాచస్పతీ, శ్రీసురభిమల్లా, గురు......ష్ఠులు-గురు = గొప్పవగు - శాస్త్ర = శాస్త్రములయొక్క-అర్థ = శబ్దార్థములచేత - గరిష్ఠులు = మిక్కిలిగొప్పఁదనముపొందినవారు, ఐన-(అనఁగా తత్త్వమును చక్కఁగా నెఱింగినయనుట), బుధులన్ =విద్వాంసులను, కోపింపఁగాన్ రాదు-క్రోధముచే తిరస్కరింపరాదు. (ఏల యన), వారికిన్ = ఆపండితులకు, రాజ్యరమల్ =రాజ్యసంబంధమైన సంపదలు, దొడ్డు = గొప్ప, కావు, తృణము=గడ్డిపరక, ఎట్లు = ఎట్లో, అట్లు = అవిధము-(వారి కాసిరులన్నియు గడ్డిపరకతో సమానము.) ఉద్య......కపోల-ఉద్యత్ =పైకుబ్బుచు-అ క్రాంత=ఎడతెగక-బంధుర = ఒప్పిదమైన- దాన = మదజలముచేత- ఆర్ద్ర = తడిసియున్న-కపోల = చెక్కిలికలది, ఐన, కరికిన్ = ఏనుఁగునకు, మృణాళంబు = తామరతూఁడు, దొడ్డు+ఆ=గొప్పదా?

రాజులు తత్త్వవిదులైన పండితులయెడ క్రోధము చూపరాదు. ఏలనీ మదపుటేనుఁగులు తామరతూఁటిని చులకన చేయునట్లే వారును రాజులసంపదను గడ్డిపోచతో సమానముగా భావింతురు.

గురువు (విశే.) (నిజస్థితి) గరీయసము (తరస్థితి) గరిష్ఠము (తమస్థితి.)

సామాన్యధర్మము బింబప్రతిబింబభావమున వాక్యద్వయమున చెప్పఁబడుటచే దృష్టాంతాలంకారము. ఉపమతో సంకీర్ణము. చూ. 47. ప.

14. అవ. రాజు ఒకవేళఁ గోపించునేని పండితులను తనసభనుండి పొమ్మనఁగలఁడే కాని వారి పాండిత్యమును కీర్తిని పోఁగొట్ట లేఁ డనుట.

శా.ఉల్లం ఘిక్కలహంసపైఁ గుపితమై యున్న న్వినోదింపఁగా
నిల్లా దానిసరోజినీవనమె మాయింప న్సమర్థుండు; తా

నీళ్లు న్పాలును నేర్పరింపఁ గలపాండిత్యంబు మాన్పంగ లేఁ
డల్లోకేశ్వరుఁ డేమెయి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 14

నీతివాచస్పతీ, సురభిమల్లా, అల్లోకేశ్వరుఁడు = ఆలోకేశ్వరుఁడు = ఆబ్రహ్మ, ఉల్లంబు = (తన) మనస్సు, అక్కలహంసపైన్ = (తనవాహనమైన) ఆరాజహంస మీఁద, కుపితము = కోపముపొందినట్టిది, ఐ, ఉన్నన్ = ఉండిన యెడల, వినోదింపఁగాన్ = క్రీడించుటకు, ఇల్లు = స్థానము, ఔ = అగు, దాని సరోజినీవనమె = దాని తామర కొలనినిమాత్రమే, మాయింపన్ = పోఁగొట్టుటకు, సమర్థుండు = శక్తిగలవాఁడు, (అగును.) (కాని), తాన్ = ఆబ్రహ్మ, ఏమెయిన్ = ఏవిధముచేతనైనను, నీళ్లను, పాలునున్ = పాలను, ఏర్పరింపన్ కల = వేఱుసేయఁగలిగిన, పాండిత్యంబున్ = నేర్పును, మాన్పంగన్ లేఁడు = పోఁగొట్టఁ జాలఁడు. హంస నీరక్షీరమిశ్రమునుండి క్షీరమునుమాత్రము గ్రహించి నీటిని వదలు నని ప్రసిద్ధి.

బ్రహ్మ కోపముచే తనవాహనమయిన హంసను తామరకొలనిలో విహరింపకుండునటుల చేయఁగలఁడేగాని, పాలను నీటిని వేఱుపఱచుటయందుఁ గలనేర్పును తీసివేయఁ జాలఁడు. అట్లే రాజు కోపము వచ్చిన పండితుని తన సభనుండి పొమ్మనఁగలఁడేగాని అతనిపాండిత్యమును మాన్పఁజాలఁడు.

అప్రస్తుతమగు బ్రహ్మవృత్తాంతము చెప్పుటచేత ప్రస్తుత రాజవిద్వజ్జనవృత్తములను వివరించును గనుక అప్రస్తుతప్రశంసాలంకారము.

అవ. విద్వాంసులకు విద్యయే భూషణ మనుటను రెండుపద్యములచే నిరూపించుచున్నాఁడు.

మ. కమనీయం బగువిద్యభంగిఁ దనుశృంగారంబు గల్పింప లే
వమలేందుద్యుతు లైనహారములు, కేశాలంక్రియ, ల్మజ్జనం
బు, మనోజ్ఞాంగదచందనాదు;లఖిలంబు న్బొల్పుఁబో దెందు వా
క్యమయం బొకోడ వేరికి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 15

నీతివాచస్పతీ, సురభిమల్లా, ఏరికిన్ =ఎట్టివారికిని, అమలేందుద్యుతులు- అమల = స్వచ్ఛమయిన, ఇందు = చంద్రునియొక్క, ద్యుతులు = కాంతులు. కలవి, ఏన, హారములు = ముత్యాలదండలు, కేశ+అలంక్రియల్ = తలవెండ్రు కలకు (జడవేసికొనుట, పుష్పములు ధరించుట మొదలగు) అలంకారములు, మజ్జనంబు = స్నానము, మనోజ్ఞాంగదచందనాదులు - మనోజ్ఞ = సుందర మయిన-అంగద = సందిటవేసికొను కడియములు (బాహుపురులు) - చందన ఆదులు = గంధము మొదలయినవి, కమనీయంబు అగు = మనోహరమగు, విద్యభంగిన్ = విద్యవలె, తనుశృంగారంబు = శరీరమునకు అందము, కల్పింపవ్, లేవు, అఖిలంబున్ = (అవి) అన్నియును, పోవున్ = నశించును, వాక్యమ యంబు+ఔ తొడవు=వాక్కు (విద్యా) రూపమునందిన భూషణము, ఎందున్ = ఎచ్చటను, పోదు = నశింపదు.

పురుషునకు వెన్నెలవెదఁజల్లు ముత్యాలదండలు, కురులుదువ్వుకొనుట, స్నానము, చందనము పూసికొనుట, సందికడియములు ధరించుట మొదలగు వానిలో నేదిగాని అలంకారము నీయఁజాలదు. పరిశుద్ధ మగు వాగ్రూపమైన భూషణము అలంకారము కలుగఁజేయును. తక్కినభూషణములన్నియును నశించును గాని వాగ్భూషణ మొక్కటే నశింపని భూషణము.

వ్యతిరేకాలంకారము. చూ. 12 ప.

హారము - నూటయెనిమిది పేటలుగల ముత్యాలపేరు.

అవ. ఇదియుం విద్యాప్రభావమునే తెలుపును.

మ. చదువే రూపము, గుప్తమౌ ధనము, పూజ్యశ్రేణిపూజ్యంబు, సు
ఖ్మదము, స్కీర్తియు భోగమిచ్చు, నృపసన్మానంబు గల్పించు, నె
ల్ల దెస న్తోడ్పడు, దైవతుల్యము; సిరుల్గా మిట్టివే! యాపసుల్
చదువు ల్లేరనివారె సూ సురభిమల్లా నీతివాచస్పతీ. 16

నీతివాచస్పతీ, సురభిమల్లా, చదువు+ఏ=(వేదములు శాస్త్రములు మొదలుగునవి కూడిన) విద్యయొక్కటే, రూపము=సౌందర్యము; గుప్తము ఔ =

దాఁచిపెట్టఁబడిన, ధనము; పూజ్యశ్రేణి = పూజింపఁదగిన వారికిని-పూజ్యంబు = గౌరవింపఁ దగినట్టిది (గురువులకును గురువైనది.); సమ్మదముఁ = సంతోషమును-కీర్తియుఁ = కీర్తిని, భోగము = సౌఖ్యమును, ఇచ్చుఁ; నృపసన్మానంబు = రాజులచేత గౌరవము, కల్పించుఁ = కలుగునట్లుచేయును; ఎల్లదెసఁ = అన్నిదిక్కులలోను, (అన్నిదేశములలోను), తోడ్పడుఁ = సహాయపడును, దైవతుల్యము = దైవముతో సమానము; సిరుల్ తాము = ఆసంపదలు, ఇట్టివి+ఏ= ఇట్టిగుణములు కలవగునా? ఆపశుల్ = పశువు లని ప్రసిద్ధము గాంచినట్టివి. చదువుల్ నేరనివారె చూ = విద్య నేర్వనివారే సుమా!

రూపము—కుండలములు, హారములు, నూపురములు, అంగదములు మొదలయిన చతుర్విధభూషణములు లేకున్నను, అవి యున్నట్లుగానే భాసిల్లు ఆకారవిశేషము రూపు మనఁబడును.

దానాదికమువలనఁ గల్గుఖ్యాతికిఁ గీర్తి యనియుఁ, ప్రతాపమువలనఁ గల్గుదానికి యశస్సనియుఁ జెల్లు.

పురుషునకు విద్య యొక్కటియే సౌందర్యమునకన్న మేలయినది. గుప్తము చేసి యుంచిన ధనము కాలాంతరమున నెట్లుపకరించునో అట్లే విద్యయును నుపకరించును గాని ధనమువలె దొంగలపాలు గాదు. గురువులకు తెలియనివిషయములనుగూడ విద్య ఎఱుకపఱుచును. సంతోషమును, భోగమును, కీర్తిని ఇచ్చును; రాజులు విద్వాంసుని పూజింతురుగాని ధనవంతుని పూజింపరు. దేశాంతరములలో సైతము విద్య విశేషోపచారమును సమకూర్చును; దైవము వలె ఐహికాముష్మికసుఖముల నొసఁగును. ధనమువలన నిట్టియనుకూలము లేవియు కలుగవు. కనుక అట్టివిద్య లేనివాఁడు అధముఁడై పశువుతో సమాన మగును; అనఁగా కర్తవ్యాకర్తవ్యవివేకము లేనివాఁ డగును. బహూపకారక మగుటచే విద్యయే శ్రేష్ఠమైనది.

పసి = గోగణము. ఏకవ. పసులు = గోవులు. బహువ.

తోడు+పడు = తోడ్పడు.

రూపము, ధనము మొదలగు ఆకారములచే బహువిధములుగా విద్య వర్ణింప బడుటచే మాలారూపకాలంకారము.

'సిరులె తాము' - ఇట తాశబ్దము పాదపూరణార్థము. 'నేరని'-నేరుచు నను లిఙ్గాట్టులు ముత్తుపరంబులగునపుడు 'రు, చు'లకు లోపంబు బహుళంబుగా నగు. బా. క్రి. 97.

అవ. లోకహితాహితవర్ణన ప్రసంగముచేయుచు విద్యయే ఉత్తమైశ్వర్య మని యనుచున్నాఁడు.

మ. సుకవిత్వంబె ప్రభుత్వ,మీరసమె ద్వేషు,ల్కొండెకాఁడేమహా
హి,కరం బోర్మియె జోడు,విద్యయెధనం,బిష్టుండెదివ్యౌషధం,
బకృతజ్ఞుం డగుజ్ఞాతియే యనల, మింపౌసిగ్గె సద్భూషణం
బకరాళప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 17

అకరాళప్రతిభానిధీ = ఒడుదొడుకులు (వైషమ్యము)లేని ప్రతిభకల వాఁడా, నీతివాచస్పతీ, సురభిమల్లా, సుకవిత్వంబె = మంచికవిత్వమే, ప్రభుత్వము = దొరతనము, ఈరసమె = కోపమే, ద్వేషుల్ = శత్రువులు, కొండెకాఁడే = చాడిచెప్పెడువాఁడే, మహా+అహి = గొప్పపాము, కరంబు = మిక్కిలి, ఓర్మియే = ఓరిమియె = ఓర్పే, జోడు = కవచము; విద్యయె, ధనంబు; ఇష్టుండె = మిత్రుఁడే, దివ్య+ఔషధంబు = సిద్ధౌషధము. అకృతజ్ఞుండు = చేసినమేలు మఱచువాఁడు, అగు, జ్ఞాతియే = దాయాదియే, అనలము = అగ్ని. ఇంపు+ఔ = ఇష్ట మగు, సిగ్గె=లజ్జయే (తప్పుచేయ సంకోచించుటయె), సద్భూషణంబు = మంచియాభరణము.

సుకవిత్వము - రసవంత మగు శబ్దార్థసంఘటనచేత సకలలోకమును వశపఱుచుకొనును.

ఈరసము = అంతశ్శత్రువు, ఉపద్రవహేతువు.

మహాహి - స్వవిషముచే ప్రాణముల నపహరించును. ఓర్మి - పరిభవా

దులవలన కలుగుకో్రధమును అడ్డగించునట్టిది. జోడు - మర్మమును తాఁకుట కవకాశ మీయనిది. విద్య-వేదవేదాంగాది రూపకము, అఖిలభోగసాధకము. దివ్యౌషధము - ఆరోగ్యకారకము. మిత్త్రుఁడు - మానసికరోగమును బాపును. జ్ఞాతియుం అగ్నియుం సర్వార్థనిర్మూలనమునకు ఆదికారణములు. సిగ్గు - చేయరానిపనులకుఁ జొచ్చుచో మనస్సున సంకోచ మందయింపఁజేయుంనది.

మానవునకు సుకవిత్వము రాజ్యముతో సమానము. ప్రభువునకు రాజ్యమున ఏయేకార్యములు జరుగునో కవికిని అట్లే జరుగును. కోపము ఉపద్రవము కలుగఁజేయుంను; కొండెకాఁడు సర్వనాశముచేయుంను; ఓర్పు కాపాడును; విద్య సర్వధనముల నిచ్చును; మిత్త్రుఁడు ప్రాణములను గాపాడును; జ్ఞాతి సర్వనాశము చేయుంను; పాపభీతి పుట్టించు సిగ్గు చక్కఁగా అలంకరించును. కావున విద్య యుండిన సర్వము నుండినట్లే.

ఈరసమె ద్వేషల్ - ఏకవచన బ. వ-ల కలయిక దుష్టము.

అవ. విద్వాంసులవల్లనే లోకము చక్కఁగా నిలిచి యున్న దనుట.

మ. హితుమైత్త్రి,జెడుధూ_ర్తత,న్గురుతక్షమ,న్భృత్యు,న్దయ,న్వైరిశూ
రత,దజ్ఞు,బ్బుజుత,న్నృపాలు నయచర్య, న్దుష్టు నప్రీతి,నా
ర్యతతి న్హ్రీతి; య థార్థ్వత న్నెలపునయ్యల్లున్ము లోకస్థితుల్
జత గావించుమహామహు ల్సురభిమల్లా నీతివాచస్పతీ! 18

హితుఁ = మేలుకోరువానిని, మైత్త్రిఁ = స్నేహముచేతను, చెడుఁ = చెడుగును = (దుర్జనుని), ధూర్తతఁ = వంచనచే అప్రియముచేయుటచేతను, గురుఁ = తండ్రి మొదలగుపెద్దలను, క్షమఁ = ఓర్పుచేతను, భృత్యుఁ = సేవకుని, దయఁ = కనికరముచేతను, వైరిఁ = శత్రువును, శూరతఁ = పరాక్రమముచేతను, తజ్ఞుఁ = పండితుని, ఋజుతఁ = తిన్నఁదనముచేతను. నృపాలుఁ = రాజును, నయచర్యఁ = నీతితో అనువర్తించుటచేతను,

దుష్టుల్ = దుర్మార్గుని, అప్రీతిన్ = అప్రియముచేయుంటచేతను, ఆర్యతతిన్ = సాధువులను, ప్రీతిన్ = ప్రియముచేతను, (ఇట్లు) యథార్హతన్ = (ఎవరెవరికి) తగినట్లు, (వారిని), మెలపు + అయ్యలు = మెలఁగఁజేయుం పెద్దలుః లోకస్థితుల్ = లోకమర్యాదను, జత కావించు = సంధింపఁజేయునట్టి, మహా మహులల్ చుమ్ము = గొప్ప నేర్పరులుసుమా.

హితులయెడ స్నేహము, దుర్జనులయెడ వంచన, పెద్దలయెడ ఓర్పు, సేవకులయెడ దయ, శత్రువులయెడ శౌర్యము, విద్వాంసులయెడ నిష్కపటప్రవర్తనము, రాజులయెడ నీతితోఁ గూడిన యనుసరణము, దుష్టులయెడ అప్రీతి, సాధువులయెడ ప్రీతి, అను నీయుపాయములను చక్కఁగా నేర్చినవారే లోకవ్యవస్థను సంస్థాపించువారుగాని ఇట చెప్పినగుణరహితులు కారు.

మెలపు+అయ్యల్=మెలపు+ను+,అయ్యల్: ఉదంతతద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమ మగును. చుమ్ము - చుము- మూడు-నను రూపాంతరములు.

అవ. సత్సాంగత్యము శ్రేయస్కర మనుట.

మ. మతిజాడ్యంబు బడఁచున్, నిజంబు గఱపు, న్మానోన్నతి న్నించు
దుష్కృతముల్ ద్రుంచు,మనఃప్రసాద మిడుఁ, గీర్తిస్ఫూర్తి
గావించు నీక్షితి నార్యుఁడు; తదీయసంగతి మెయి న్సాధించు
సర్వార్థముల్, ప్రతిభానూత్నఫణీశ్వరా సురభి... 19

ప్రతిభానూత్నఫణీశ్వరా = బుద్ధివికాసమునందు క్రొత్త ఆదిశేషుఁడా. నీతివాచస్పతీ, సురభిమల్లా. ఈక్షితిన్ = ఈభూమియందు, ఆర్యుఁడు = పూజ్యుఁడు, మతిజాడ్యంబున్=బుద్ధిమాంద్యమును, అడఁచున్=పోఁగొట్టును; నిజంబున్=సత్యవచనమును, కఱపున్ = నేర్పును, మాన+ఉన్నతిన్ = గౌరవముయొక్క అతిశయమును, నించున్ = నిండించును, దుష్కృతముల్ = పాపములను, త్రుంచున్ = నాశముచేయును, మనఃప్రసాదము = చిత్తము

నకు విర్మలతను, (జ్ఞానోపదేశాదికముచేత అనిభావము.) ఇడుఁక్ = ఇచ్చును, కీర్తిస్ఫూర్తిక్ = కీర్తియొక్క ప్రకాశనమును, కావించుక్ = చేయును. తదీయసంగతిమెయిక్ = అతనియొక్క సహవాసముచేత, సర్వార్థముల్ = సమస్తవస్తువులును (ప్రయోజనములును), సిద్ధించుక్ = సమకూడును.

సజ్జనులతోడి సహవాసమువలన పురుషులకు సకలశ్రేయస్సులును కలుఁగును. అది బుద్ధిమాంద్యమును పోఁగొట్టును; సత్యమునే పలుకునట్లు చేయును; మంచిగౌరవము నిచ్చును; ధర్మోపదేశముచేత పాపములను నాశముచేయును; జ్ఞానోపదేశముచేత దుఃఖాదిదోషములనుపోఁగొట్టి మనస్సును నిర్మలపఱుచును; కీర్తిని విస్తరిల్లఁజేయును. వేయేల? అది చేయఁజాలని మంచి యేదియును లోకమునలేదు. కనుక సత్సాంగత్యమే అభిలషింపఁదగిన దని భావము.

ఫణీశ్వరుఁడు - ఆదిశేషుఁడు సర్పరాజు. సమస్తవిద్యల నెఱిఁగినవాఁడని ప్రసిద్ధి.

మెయి - తృతీయావిభక్తియందు వచ్చెడు ప్రత్యయము.

'అయ్యెందు' అనుశబ్దము ఒకచోటనుండి సకలవాక్యములకు నుపచరించుచున్నది. గనుక దీపకాలంకారము. దీనికి సముచ్చయ మనియుఁ బేరు. చూ. 46. ప.

అవ. విద్వాంసులలోనుత్తరమహిమాతిశయము.

మ. తుల లేకెందుఁ బ్రసిద్ధులౌచు రససిద్ధుల్గోలె విద్వత్క
వీంద్రులు భాసిల్లుదు; రమ్మహాత్ములయశస్స్తోమంబు లన్నిగ్రహం
బుల కెక్కాలమున జ్జరామరణసంభూతవ్యథల్ లేవు, శీ
లలసత్పుణ్యగుణాశ్రయా సురభిమల్లా నీతివాచస్పతీ. 20

శీల లసత్ పుణ్య గుణ ఆశ్రయా = శీలముచేత ప్రకాశించుచున్న మంచిగుణములకు ఆశ్రయమైనవాఁడా, నీతివాచస్పతీ, సురభిమల్లా,

ఎందుక్ = ఎచ్చటను, తులలేక = తమకు సాటిలేనివారై, ప్రసిద్ధులు

ఔంచుక్ = ఖ్యాతిగలవా రగుచు, రససిద్ధుల్ పోలెక్ = సిద్ధించిన పాదరస ఘుటికలుకలవారివలె, లేదా, బ్రహ్మజ్ఞానులవలె (సిద్ధించినశృంగారాదిరసములు కలవారై), విద్వత్ కవీంద్రులు = విద్వాంసులైన కవిశ్రేష్ఠులు, భాసిల్లుదురు= ప్రకాశింతురు. అమ్మహా...విగ్రహాంబులకుక్-అమ్మహాత్ముల=అసిద్ధులయొక్క, యశస్తోమంబులు = కీర్తిసమూహములు, అక్ = అనెడి, విగ్రహాంబులకుక్ = శరీరములకు, ఎక్కాలమునక్ =ఏకాలమునందును, జరామరణసంభూతవ్యథల్ = ముదిమివలనను, చావువలనను పుట్టుదుఃఖములు లేవు.

ఆయారసానుగుణముగ వర్ణించు నైపుణ్యము కలిగి గ్రంథములు రచించుటచేత ధన్యాత్ములగు విద్వాంసులు, కవీశ్వరులు, జరామరణములు లేని తమ కీర్తిశరీరములచేత సిద్ధౌషధసేవచే ముదిమిని చావును అతిక్రమించినయోగుల వలె సర్వదా ప్రకాశించుచుందురు. యశశ్శరీరము కల్పాంతస్థాయి యైనది.

రససిద్ధుల్ - శ్లేష.

రస=(1) పాదరసము, (2) శృంగార వీర కరు ణాద్భుత హాస్య భయానక బీభత్స రౌద్ర శాంతములు.

బ్రహ్మవర్చస్సు రససిద్ధపదార్థమునకు విశేషణగతిచేత వ్యథాభావపదార్థము హేతు వగుటవలన కావ్యలింగాలంకారము.

అక్ విగ్రహాంబు—'అను', 'అను' లోనగుధాతుజ విశేషణములయంత్యఉకారమునకు హల్లు పరమగునపుడు లోపము వైకల్పికము.

---

## శౌ ర్య ప ద్ధ తి

అవ. విద్వత్పద్ధతి నిరూపించిన పిదప విద్వాంసులకు సైతము మానశౌర్యము లావశ్యకము లగుటవలన, నీమానశౌర్యపద్ధతి నారంభించుచున్నాఁడు.

ము. జర నైన న్క్షుధనైన నొప్పి నయిన న్శైథిల్యసంప్రాప్తి నైన రుజాదుర్దశలందు నైనఁ దుది నైన న్మత్తవేదండకుం

భరసైకాశనకాంతిఁ గ్రైనమృగభూపాలుండు పుల్మేయునే
యరయ న్మానధనుండు, శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ? 21

అవ కులక్రమాగత మగు ఉత్తమశీలపరిపాలనము మాన మనఁబడును; పర సహాయ మెదురుచూడక శత్రుసంహారణము చేయఁగల సామర్థ్యము శౌర్య మనఁబడును.

శ్రీసురభి......స్పతీ, మత్తవేదండ......కాంతిఁ - మత్త = మదించిన - వేదండ = గజముయొక్క-కుంభ = కుంభస్థలమందలి - రస = మొదటి మాంసమును - ఏక = ముఖ్యముగా - ఆశన = తినుటలో - కాంతిఁ = కోరిక గలదియుం (ఇందువలన శౌర్యాతిశయము సూచింపఁబడినది), మానధనుండు= మానమునే ధనముగాఁ గలదియుఁ, ఐన, మృగభూపాలుండు = మృగరాజయిన సింహముఁ, జరన్ ఐనన్ = ముదిమివల్లనైనను, క్షుధన్ ఐనన్ = ఆఁకటిచేత నైనను, నొప్పిన్ ఐనన్ = ఆపదపొందినను, శైథిల్యసంప్రాప్తిన్ ఐనన్ = కీళ్లుసడలి బలహీనము కలిగినను, రుజా దుర్దశలందున్ ఐనన్ = రోగమునుగాని కాంతిహీనతనుగాని పొందినను, తుదిన్ ఐనన్ = ప్రాణముపోవుచున్నను, అరయన్ = ఆలోచింపఁగా, పుల్ మేయునే = కసవు తినునా? (ఇందు మానాతిశయము సూచింపఁబడినది).

సింహము ముదిమిచేఁ జిక్కినను, ఆఁకటిచే డస్సినను, ఆపద పొందినను, కీళ్లుసడలి బలహీనముకలిగియున్నను, రోగమువలన అరుచి యేర్పడినను, కాంతి హీనమయినను, తుదకు ప్రాణములే పోవుచున్నను, ఏనుఁగుకుంభస్థలమును తానే చీల్చి యందలి మాంసవిశేషమును భుజింపఁ దలఁచునేకాని కసవు మేయదు. అట్లే మానశౌర్యవంతులు తా మెన్నికష్టములపాలయ్యినను క్షమసహజవృత్తిని మాని నీచవృత్తి నవలంబింపరు. మానరక్షణమే వారికి ముఖ్యము. మానశౌర్య సంపన్నునకే యశస్కామము కలుగును.



అప్రస్తుతప్రశంసాలంకారము. [illegible]
మల్లభూపా—[illegible]

పులు - పుల్లునకు రూపాంతరము.

అవ. అందఱును తమతమశక్తికిఁ దగినఫలమునే కోరుచుందు రనుట.

మ. పసి యొక్కింత గలాదొ లేదొ, క్షుధ దీర్పన్జాల కెప్పాటిదో
పసరంపెమ్ము లభించి కుక్క చెలఁగున్; బజ్జన్మెకా లెన్నియేన్
వసియింపం గన, దేనుఁగుం దినఁ జనున్ హర్యక్షు; ఔ నౌ;
జనుల్, స్వసమర్థస్పృహు లౌదురౌ సురభిమల్లా నీతి...22

పూర్వపద్యార్థమునే ప్రకారాంతరమునఁ జెప్పుచున్నాఁడు.

సురభి...స్పతీ, కుక్క, పసిమి=(క్రొవ్వువలని)పచ్చఁదనము, ఒక్కింత = కొంచెమైనను, కలాదో = ఉన్నదో, లేదో, క్షుధ = ఆఁకలి, తీర్పఁజాలక = నివారింపలేక, ఎప్పాటిదో = ఏ కొలఁదిదో, పసరంపెమ్ము = పశువు యొక్కయెముక, లభించి = దొరకఁగా, చెలఁగున్ = సంతోషము పొందును. హర్యక్షము = సింహము, పజ్జన్ = సమీపమున, మెకాలు = జింకలు, ఎన్నియేన్ = ఎన్నియైనను, వసియింపన్ = ఉన్నప్పటికిని (లెక్కలేకయున్నను), కనదు = (వానిని) చూడదు; (కాని), ఏనుఁగున్, తినన్ చనున్ = తినఁబోవును. ఔన్ ఔన్ = ఇది నిశ్చయము. జనుల్ = జనులు, స్వసమర్థస్పృహులు=తమతమకు యోగ్యమైనకోరికలు కలవారు, ఔదురు ఔన్ = అగుదు రనుట నిశ్చయము.

కుక్కకు పశువుయొక్కయెముక, క్రొవ్వువలన కొంచెపాటితడియైనను ఉన్నదో లేదో యన్నసందేహము పుట్టించునట్టిది, దొరకినంతమాత్రాననే, దాని కది సంతోషించునుగాని, దానివలన దానియాఁకలి కొంచెమైనను తీఱదు. సింహము తనచెంత నెన్నిజింక లున్నను, వానినెల్ల మాని, ఏనుఁగునే వెదకుకొనుచుఁబోవును. ఎల్లవారును తమకష్టకాలమందైనను తనశక్తికిఁదగిన ఫలమునే కోరుదురు గాని యెక్కువయో తక్కువయో కోరరు. కుక్కవలె నీచవస్తువులను కోరక సింహమువలె ఉత్తమవస్తువులనే కోరవలయును అనిభావము.

అర్థాంతరన్యాసాలంకారము.

'ఒక్కింత' - ఒక్క యిచట అల్పార్థకము. ఇంత-పరిమాణార్థకము. 'కలాదో'—'కలదు' మన్నరూపములమధ్య స్వరము దీర్ఘమగుటయుం గలదు. పసరము+ఎమ్ము - షష్ఠీసమాసమున మువర్ణమునకు ంపువర్ణాదేశము. పసరంపు+ఎమ్ము-'పసరంపుటెమ్ము' కావలసియుండఁగా, టుగాగము లేమి చింత నీయము.

పసిమి+ఒక్కింత—ఏమ్యాదియికారసంధి.

అవ. నీచులనడవడికిని ఉత్తములనడవడికినిఁ గలతారతమ్యము:

మ. భువిపైఁ జాగిలి తోఁక యూఁచు,వదనంబున్బొట్టయు న్సారెఁ
జూ,పు వెస న్బట్టెఁడుముద్దకై శునక; మెప్పున్భద్ర వేదండ మా
కవణం బల్లనఁ గైకొను న్బహునుతు ల్గావింపఁ దా నెంతో
సొం,పవు లేఁజూపులఁ జూచుచు న్సురభిమల్లా నీతివాచస్పతీ.

సురభి......స్పతీ, శునకము=కుక్క, పట్టెఁడుముద్దకై = చేరెఁడంత (అన్నపు) ముద్దకై (పిడికెఁడన్నమునకై), వెసన్=శీఘ్రముగా, భువిపైన్ = నేలమీఁద, చాగిలి = దండఁగా పడి, తోఁక = తోఁకను, ఊఁచున్ = ఆడించును, వదనంబున్ = నోటిని, పొట్టయున్ = పొట్టను, సారెన్ = మాటిమాటికిని, చూపున్, భద్రవేదండము = ఉత్తమ మయిన యేనుఁ గన్ననో, (ఆహార మిడువాఁడు) ఎప్డున్ = ఏసమయమందైనను, బహునుతుల్ కావింపన్ = పెక్కువిధముల ప్రియవచనములు పలుకుచుండఁగా, తాను (ఆయేనుఁగు), ఎంతో = మిక్కిలి, సొంపు అవు = గంభీరమగు, లేఁజూపులన్ = చిన్నిదృష్టితో, చూచుచు, ఆకవణంబు = ఆయాహారమును, అల్లనన్ = మెల్లగా, కైకొనున్ = తీసికొనును.

కుక్క తనకుపిడికెఁడన్నము పెట్టువానియెదుట నేలమీఁద వెలకిల చాగిల పడి, నోటిని కడుపును చూపును; తోఁక యాడించును. ఏనుఁగురాజ మన్ననో,

బెట్టుగా చూచుచు, మావటివాఁడు మాటిమాటికి ప్రియవచనములచే బుజ్జగించుచుండ నాతఁ డిచ్చునాహారమును మెల్లగా గ్రహించును. ఇట్లే నీచుల నడవడియు, ఉత్తములనడవడియు నుండును.

భద్రము, మందము, మృగము అనియేనుఁగుజాతులు మూఁడు; వానిలో భద్రము శ్రేష్ఠమైనది.

కవణము—గుజ్జము మొదలగువానియొక్క ఉలవలు మొదలుగాఁగల భక్ష్యము. రూ. కవళము.

పట్టెఁడు - పట్టిలి+ఎఁడు-'ఎఁడు' పరమగునపుడు దోసిలి మొదలగు వాని తుదివర్ణమునకు లోపము నిత్యము.

లేఁజూపులు - లేఁత+చూపులు - సమాసమందు ప్రాఁతాదుల తొలి యచ్చుమీఁదివర్ణములకెల్ల లోపము బహుళము; లోపింపఁగా మిగిలినదానికి పరుషవర్ణములు పరమగునపుడు నుగాగమము బహుళము.

లేఁత+చూపులు=లే+చూపులు = లే+ను+చూపులు = లేఁజూపులు.

చూపు- చూచుధాతువు కృదంతము.

అప్రస్తుతప్రశంసాభేదము: అన్యోక్తి.

అవ. మానశౌర్యములు గలిగి వంశోద్ధారకుఁ డగువాఁడే సఫలజీవి తుఁడు అనుట.

మ. జనుఁ డెవ్వాఁడు జనింపఁ? డెల్ల జనులు న్సంసారచక్రంబునన్
జననం బెత్తెడువారె కారె? విను, జన్మం బెవ్వఁడే నెత్తినన్
దనవంశంబు ప్రకాశ మౌ నతఁడు జన్మం బెత్తినాతండు,పా
లనసంతోషితభూజనా సురభిమల్లా నీతివాచస్పతీ. 24

పాలనసంతోషితభూజనా = రాజ్యపరిపాలనముచేత సంతసమునందిన భూమియందు జనులును కలవాఁడా, నీతి......మల్లా, జనుఁడు = పురుషుఁడు, ఎవ్వాఁడు = ఎవఁడు, జనింపఁడు=పుట్టకున్నాఁడు? సంసారచక్రంబునన్

చక్రమువలె సుడియుచుండు జననమరణపరంపరయందు, ఎల్లజనులున్ = జను లందఱును, జననంబు ఎత్తెడువారె = ధర్మాధర్మవశమున మరలమరల పుట్టు వారే, కారె=కారా? విను = వినుము, ఎవ్వఁడేన్ = ఏయొకఁడు, జన్మంబు ఎత్తినన్ = పుట్టినయెడల, తనవంశంబు = తనకులము, ప్రకాశము కెక్కున్ = ప్రసిద్ధి కెక్కునో, అతఁడు, జన్మంబు+ఎత్తిన+అతండు = సఫలమగు జన్మ మెత్తినవాఁడు.

చావుపుట్టుక లెప్పుడును పరంపరగాఁగల యీసంసారచక్రమునఁ జచ్చిన వారందఱును పుట్టినవారే, అట్లుపుట్టినవారిలో నశింపనివా రెవరు? ఎవఁడు పుట్టి తనవంశమునకు కీర్తి తెచ్చునో వానిపుట్టువే గణనీయము. అనఁగా మానశౌర్య వంతుఁడే మిక్కిలి గణనీయుఁడు. తక్కినవారు మేఁక మెడచన్నువంటివారు. దోమలవలె నష్టమగువారు.

కారు+ఎ=ఈ 'ఎ' కారము క్రియయొక్క సహజార్థమును వ్యతిరేకము గాను, వ్యతిరేకార్థమును సహజముగాను మార్చును. జనుఁడు - (ఏ. వ.) జనులు (బ. వ.) విను+జన్మంబు - వినుము+జన్మంబు - మధ్యమపురుష ముచ వర్ణకమునకు హలపసానములు పరము లగునపుడు లోపము విభాషనగు. ఇచట హల్లు పరమైనది.

అవ. మానవంతుని వర్తనము.

మ. అలరుంగుత్తికిఁ బుణ్యశీలునకు యోగ్యస్థానముల్ రెండె సు
మ్మలరించు; న్మరి రెండు నెవ్వి యనిన న్బ్రాంచన్మహారణ్యమం
డలి యొండె, న్ధరణీజనప్రవరచూడాసీమ యొండెం జుమీ,
లలనానూతనమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 25

లలనా నూతన మన్మథా = అంగనలకు క్రొత్తమన్మథుఁడైనవాఁడా, సురభి......స్పతీ, అలరుంగుత్తికిన్ = పూలగుత్తికిని, పుణ్యశీలునకున్ = మంచిశీలముగలవానికిని, యోగ్యస్థానముల్ = ఉండఁదగినస్థానములు, రెండె=

రెండుమాత్రమే, అలరించుచున్ సుమ్ము = సంతోషింపఁజేయును సుమా, మరి, రెండున్ = ఆరెండుస్థానములును ఎవ్వి = ఏవి, అనినన్ — అని యడిగిన, ప్రాంచన్మహారణ్యమండలి ఒండెన్ - ప్రాంచత్ = మిక్కిలి ఒప్పుచున్న మహా అరణ్యమండలి = గొప్ప అడవిప్రదేశము - ఒండెన్ = కాని, ధరణీజన ప్రవరచూడాసీమ ఒండెన్ - ధరణీజనప్రవర = భూమండలమందలి జనుల వర్గములయొక్క, చూడాసీమ = శిరఃప్రదేశము, (సిగయం దని అలరుపరము, అందఱికన్న పైవాఁ డని మనస్విపరము), ఒండెన్ =కాని, (అగును), చుమీ.

పూవుగుత్తికి రెండేవృత్తులు. అది యెల్లవారితలలయందైనను ప్రకాశించును. లేదా, అడవిలోనే వాడిపోవును. అట్లే మానవంతునకును వృత్తులు రెండే. అతఁడు శౌర్యముచేత అందఱికంటెను పైపదవియం దుండును; లేదా, మానమందలి గౌరవముచే అడవిలో తపస్సుచేయుచు జీవితమును ప్రగ్గించుకొనును. ఉపమాలంకారము.

అలరుంగుత్తి = అలరు+గుత్తి సమాసమునందు ఉకారాంతములైన స్త్రీసమములకు పరుషసరళములు పరములగునపుడు నకారాగమము బహుళముగా నగును. తర్వాత ద్రుతకార్యము.

అవ. మానశౌర్యవంతుఁడు శక్తి యుండిగినా, గొప్ప కార్యములనే చేయఁబూనుకొను ననుట.

శా. లేరా వెండియు నేగు రార్దరుఘను ల్మింట న్గురుం డాదిగా
వారి న్మస్తకశేషుఁ డయ్యుఁ జెనక న్వాంఛింపఁ డత్యంతతే
జోరాము ల్రవిచంద్రము ల్తగుదు రంచు న్రాహు వూ
హించి పర్వారంభంబుల మార్కొను న్సురభిమల్లా...26

సురభి......స్ఫూర్తీ, వెండియున్ = సూర్యచంద్రులకుఁబిదప (ఇతరులు), గురుండు ఆదిగాన్ = గురువుమొదలైనవారు, (గురువు, బుధుఁడు, శుక్రుఁడు, శని, అంగారకుఁడు), ఏగురు అర్దరు=అయిదుగురు, ఘనుల్ =

గొప్పవారు, మింటన్ = ఆకాశమునందు, లేరా = ఉండలేదా? మస్తక శేషుఁడు = తలమాత్రము మిగతగాఁగలవాఁడు, అయ్యున్ = అయినప్పటికిని, రాహువు, వారిన్ = వారిని, చెనకన్ = ఎదిరించుటకు, వాంఛింపఁడు = ఇచ్ఛగింపఁడు. (కాని, అతఁడు,) పర్వారంభంబులన్ = అమావాస్యాపూర్ణిమలారంభించుకాలములందు, అత్యంత తేజోరాముల్ = మితిలేని ప్రకాశముచే నొప్పుచున్నవారగు, రవిచంద్రముల్ = సూర్యుఁడును చంద్రుఁడును, తగుదురు అంచున్ =(తనపరాక్రమమునకు) తగినవారని, ఊహించి=ఆలోచించి, (వారిని), ఎదుర్కొనున్ = ఎదిరించును.

రాహువునకు తలతప్ప కడమదేహము లేదు. అట్లుండినా విశేషపరాక్రమము చూపఁ గోరెను. అందులకు గురువు మొదలగు గ్రహము లైదార్గురుండినను అలక్ష్యముచేత వారి తెరువునఁ బోక అతి తేజస్వంతులగు సూర్యచంద్రులనుమాత్రమే పర్వకాలము లగు అమావాస్యాపూర్ణిమలయందు మ్రింగ యత్నించుచుండును. ఇఁక పూర్ణదేహమే యుండినచో నేమి చేయునో? అట్లే మానశౌర్యశాలియగు నిజాంగవైకల్యమును పరిగణింపక మహాత్కార్యములు చేయుటయందే ప్రియముగలవాఁడై యుండు నని భావము.

అమావాస్యనాఁడు సూర్యగ్రహణమును, పూర్ణిమనాఁడు చంద్రగ్రహణమును కలుగుట ప్రసిద్ధము. పూర్వము దేవతలును రాక్షసులును సముద్రమును చిలికినప్పు డమృతము పుట్టెను. దానిని విష్ణువు మోహినీరూపమున దేవతలకు మాత్రము పంచియిచ్చుచుండఁగా, రాక్షసుఁడగు రాహువు దేవవేషమున దేవతలనడుమ చేరి యమృతము త్రాగుచుండెను. దానిని చూచి సూర్యచంద్రు లాకపటమును కనుసన్నచే విష్ణువునకు హెచ్చరిక సేయఁగా, అయన తనచక్రముతో వానికంఠమును అమృత మందులోనికి దిగుటకు పూర్వమే ఖండించెను. దేహము తెగిపడినను తలమాత్రము అమృతప్రభావముచే ప్రాణముతో నిలిచియుండె నన్న పురాణగాథ నిట ననువదించుకొవలెను.

అప్రస్తుత ప్రశంసాలంకారము.

ఏగురార్గురు - బహువ్రీహిసమాసము.

అవ. మహాత్ములమహిమ యనంతము.

మ. భువనశ్రేణి ధరించు శేషుఁడు ఫణాభోగంబుపై; శేషుఁ గూ
ర్మవరేణ్యుండు భరించు వెన్నుపయిఁ; గూర్మంబు న్వరా
హంబుదాల్చు; వరాహంబు నయత్నత జ్జలధి దాల్చు;న్విచిత్ర
చిత్రంబు లీ, యవనిం బెద్దలవర్తన! ల్సురభిమల్లా నీతి...27

సురభి......స్పతీ, శేషుఁడు = అనంతుఁడు, ఫణాభోగంబుపైన్ = విశాలమైన తనవేయిపడగలమీఁదను, భువనశ్రేణిన్ = పాతాళాది పదునాల్గు లోకముల దొంతరను, ధరించున్ = మోచుచున్నాఁడు. శేషున్ = ఆశేషుని, కూర్మవరేణ్యుండు = ఆదికూర్మము, వెన్నుపయిన్=వీఁపుమీఁద, భరించున్= మోయుచున్నాఁడు. కూర్మంబున్ = ఆ ఆదికూర్మమును, వరాహంబు = ఆదివరాహము, తాల్చున్ = ధరించును. వరాహంబున్ = ఆవరాహమును, అయత్నతన్ = అనాయాసముగా, జలధి = సముద్రము, తాల్చున్, (ప్రళయకాలమున పాతాళగత మయిన భూమండలమును ఆదివరాహావతార మున విష్ణుదేవుఁడు తనకోరలపై నుద్ధరించి తెచ్చెను.) ఈ అవనిన్=ఈభూమి యందు, పెద్దలవర్తనల్=మానశౌర్యశాలుర నడవడికలు, చిత్రచిత్రంబులు = అత్యాశ్చర్యకరములు.

శేషుఁడు పదునాల్గులోకముల దొంతరను విశాలమైన తనవేయిపడ గలమీఁదను ఉంచుకొని మోచుచున్నాఁడు. అట్టిశేషుని తనవీఁపుమీఁద నుంచుకొని ఆదికూర్మము మోచుచున్నది. అట్టియాకూర్మమును ఆదివరా హము మోచుచున్నది. ఆవరాహమును సైతము సముద్రుఁడు అవలీలగా భరించియున్నాఁడు. మహానుభావుల మహిమలు అత్యాశ్చర్యమును పుట్టించును.

మొదటి మూఁడుపాదములలోను పూర్వపూర్వములకంటెను ఉత్తరో త్తరములు గుణోత్కర్ష కలవి అని వర్ణించుటచే మాలాదీపకాలంకారము. తుది

పాదమున మహాత్ములవర్తనమును సముద్రవర్తన మను విశేషోక్తిచే సమర్థించుట చేత అర్థాంతరన్యాసము.

అవ. ప్రాణమునకన్న మానమే రక్షణీయము.

శా. నానాజ్వాలవిలోలవహ్నిరుచిసాంద్రం బైనదంభోళిచేఁ
 దా నత్యంతము తండ్రి శీతగిరి సంత్రస్తాత్ముఁ డై యుండఁగా
 మైనాకాద్రికిఁ జెల్లునే యకట యాత్మప్రాణసంరక్ష? యే
 లా నక్కెన్ జలరాశిలో సురభిమల్లా నీతివాచస్పతీ? 28

సురభి...స్పతీ, మైనాక అద్రికిన్ = మైనాక మనుపర్వతమునకు, నానా...ద్రంబు - నానా = అనేకములయిన - జ్వాల = మంటలచేత - విలోల = మిక్కిలికదలుచున్న-వహ్ని = నిప్పుయొక్క - రుచి = కాంతిచేత- సాంద్రంబు = దట్టమైనది, (నిప్పులు కక్కుచున్నట్టిది), అగు, దంభోళిచేన్ = వజ్రాయుధము చేత, తండ్రి = తనతండ్రియైన, శీతగిరి = హిమవంతుఁడు; తాను, అత్యంతమున్ = మిక్కిలి, సంత్రస్త+ఆత్ముఁడు=వజ్రాయుధపుదెబ్బకు దుఃఖచిత్తుఁడు; ఐ, ఉండఁగాన్ = ఉన్నసమయమునందు, ఆత్మప్రాణసంరక్ష= తనప్రాణమును మాత్రమే కాపాడుకొనుట, చెల్లునే = తగునా? అకట = అయ్యో, జలరాశిలోన్ = సముద్రమునందు, (ఆమైనాకుఁడు), ఏలా = ఏవిధమున, నక్కెన్ = దాఁగెను?

హిమవంతుని దేవేంద్రుఁడు తనబలిమికొలఁది వజ్రాయుధముతో వ్రేసెను. అదియుం నిప్పులు గ్రక్కుచు మీఁదఁ బడఁగా హిమవంతుఁడు దుస్సహాబాధపాలై వళము తప్పి ప్రాణాపాయమం దున్నసమయమున, నతనికుమారుఁడు మైనాకుఁడు తండ్రిని విడిచిపెట్టి తనప్రాణములనుమాత్రము కాపాడుకొనదలంచి సముద్రమునుచొచ్చి యందు దాఁగియుండుట మంచిదికానేకాదు. మానశౌర్యవంతునకు స్వప్రాణమాత్రమురక్షించుకొనుటకైనను దాఁగియుండుట అపకీర్తికి కారణ మనినచో, ఇఁక తండ్రియాపదలో మునిఁగియున్నపు డట్లు

చేసిన అపకీర్తి తప్పు దని వేఱే చెప్పవలయునా? ప్రాణపరిత్యాగ మొనర్చియై నను మానశౌర్యములను నిలఁబెట్టుకొనవలయును.

పూర్వ మొకప్పుడు పర్వతములు భూమండలమున కుపద్రవకారకములై యుండఁగా, ఇంద్రుఁడు కోపవశమున తనవజ్రాయుధముచే వానిపక్షములను ఛేదింపసాగెను. అందువలన భయవిహ్వలుఁడై మైనాకుఁడు సముద్రమధ్యమున మునిఁగి దాఁగి యుండె నని పురాణకథ.

మైనాకుఁడు—మేనకకుమారుఁడు; మేనక హిమవంతునిభార్య.

అవ. మానవంతులు పరులతిరస్కారమును సహింప రని సదృష్టాంతముగఁ బల్కుచున్నాఁడు.

మ. తనపై నయ్యరవిందబాంధవుఁడు పాదం బూనినప్డే, యచే
తన మయ్యు న్వడిఁ జూపు మంట లిన కాంతం; బౌర తేజస్వు
లౌ। జను లేరీతి సహింతు రన్యుఁడు తిరస్కారం బొనర్ప
న్విశా। లనయశ్రీజితభార్గవా సురభిమల్లా నీతివాచస్పతీ? 29

విశాలనయశ్రీజితభార్గవా = విస్తారమగు నీతిసంపదచేత జయింపఁబడిన శుక్రుఁడు గలవాఁడా, అనఁగా, నీతిశాస్త్రమున శుక్రుని మించినవాఁడా, సురభి......స్పతీ, అచేతనము అయ్యుఁన్ = తెలివిలేనిదైనను, ఇనకాంతము =సూర్యకాంతము (సూర్యరశ్మితగులుటచే నిప్పుకలిగెడు ఒకదినుసురాయి), ఆ+అరవిందబాంధవుఁడు = సూర్యుఁడు (కమలములకుచుట్టము), తనపైన్ = తనమీఁద, పాదంబు = కిరణము (కాలు అనియు), ఊనిన+అప్డే = పెట్టినప్పుడే, వడిన్ = వేగముగా, మంటలు = జ్వాలలు (కోపములు), చూపున్, ఔర = ఆశ్చర్యము. తేజస్సులు = తేజస్సుగలవారు, ఔ = అగు, జనులు= పురుషులు (మానశౌర్యసంపన్నులు), అన్యుఁడు =ఇతరుఁడు, తిరస్కారంబు = అనాదరము (విహితాపకారము), ఒనర్పన్ = చేయఁగా, ఏరీతిన్ = ఎట్లు, సహింతురు=ఓర్తురు (ఓర్వజాల రనుట).

అచేతనమైన సూర్యకాంతమణియే సూర్యునిపాదము సోఁకినంతమాత్రా నకే మండిపడుచున్నది. అట్లుండఁగా, మానవంతులును శూరులును అగుపురుషులు పరులుచేయు పరాభవమును కించిత్తేనియు సహించి యూరకుండరు.

దృష్టాంతాలంకారము.

అవ. తేజశ్శాలురపరాక్రమమునకు వయస్సు కారణము గాదనుటం.

మ. ప్రకటోద్వాంతమదార్ద్రమైనకరిణీఘాలంబుపై సింహ మ
ర్భక మయ్యుం దుముకు; న్స్వభావ మిది శూరశ్రేణికిఃసత్వ
లక్ష్మికిఁ బ్రాయంబులు గావు హేతువులు చర్చింప న్మదా
రాతిజాలకజీమూతసమీరణా సురభిమల్లా నీతివాచస్పతీ!

మదా......రణా—మద=మదించిన - అరాతి = శత్రువులయొక్క-జాలక=సమూహమనెడు-జీమూత = మబ్బులసమూహమునకు - సమీరణా = వాయువైనవాఁడా, (గాలి మబ్బులనెగురఁగొట్టునట్లుగా శత్రువులను ఖడించినవాఁడా), సురభి...స్పతీ, సింహము, అర్భకము అయ్యున్ = పిల్లఅయినప్పటికిని, ప్రకటో...ఘాలంబుపైక్-ప్రకట=ప్రసిద్ధమయి - ఉద్వాంత=వెకుబుకుచున్న - మద = మదజలముచేత - ఆర్ద్రము+ఐన = తడిసిన- కరిణీ = ఏనుఁగుయొక్క - ఘాలంబుపైక్ = నెత్తిమీఁద, దుముకును, ఇది = ఇట్లు పరాక్రమించుట, శూరశ్రేణికిక్ = బలవంతులసమూహమునకు, స్వభావము= స్వధర్మము. చర్చింపక్ = ఆలోచింపఁగా, సత్వలక్ష్మికిక్ = బలసంపదకు, ప్రాయంబులు = వయస్సులు, హేతువులు = కారణములు, కావు.

సింహము పిల్లతనమం దుండినను అతిబలిష్ఠములు, భయంకరములు, మదధారలు స్రవించునవి అగు మదపుటేనుఁగులమీఁదికే, వానికుంభస్థలముల చీల్చు నిమిత్తము దుముకును. ఇట్లు పరాక్రమము నెఱపుట బలవంతులకు స్వభావమే గాని వయస్సు వచ్చుటచే గాదు.

## అ ర్థ ప ద్ధ తి

అవ. మానశౌర్యములు సైతము అర్థమూలములు గావున తన్నిరూప ణానంతరము అర్థపద్ధతిని ఆరంభించుచు ప్రథమమున అర్థైకతత్పరులచరిత్రమును చెప్పుచున్నాఁడు.

శా. పోవు న్జాతి యధోగతం బయి, కడు న్బోవు న్సదాచారస
ద్భావం, బన్వయశుద్ధి నిష్ఫల మగు, న్బాహాబలశ్రీ వృథా
భావం బొందు, గుణానుభావము తృణప్రాయంబగుఁ,నిర్ధనుం
డౌ వాఁ డెన్నిట ముఖ్యుఁడా సురభిమల్లా నీతివాచస్పతీ? 31

సురభి......స్పతీ, (ధనముకోరు వానికి), జాతి=బ్రాహ్మణత్వము మొదలైనజాతి, కడుఁ = మిక్కిలి, అధోగతంబు అయి=తక్కువస్థితిపొందినట్టిదై, పోవును = నశించును; సదాచారసద్భావంబు = మంచినడతయందలికోరికయు, పోవుఁ = నశించును; అన్వయశుద్ధి = వంశముయొక్క శుచిత్వము, నిష్ఫలము అగుఁ = ప్రయోజనములేనిది అగును, బాహాబలశ్రీ = భుజబలసంపద (పరాక్రమము), వృథాభావంబు ఒందుఁ=వ్యర్థమగును; గుణ+అనుభావము= ధైర్యము, ఔదార్యము, గాంభీర్యము మొదలగు గుణములయొక్క శక్తి, తృణప్రాయంబు అగుఁ = గడ్డిపోచతో సమాన మగును. నిర్ధనుండు = ధనములేనివాఁడు, ఔ వాఁడు=అగుపురుషుఁడు, ఎన్నిటఁ = దేనియందైనను, ముఖ్యుఁడా =ముఖ్యుఁ డగునా? (కాఁజాలఁడు అనిభావము.)

నిర్ధనునకు జాతిగుణశీలశౌర్యవంశము లున్నను నిష్ప్రయోజనములు; ధనమున్న నే అవి ప్రకాశించును. కనుక ధనమే ప్రధానముగా నెంచువారు బ్రాహ్మణాదికులోచితాభిమానము గణింపరు; సత్స్వభావమును మన్నింపరు; శౌర్యనాశనమునకు వగవరు. ఇవి యెల్లను తొలఁగి ధన మొక్కటి నిలుచుటయే వారు కోరునట్టిది.

ధనైకతత్పరులకు "నిర్ధనుండౌవాఁడెన్నిట ముఖ్యుఁడా" అనుపది ధనాపేక్షకు హేతువుగాన కావ్యలింగాలంకారము.

అవ. గుణము లన్నియుం ధనమునే ఆశ్రయించును:

మ.ధని యెవ్వాఁడగు వాఁడె సత్కులుఁడు, మేధాశాలి, సర్వార్థ
దర్శనుఁ, డత్యుజ్జ్వలమూర్తి, యప్రతిమవాగ్జాలుండు, సర్వ
జ్ఞుఁడౌ, । ననఁగా శోభిలు; నెల్లసద్గుణము లర్థైకాశ్రయంబు
ల్సుమీ।యనిశశ్రీజితవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ!32

అనిశ... వాసవా-అనిశ=సంతతమైన-శ్రీ=సంపదచేత-జిత = జయింపఁబడిన-వాసవా = ఇంద్రుఁడు కలవాఁడా (ఎడతెగని ఐశ్వర్యముచేత నింద్రుని మించినవాఁడా) సురభి......స్పతీ, ఎవ్వాఁడు = ఎవఁడు, ధని = ధనము కలవాఁడు, అగున్ = అగునో, వాఁడె = అతఁడె, సత్కులుఁడు = గొప్పకులమునఁబుట్టినవాఁడు, (అగును), మేధాశాలి = విద్వాంసుఁడు (ధారణాశక్తి గల గొప్పబుద్ధిగలవాఁడు), సర్వార్థదర్శనుఁడు = సమస్తధర్మాధర్మముల వినికి గలవాఁడు (శాస్త్రజ్ఞుఁడు), అతి+ఉజ్జ్వలమూర్తి = మిక్కిలి ప్రకాశించురూపముగలవాఁడు (అందగాఁడు), అప్రతిమ+వాగ్జాలుండు=సాటిలేని వాగ్ధోరణి కలవాఁడు, సర్వజ్ఞుఁడు ఔన్ = (గుణావగుణముల) సమస్తము నెఱిఁగినవాఁడౌను, అనఁగాన్ = అని చెప్పునట్లుగా, శోభిలున్ = ప్రకాశించును. ఎల్లసద్గుణములు = మంచిగుణములు అన్నియుం, అర్థ+ఏక+ఆశ్రయంబుల్ = ధనమునే ముఖ్యముగా ఆశ్రయించినట్టివి, సుమీ.

ధనముగలవానిని కులీనుఁ డనియుం, విద్వాంసుఁ డనియుం, ధర్మాధర్మవివేకియనియు, సౌందర్యవంతుఁ డనియు, వాగ్ధోరణికలవాఁడు గుణావగుణముల నెఱిఁగినవాఁ డనియు, లోకులు చెప్పుచుందురు. ధన మొక్కటి యుండునేని, తక్కినగుణములు లేకున్నను ఉన్నట్టే వ్యవహరింతు రని భావము.

ధనమునకు వైగుణసంపాదనమునకు నేసంబంధములేకున్నను తత్సంబంధముచెప్పుటచేత అతిశయోక్త్యలంకారము.

"ఎల్లసద్గుణములర్థైకాశ్రయముల్" అన్నవాక్యము ధనవంతుని "కులీనాది" గుణప్రధానుఁడగుటకు కారణముగా పలికినందున కావ్యలింగాలంకారము. చూ. ౩. ప.

దర్శనము = శాస్త్రము, ధర్మము. అర్థము = విషయము, ధనము, భావము.

అవ. ధననాశనమునకు కారణములను రెండుపద్యములచే పేర్కొనుచున్నాఁడు.

మ. యతి సంగంబు, కుపుత్త్రుఁ డిల్లు, గృషి నవ్యాలోక, మప్రీతిమి
త్త్రత, లజ్జన్సుర, పుత్త్రుఁగూర్మి, పతి దౌర్మంత్త్ర్యంబు,విశ్లేషమి
ష్టత, దుస్సేవ బుధుఁ,గునీతి సిరి, వెచ్చం బర్థము,న్వేదబా
హ్యత విప్రు, న్జెఱుచు న్గదా సురభిమల్లా నీతివాచస్పతీ! ౩౩

సురభి ... వాచస్పతీ, సంగంబు = కామక్రోధముల చేరిక, యతిన్ = యోగిని, చెఱుచున్ = చెడఁగొట్టును, కుపుత్త్రుఁడు = దుష్టుఁడగుపుత్త్రుఁడు, ఇల్లు = వంశమును, అవ్యాలోకము = పైవిచారణలేమి, కృషిన్ = సేద్యమును, అప్రీతి = విశ్వాసములేమి, మిత్త్రతన్ = చెలిమిని, సుర = సారాయి, లజ్జన్ = సిగ్గును, కూర్మి = లాలన, పుత్త్రున్ = కొడుకును, దౌర్మంత్త్ర్యంబు = దుష్టులైనమంత్త్రులు, పతిన్ = రాజును, విశ్లేషత = ఎడఁబాటు, ఇష్టతన్ = స్నేహమును, దుస్సేవ = దుష్టులయొక్క కొలువు, బుధున్ = పండితుని, కునీతి = నీతిలేమి, సిరిన్ = సంపదను, వెచ్చంబు = వ్యయము, అర్థమున్ = ధనమును, వేదబాహ్యత = వేదములకు వెలిగా నుండుట (వేదములు చదువమి), విప్రున్ = బ్రాహ్మణుని, చెఱుచున్ కదా = నాశమొందించును గదా.

సంగముచేత యోగియు, దుష్టుఁడగుపుత్త్రునిచే కులమును, పైవిచారము చేయకపోవుటచే పైరును, అనురాగములేమిచేత మైత్త్రియు, సారాయిచేత

సిగ్గును, లాలనముచేత పుత్త్రుఁడును, దుర్మంత్రులచేరాజును, దేశసంచారము వలనఁ గల్గునెడఁబాటుచే స్నేహమును, దుర్మారులసేవచే మంచినడవడిగల వాఁడును, నీతిలేమిచే సంపదయు, దుర్వ్యయము (అపాత్రదానము)చేత ధనమును, వేదాధ్యయనములేకపోవుటచే బ్రాహ్మణుఁడును చెడును.

సంగము- ఐహికవాంఛ; దీనివలన కామము, దానివలనక్రోధము, ఆక్రోధముచే సంమోహము, దానిచే స్మృతివిభ్రమము క్రమముగా కలుగును అని గీత.

కుపుత్త్రుఁడు- చెట్టుతోఁ బుట్టినిప్పు ఆచెట్టు నొక్కఁడానినే కాల్చును; కుపుత్త్రుఁడు కులమంతటిని నాశముచేయును. ఇల్లు - కులము - ఇంటిపేరు.

అప్రీతి - దుర్జనులస్నేహము మృద్ఘటమువలె సుఖముగా భేదింపఁ దగినది, కూర్చుటకు వీలుకానిది. సుజనస్నేహము బంగారుకుండవలె సుఖముగా భేదించుటకు వీలుకానిది, శీఘ్రముగా అతుకుకొనునట్టిది.

లజ్జ-అకార్యములుచేయుటకు వెఱఁదీయునట్టిది. సుర - అయుక్త భాషణములాడించును, శరీరమును దిసమొలగావించును, క్రౌర్యము పుట్టించును. వివేకమును నశింపఁజేయును.

కూర్మి - లాలన బహుదోషములకు మూలము. దౌర్మంత్ర్యంబు అదండ్యుల దండింపఁజేయుంట మొదలగు నుపదేశములచేత లక్ష్మి నశించు నని భావము. పరులకు రాజ్యాపహారణమున కవకాశ మేర్పడును.

సన్మంత్రులవల్ల రాజులకు రాజ్యము, ధర్మము, ఐశ్వర్యము, కీర్తి మొదలగునవి వృద్ధియగును; దుర్మంత్రులవల్ల నవియెల్ల నాశ మగును.

విశ్లేషత - చిరప్రవాసము - దీర్ఘకాల మెడఁబాసి యుండుట.

కడుపునపుట్టినబిడ్డలకు, సోదరులకు, రాజులకు, సేవకులకు కలిగెడు ప్రేమ స్వదేశము వదలిపోవుటచేత తగ్గసాగును. అదే దీర్ఘమైనచో సంపూర్ణముగా ఆప్రేమ తొలఁగును.

బుధుఁడు - సత్స్వభావము కలవానికి దుర్జనసమాగమము అత్యంతా నర్థమూలకము. దుర్జనసేవ ఆత్మభావమును కప్పివేయును, బుద్ధిమాంద్యము కలుగఁజేయును; దోషములయందే బుద్ధిని ప్రవేశపెట్టును.

సిరిన్ - సమృద్ధియగు సంపత్తి. న+నీతి = నీతిలేమి.

ధనమద మనునది స్వమతాభినివేశమును, అధికారాభిలాషను, స్వజనమం దనాదరణమును, తమభావముల కంగీకారము చూపనివారియందు విరోధమును, పరులక్షేమమునకు విముఖతను అభివృద్ధిచేసి, వినయమును పాఱఁద్రోలి, క్రౌర్యమునకు వాఁడిమి పుట్టించును. వానిబుద్ధి పెడదారులనే సంచరించుచుండును.

ఎవనికి దుష్టులగుమంత్రులు కలరో అట్టివానియొక్క భావము- దౌర్మంత్ర్యము.

వేదబాహ్యము-వేదవేదాంగతత్త్వజ్ఞుఁ డగు విప్రునకు సర్వత్ర పూజ్యత గలదు. వేదబాహ్యుఁ డన్ననో సభలయందు శోభింపఁజాలఁడు.

'చెడున్' అనుధర్మ మిట పేర్కొన్నవారి కెల్ల సామాన్యము గావున తుల్యయోగితాలంకారము.

అవ. ధనము మూఁడువిధముల నాశము చెందును.

మ. సరవి న్దానము,భోగమున్, మరి వినాశం, బన్న యిమ్మూఁడు
ఖరుల న్మర్త్యులు సంతరించుధనసంఘాతం బపేతం బగున్;[వై
ధరలో నాద్యము లైన రెండువిధము ల్దప్పి, న్దృతీయంబె యొ
ల్లరయర్థంబున కౌఁ జుమీ సురభిమల్లా నీతివాచస్పతీ ! 34

సురభి...స్పతీ, సరవిన్=వరుసగా, దానము = ఇచ్చుట, భోగమున్= అనుభవించుటయును, మరి=ఇంకను, వినాశంబు = పరులపాలగుట, అన్న=అని చెప్పిన, మూఁడు, వై ఖరులన్=రీతులుగా, మర్త్యులు=మనుష్యులు, సంతరించు=సేకరించు, ధనసంఘాతంబు=ధనరాశి, అపేతంబు అగున్ = తొలఁగిపోవును.

ధరలో౯ = భూమియందు, ఆద్యములు ఐన = మొదటివి ఐన, రెండువిధముల్ = రెండురీతులును, తప్ప౯ = తప్పినయెడల, తృతీయంబు+ఎ=మూఁడవదగు వినాశమే, ఎల్లర+అర్థంబునకు౯ = అందఱి ధనమునకును, ఔ౯ చుమీ = నిశ్చయముగా నగును.

ధనమునకు సత్పాత్రదానము, తా ననుభవించుట, దొంగలు మొదలగు వారు అపహరించుట అనునవి మూఁడువిధములైన పోకడలు. ఎవఁడు సత్పాత్రమున నీయక, తా ననుభవింపక కూడఁబెట్టునో, వానిధనమునకు నాశమే గతి.

ధనమునకు ధర్మము, అగ్ని, నృపులు, తస్కరులు అని దాయాదులు నల్వురు. వారిలో జ్యేష్ఠమైనధర్మము నవమానించినచో తక్కినమువ్వురు కుపితు లగుదురు. విత్తమునకు దాన ముత్తమగతి, ఆత్మభోగము మధ్యమగతి, చోరాదులచే నాశ మధమగతి. కనుక ధనాఢ్యులకు దానమే శ్రేయము.

అవ. దానమువలన నొకవేళ పేదఱికము గలిగినను అయ్యది దాతకు శోభనే కలిగించును.

మ. రతుల న్బాల, కళావిశేషత నిశారా, జీగి నర్థాఢ్యుఁడు
గ్రతరాస్త్రక్షతి జోదు, శాణకలన న్రత్నంబు, దానాతిని
స్రుతి నేనుంగు, శరత్కృశాంభమున నేఱు,న్శోభిలుఁ జూడన
ల్పత గన్పించియుఁ బెంపుచే సురభిమల్లా నీతివాచస్పతీ! 35

సురభి .. స్పతీ, రతుల౯ = మన్మథక్రీడలచేత, బాల = లేఁబ్రాయపు యువతియుఁ, కళావిశేషత౯=(పదునేనుకళలు దేవతలు భక్షింపఁగా, ఒక్క) కళ (మాత్రము) మిగిలియుండుటచేత (పదునాఱవపాలు మిగిలియుండుట చేత), నిశారాజు౯ = రాత్రినిపాలించెడు చంద్రుఁడును, ఈగి౯=సత్పాత్ర దానముచేత (రూ. ఈవి), అర్థాఢ్యుఁడు౯=ధనవంతుఁడును, ఉగ్రతర అస్త్ర క్షతి౯=మిక్కిలి వాఁడియైన ఆయుధముల దెబ్బలచేత, జోదు౯ = యోధుఁ

డును, శాణకలనన్ =సానపెట్టఁబడుటచేత, రత్నంబున్ = మణియు, దాన+అతి+నిస్రుతిన్ = మదజలము మిక్కుటముగా కాఱుటచేత, ఏనుంగున్, శరత్ కృశ+అంభమునన్ =శరదృతువునందు కొంచెముగా నెండిన యిసుకదిబ్బల చేత, ఏఱున్ = నదియును, చూడన్ = పరిశీలింపఁగా, అల్పత=కృశత్వము (చిక్కిపోవుట), కన్పించియున్ =కనఁబడినప్పటికిని, వెంపుచేన్ =నాశము చేత (పేదఱికముచేత), శోభిలున్ =సొంపెక్కును.

రతిక్రీడలచేత డస్సినబాలయు, ఒక్కకళమాత్రమే మిగిలియున్న చంద్రుఁడును, సత్పాత్రదానముచే నర్థమెల్లఁగోల్పోయి బీదలైన దాతలును, వాఁడియాయుధములగంట్లు గలజోదును, సానఁబెట్టిన రత్నమును, మదజలము కాఱుటచేత చిక్కినయేనుఁగును, శరత్కాలమున ఇసుకదిబ్బలు ఎండిన నది యును, తమకృశత్వము చేతనే ప్రకాశించును.

కళ—పదునాఱవభాగము, విద్య; పెంపు=అభివృద్ధి, నాశము.

ఉగ్రతర-ఉగ్ర(నిజభావము) ఉగ్రతర(తరభా.) ఉగ్రతమ (తమభా.)

జోదు. (వి) యోధుఁడు (ప్ర.) శాణ (ప్ర.) సాన (వి.)

దానము - మదజలము. ఏనుఁగునకు మదము ఎనిమిదిచోట్లఁ బుట్టును. వానికి పేళ్లును వేఱు. చెక్కిళ్లఁబుట్టునది దానము, కన్నులఁబుట్టునది సీధువు. తొండము చివరఁబుట్టునది శీకరము. తక్కినయంగములలో పుట్టువానికి సాగ రము, శిక్యము, మదము, ఘర్మము, మేఘము అని పేళ్లు.

ప్రస్తుత మగుజనులయందును అప్రస్తుతముగ పేర్కొన్న వస్తువులన్నిటను శోభారూపమగు తుల్యధర్మము గమ్యమానమై యుండుటచేత దీపకాలం కారము.

కళావిశేషతన్-చంద్రునకు షోడశకళ లని ప్రసిద్ధి. "వానిలో పదునే నింటిని కృష్ణపక్షమున దేవతలు ఆరగింతురు. మిగిలినయొకకళతో చంద్రుఁడు అమావాస్యనాఁడు ప్రకాశింపఁజాలఁడు; కాని సూర్యమండలమందు ప్రవే శించును. కనుక నాఁడు మనకు గోచరింపఁడు. ఆయొకకళయు శుక్లపక్షమున

చానాఁటికి వర్ధిల్లును. పూర్ణిమనాఁటికి పూర్తిగా నుండు నని పౌరాణికుల మతము.

అవ. వస్తువులయందు ఆదరముగాని అనాదరముగాని కలిమిలేములను బట్టియే కలుగుచుండును.

మ. తొలుతం జేరెఁడువడ్లకేఁకరు దరిద్రుం; డంత సంపన్నుఁడై
యిల సర్వంబు తృణీకరించు; ఘనము న్హీనంబునుంగా గురు
త్వలఘుత్వంబులనిశ్చితంబు లగు చర్థశ్రేణి దోపించుఁ బెం
పలర న్దిష్టవిశేషము ల్సురభిమల్లా నీతివాచస్పతీ ? 36

సురభి...స్పతీ, దరిద్రుండు, తొలుతన్ = మొదట, చేరెఁడు వడ్లకున్ = చేరెఁడంత వడ్లకైనను, ఏఁకరున్ = వాఁచిపోవును; అంతన్ = తర్వాత, సంప న్నుఁడు ఐ = సమృద్ధితో కూడినవాఁడై (ధనికుఁడై), ఇలన్ సర్వంబున్ = భూమినంతటిని, తృణీకరించున్ = తిరస్కరించును. (గడ్డిపరకతో సమానముగా నెంచును). ఘనమున్ = గొప్పదియు, హీనంబునున్ కాన్ = అల్పమైనదియుఁగా, పెంపు అలరన్ = గౌరవ మతిశయించునట్లుగా, దిష్టవిశేషముల్ = విశేషములగు భాగ్యములు, అర్థశ్రేణిన్ = ధనసమూహమునందు, గురుత్వలఘుత్వంబులు = అధికము అల్పము అను భావములు, అనిశ్చితంబులు = రూఢి కానివి, (ఆధిక్యమున గౌరవము, అల్పత్వమున చులకదనము అను నియమము అభావము అని యర్థము.) అగుచున్, తోపించున్ = తోఁచునట్లు చేయును.

దారిద్ర్యము ననుభవించునపు డొకచేరెఁడు ధాన్యమునకే దరిద్రుఁడు వాఁచిపోవును; కాలాంతరమున ఐశ్వర్యము కలుగఁగానే భూమండలమంతయుం నతనికి తృణప్రాయ మగును. అట్లే కలిమిలేముల ననుసరించి వస్తువులలో అధికము అల్పము అను బుద్ధి తోఁచుచుండును. ఒకప్పుడు అల్పమైనది మఱొకప్పు డధికముగను, అధికమైనది అల్పముగను తోఁచును. ఇట్టియవస్థ లోకమున ప్రత్యక్షసిద్ధము; వివేకి యగువాని కీవిపర్యస్తబుద్ధి కలుగదు అని భావము.

ఆవ. రాజులకు ధనాద్యభివృద్ధి కుపాయము.

మ. భువి గోధేనువుఁ జేసి భూజనముఁ గ్రేపుం జేసి పోషించుభూ
 ధవుఁ డేయిష్టము నేనియుం బిదికిన న్దద్భూమి యయ్యిష్టముల్
 సవిశేషస్థితి నిచ్చుఁ గల్పలతచందానన్ ద్విషద్భూమిపా
 లవనాభీలదవానలా సురభిమల్లా నీతివాచస్పతీ! 37

ద్విష...దవానలా—ద్విషత్ = శత్రువులగు-భూమిపాల = రాజుల కెడు-వన=అడవికి- ఆభీల=భయంకరమైన-దవానలా=కార్చిచ్చువంటివాఁడా, సురభి...స్పతీ, భువిన్ = భూమిని, గోధేనువున్ = పాఁడియావునుగా, చేసి, భూజనమున్ = ప్రజలను, క్రేపున్ = దూడను, చేసి, పోషించు = పెంచునట్టి, భూధవుఁడు=రాజు, ఏయిష్టము నేనియున్=ఏయిష్టకార్యము నైనను, పిదికినన్ = పిండినను, తద్భూమి=అట్లు పోషించినభూమి, అయిష్టమున్=అయిష్టఫలమును, కల్పలతచందానన్ = కల్పవృక్షపుఁగొమ్మవలె, సవిశేషస్థితిన్ = అతిశయముగు నట్లుగా, ఇచ్చున్.

దూడ చక్కఁగా పెరుగుచు పాలు కుడుచుచుండిన ఆవు చేఁపి పాలు సమృద్ధిగా ఇచ్చుచుండును. దూడ నాశ మయిన పాఁడియుం నాశ మగును. అట్లే ప్రజలువర్ధిల్లుచు వ్యవసాయము మొదలగునవి చేయుచుండిన భూమియుం నానావిధముల ఫలములను కల్పవృక్షమువలె ఇచ్చుచునేయుండును. రాజు లోకపరిపాలనము చేయనిచో అర్థలాభము కలుగనేరదు. కావున భూమి వలన ఫలము పొందఁగోరినరాజు జనులను చక్కఁగా పోషించుకొనవలయును.

ఇష్టమున్ = ఇష్టకార్యమును - విశేషణములు కొన్నియెడల విశేష్య లక్షకము లగు.

చందము+నన్ = చందానన్-ఉు ల న - లు పరమగునపుడు కొన్ని ముపర్ణకాంతశబ్దముల మువర్ణమునకు లోపమును తత్పూర్వహ్రస్వమునకు దీర్ఘమును విభాష నగు. ఉపమాలంకారము.

పూర్వవాక్యగత ఉపమ కుత్తరవాక్యగత ఉపమకు సంకరము. ద్విష...
దవానలా—రూపకము.

అవ. రాజనీతి బహువిధములు.

మ. నిజముం బొంకును గ్రౌర్యము న్బ్రియము నెంతే వెచ్చమున్విత్తసం
భజనంబు న్మరిహింసయు న్గృపయు లోభంబున్వదాన్యత్వముం
సృజియించు: న్ధరయందు ననిశ్చయగతిం జెన్నారు నవ్వేశ్యలీ
ల జనాధీశులనీతి శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ? 38

శ్రీసురభి...స్పతీ, ధరయందుం = భూమియందు, జనాధీశులనీతి = రాజనీతి, అవ్వేశ్యలీలం = వారాంగనవలె (సమయమునకుం దగినట్లు) అనిశ్చయ గతిం = నిశ్చయము లేనివిధమున, చెన్నారుం = ఒప్పుచుండుచు; (ఎట్లన), (అది), నిజముం = సత్యమును, బొంకునుం = అసత్యమును, క్రౌర్యముం = క్రూరముగా పలుకుటను, ప్రియముం = ఇచ్చకములాడుటను, ఎంతే వెచ్చముం = ఎంతో వ్యయమును, విత్తసంభజనంబుం = ధనమును సేవించుటయుం, మరి = ఇంకను, హింసయుం = బాధించుటయుం, కృపయుం = కనికరమును, లోభంబుం = పిసినిగొట్టుతనమును, వదాన్యత్వముం = ఈవియు, సృజియించుం = సృష్టిచేయుంచు, (కల్పించును.)

వారాంగన సమయోచితముగా సత్యమాడుటగాను బొంకులాడుటగాను, కఠినముగ పలుకునట్లును, ఇచ్చకము లాడునట్లును, సదా వ్యయముచేయు నట్లును విత్తమును రాబట్టునట్లును, బాధించునట్లును దయచూపునట్లును, లోభిగాను పరమదాతగాను, పెక్కులీలల ప్రవర్తించుచుండును. అట్లే రాజనీతి కొన్నితావుల సమయోచితముగ నిజము బొంకు, క్రౌర్యము ప్రియము, వెచ్చము రాబడి, హింస కృప, లోభము ఈవి, అను నానాప్రకారముల నొప్పుచుండును.

నిజము బొంకు మొదలగుపదములను వినుటమాత్రముచేతనే విరోధము

స్ఫురించును. కాని యది స్వభావముచేతనే ఆభాసము లగునుగాన, వేశ్యాలీలన్ అను ఉపమతో అంగాంగీభావమున విరోధాభాసాలంకారము.

అవ. గుణాఢ్యునే యాశ్రయింపఁదగును గాని నిర్గుణుని కా దనుట.

శా. త్యాగంబు ద్విజరక్షణంబు స్వజనత్రాణంబు సత్కీర్తియున్
భోగం బాజ్ఞయునాఁగ నాఱుగుణముల్ పొల్పొందెనేనిన్, స్థిరో
ద్యోగుండై భజియింపఁగావలయు; లేకున్న న్వృథాగాక యే
లా గోత్రాపతిఁ గొల్వఁగా సురభిమల్లా నీతివాచస్పతీ! 39

సురభి...స్పతీ, త్యాగంబున్ = సత్పాత్రదానమును, ద్విజరక్షణంబున్ = నిరుపద్రవముగా బ్రాహ్మణులను రక్షించుటయును, స్వజనత్రాణంబున్ = బంధువులను ఉద్ధరించుటయును, సత్కీర్తియున్ = దానము, పరాక్రమము మొదలగువానివలన కలుఁగుయశస్సును, భోగంబు = పుష్పములు గంధపుఁబూఁత మొదలగువానివలన కలిగెడు సుఖానుభవమును, ఆజ్ఞయున్ = శాసనమును, నాఁగన్ = అని ప్రసిద్ధమయిన, ఆఱుగుణముల్ = ఈయాఱుగుణములును, పొల్పు+ఒందెనేనిన్ = చక్కఁగా ఉన్నయెడల, గోత్రాపతిన్ = రాజును (గోత్రము= భూమి), స్థిర+ఉద్యోగుండు+ఐ=నిలుకడయగు ప్రయత్నముకలవాఁడై, భజియింపఁగాన్ వలయున్ = సేవింపవలెను. లేకున్నన్ = (ఆగుణములు) లేకున్నచో, వృథాకాక=నిష్ప్రయోజనమే యగును. (కనుక). గోత్రాపతిన్=(అట్టి నిర్గుణుఁడగు) రాజును, కొల్వఁగాన్=కొలుచుట, ఏలా=ఎందులకు? (రూ. ఏల.)

త్యాగము, బ్రాహ్మణసంరక్షణము, బంధుపోషణము, కీర్తి, అనుభవము, ఆజ్ఞ అను నీయాఱుగుణములును ఏరాజులందు కలుగవో అట్టివారి నాశ్రయించుట నిష్ఫలమే యగును.

బ్రాహ్మణశబ్ద మిచట ఉపలక్షణము. అజాతినుద్దేశించి చెప్పినది సామాన్యధర్మముచే తదితరస్థలములందును వర్తించును.

అవ. ధనముపైఁ బేరాస కూడదు, ధనలాభాలాభములు దైవాధీనములు.

శా. దేవుం డిచ్చినయంత గల్గు నడవి న్దేవాద్రి నైన; న్జడుం
డై విత్తాఢ్యుల కేఁకర న్వలదు; తోయం బిద్ధర న్గుండకున్
బావి న్ముంచినఁ గుండెఁడు న్జలధి ముంప న్బుట్టెఁడున్ బుట్టునా
లావణ్యాపరమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ ! 40

లావణ్యాపరమన్మథా = సౌందర్యమున రెండవమన్మథుఁడా, సురభి... స్పతీ, (మనుష్యునకు), అడవిన్ = అడవియందుఁగాని, దేవాద్రిన్ ఐనన్ = దేవతలకొండ యగు మేరువునందుఁగాని, దేవుఁడు, ఇచ్చిన అంత = ఎంత యిచ్చునో అంతే, కల్గును. జడుండు ఐ, మందబుద్ధియై, విత్త+ఆఢ్యులకున్ = ధనవంతులకొఱకు, ఏఁకరన్ వలదు = వాఁచిపో నక్కఱలేదు. ఈధరన్ = ఈభూమియందు, కుండకున్ = కుండలోనికి, బావిన్ = బావియందు, ముంచినన్ = ముంచఁగా, కుండెఁడున్ = కుండపరిమాణమును, జలధిన్ = సముద్రమునందు, ముంపన్ = ముంచఁగా, పుట్టెఁడున్ = పుట్టి+ఎఁడున్ = ఇరువదితూములంతయు, తోయంబు=నీళ్లు, పుట్టునా = కలుగునా ?

తననొసట దేవుఁడు కొద్దియో గొప్పయో యెంతధనము వ్రాసెనో అంతే అడవిలో నుండినా, మేరువునెక్కినా తప్పకకలుగును. మేరువునెక్కినమాత్రాన అంతకంటె నధికముగఁ బొందఁజాలఁడు. కనుక ధనవంతులయాశ్రయమునకై వ్యర్థముగా వేసట పొంద నక్కఱలేదు. కుండలో బావిలోనైనను సముద్రములోనైనను కుండెఁడునీళ్లే పట్టునుగాని పుట్టెఁడునీళ్లుపట్టవు. కావున మనుష్యుఁడు సమాహితచిత్తుఁడై యుండవలెను అనియు, అతని యార్జనశక్తి యతనియందే కల దనియు సూచితము.

కుండ+ఎఁడు, పుట్టి+ఎఁడు - పరిమాణార్థకమైన ఎఁడు వర్ణకము పరమగునపు డెల్ల యచ్చులకు సంధి నిత్యము.

## దుర్జనపద్ధతి

అర్థాదిసంపన్నుఁడైనను దుర్జనుఁడు చేరఁదగినవాఁడు కాఁడు కనుక అర్థపద్ధతియనంతరము దుర్జనపద్ధతి నిరూపింపఁబడును.

అవ. దుర్జనుల యవగుణములు.

మ. కరుణాలేశములే, దకారణమె యుగ్రంబైనకోపం బిడుఁ;
బరనారీపరవిత్తవాంఛితము లాత్మన్ నిత్యమున్ జేయు; వే
మరు విద్వజ్జనబంధుబృందము నలంపన్ జూచు; నిప్పాటఁ గ
ల్లరి యౌ వానిగుణం బగు స్సురభిమల్లా నీతివాచస్పతీ! 41

సురభి...స్పతీ, కరుణాలేశము = కనికరము ఒక్కింతయును, లేదు. అకారణమె = ఏకారణమును లేకయె, ఉగ్రంబు ఐనకోపంబు = తీవ్రమైన కోపమును, ఇడున్ = ఉంచును. ఆత్మన్ = మనస్సున, నిత్యమున్ = ఎల్లప్పుడును, పర...తములు - పరనారీ = ఒరులస్త్రీలయందును-పరవిత్త = ఇతరులధనమునందును-వాంఛితములు = ఆశలు, చేయును. వేమరు=మాటిమాటికి, (రూ. వేమారు), విద్వజ్జనబంధుబృందమున్ - విద్వజ్జన = పండితులయొక్కయు, బంధు = బంధువులయొక్కయు - బృందమున్ = సమూహమును, అలంపన్ చూచున్ = బాధింప నెంచును. కల్లరి ఔ = దుష్టుఁ డగు, వాని గుణంబు = పురుషునియొక్కగుణము, ఇప్పాటన్ = ఈవిధముగా, అగున్= మార్పుపొందుచుండును.

లేశ మయినను కనికరములేమి, కారణములేకయె కోపించుట, పరస్త్రీలను పరధనమును ఆశించుట, సజ్జనులను బంధువులను బాధింప నెంచుట అనునివి యన్నియు దుష్టులకు స్వభావసిద్ధములగు గుణములు.

కరుణ - పరులదుఃఖమును పోఁగొట్టవలయునన్న ఇచ్ఛ

అవ. దుర్జనుఁడు విద్వాంసుఁడైనను వానిని దగ్గఱఁ జేర్పరాదు.

మ. బహువిద్యావిదుఁడయ్యు దుష్టజనుఁ డెప్పాటన్వివర్జ్యుండుగా
ని, హితుం జేసికొనం దగండు, ఫణమాణిక్యోజ్జ్వలం బయ్యున

య్యహి సంత్యజ్య మెకాని చేకొనఁగ నర్హాంబే విభాస్వద్దయా
లహరీనిర్ఝరిణీశ్వరా సురభిమల్లా నీతివాచస్పతీ? 42

విభాస్వ...శ్వరా—విభాస్వత్ = మిక్కిలి ప్రకాశించుచున్న - దయా = కరుణ యనెడు-లహరీ=అలలతోఁగూడిన - నిర్ఝరిణి = నదులకు- ఈశ్వరా=ప్రభువగు సముద్రునివంటివాఁడా, సురభి...స్పతీ, దుష్టజనుఁడు =దుష్టుఁడు, బహువిద్యావిదుఁడు = సకలవిద్యలను నేర్చినవాఁడు, అయ్యుక్ = అయినప్పటికిని. ఎప్పాటన్ = ఏవిధముచేతనయిన, వివర్జ్యుండు=విడువవలసిన వాఁడు, కాని, హితున్=హితవగినిగా, చేసికొనన్ = చేసికొనుటకు, తగండు= యోగ్యుఁడుకాఁడు. ఫణ=పడగయందు, మాణిక్య+ఉజ్జ్వలంబు=రత్నముచేత మిక్కిలి ప్రకాశించుచున్నట్టిది, అయ్యును, అయ్యహి = అ+అహి=ఆపాము. సంత్యజ్యమె=విడిచిపెట్టఁదగినదే, కాని, చేకొనఁగన్=గ్రహించుటకు, అర్హాంబే =తగినదా? (కాదనుట.)

దుర్జనుఁడు విద్యావంతుఁడయ్యును మణిభూషిత సర్పప్రాయుఁడు. శిరమునందు రత్నము కలదైనను పాము భయంకరమైనది గనుక చేరఁదీయఁదగినది కాదు; దూరముగా వదలిపెట్టవలసినదే; అట్లే దుష్టుఁడు విద్యగలవాఁడైనను ద్రోహియే కావున వానిని తప్పక త్యజింపవలయును.

బింబప్రతిబింబన్యాయమున ధర్మధర్మిణులను వాక్యద్వయమున విడి విడిగా నిర్దేశించుటచే దృష్టాంతాలంకారము,

విద్య - వేదవేదాంగాదివిద్య. అహి=సదా సంచరించునది - పాము.

అవ. దుర్జనుఁడు సర్వలోకమును దూషించును.

మ. మునిమూఢుండను,సిగ్గరిన్జడుఁడనున్,బుణ్యవ్రతున్దాంభికుం
డను, శుద్ధుంగితవుండనున్, స్థిరు నశక్తాత్ముండను, న్మంజువా
దిని దీనుండను, వక్తఁబల్లదుఁ డనున్, దేజస్వి గర్వాధికుం
డనుఁ, గూళెవ్వరి మే లను న్సురభిమల్లా నీతివాచస్పతీ? 43

సురభి . . . స్మృతీ! కూళ=దుర్జనుఁడు, మునిన్=మననశీలుని, మూఢుండు=బుద్ధిలేనివాఁడు, అనున్ = అని చెప్పును, సిగ్గరిన్ = లజ్జావంతుని, జడుఁడు=మందుఁడు, అనున్, పుణ్యవ్రతున్=తపమును చాంద్రాయణాది వ్రతములను ఆచరించువానిని, దాంభికుండు = బడాయికొట్టుకొనువాఁడు, అనున్, శుద్ధున్=స్వభావముగనే బాహ్యాంతరముల నిర్మలుఁడైనవానిని, కితవుండు = మోసగాఁడు, అనున్, స్థిరున్ = నిలుకడ కలవానిని, అశక్తాత్ముండు = శక్తిలేనివాఁడు, అనున్, మంజువాదిని = ఇంపుగా పలుకువానిని, దీనుండు = భయపడినవాఁడు (లేక, దేవురించువాఁడు). అనున్, వక్తన్ = మంచివాగ్మిని, ప్రల్లదుండు = వాచాలుఁడు, అనున్, తేజస్విన్ = పరాక్రమవంతుని, గర్వాధికుండు = గర్వి, అనున్, కూళ = దుర్జనుఁడు, ఎవ్వరిన్ = ఎవరిని, మేలు = మంచివాఁడు, అనును?

దుర్జనుఁడు ఆత్మైక్యమననశీలుని బుద్ధిహీనుఁ డనియు, అకార్యములకు వెఱదీయు సిగ్గరిని జడుఁ డనియు, చాంద్రాయణాదివ్రతానుష్ఠానపరుని డాంభికుఁ డనియు, స్వభావశుద్ధుని పారమార్థికబుద్ధి లేనికపటి యనియు, స్థిరుని అశక్తుఁ డనియు, ఇంపుగా మాటలాడువానిని దీనుఁ డనియు, మంచివాగ్మిని ప్రేలుడుగాయ యనియు, స్వభావముగనే పరాక్రమవంతుఁ డగువానిని గర్వి అనియు గణించుచుండును. ఇట్లు కూళ గుణవంతులగుణములను దోషభూయిష్ఠములు కావింపని దేదియు నుండదు.

కూళ+ఎవ్వరి = కూళెవ్వరి - అత్తునకచ్చుపరమగునపుడు సంధిబహుళము - ఇచట సంధి శ్రావ్యము కాదు.

సిగ్గు+అరి - అరి - మతుబర్థక ప్రత్యయము.

అవ. గుణదోషముల ప్రణాళిక.

మ. సుమహాత్త్వంబె విభూష,సజ్జనతయె చుట్టంబు,కొండెంబె పా
పము, లుబ్ధత్వమె దుర్గుణంబు, చదువే భాగ్యంబు, సత్యంబె స

ద్విమలం బౌతప, మాత్మశుద్ధియె మహాతీర్థంబు, దుష్కీర్తియే
యమితక్లేశము దేహికి స్సురభిమల్లా నీతివాచస్పతీ. 44

సురభి...స్పతీ, దేహికిన్ = (దేహము కలవానికి) మానవునకు, మహత్త్వంబె = గొప్పతనమే, విభూష = అలంకారము, సజ్జనతయే = మంచితనమే (సాధుత్వమే), చుట్టంబు = బంధువు, కొండెంబె=చాడియే, పాపము= పాతకము, లుబ్ధత్వమే = పిసినిగొట్టుతనమే, దుర్గుణంబు = మిక్కిలినిందావహమైనది, చదువే = మంచివిద్యయే, భాగ్యంబు = ధనము, సత్యంబె = నిజము పలుకుటయె (సమదర్శిత్వమే), సద్విమలంబు ఔ = మిక్కిలిపరిశుద్ధమగు, తపము = తపస్సు, ఆత్మశుద్ధియె = మనశ్శుద్ధియే, మహాతీర్థంబు = (గంగాది) పవిత్రతీర్థము. దుష్కీర్తియే = అపకీర్తియే, అమితక్లేశము = మితిలేనిదుఃఖము (చావు).

మానవుని గొప్పతన మలంకరించును; సజ్జనత యతనికార్యముల నెల్ల చక్కఁబెట్టు బంధు వగును. కొండెము చెప్పుటకంటె వేఱొక పాతకము చేయ నక్కఱ లేదు. లోభ మతని సకలగుణములను చెఱుచును. విద్యయే యతనికి ధనము. యథార్థవాదియు సమదర్శియు నగుచో తపము చాంద్రాయణము మొదలగువానిచే పరిశుద్ధి పొందవలసినపని లేదు. మనశ్శుద్ధికంటె పుణ్యతీర్థము వేఱులేదు. అపకీర్తియే చావు. ఈవిధముగా విచారించి మానవుఁడు సద్గుణార్జన తత్పరుఁడు కావలయును. కాకున్నచో, దౌర్జన్యము అనాయాసముగా వల వడును అనిభావము.

విభూష = విశేషమైనభూషణము - కుండలములు హారములు మొదలైనవి. 'సజ్జనత" కార్యములనెల్ల నిర్వహించుశక్తి గలది. కొండెము = పరోక్షమున పరదోషసూచనము. పాపము =బ్రహ్మహత్యాదిదుష్కృతములవలనఁ గల్గు ఫలము. లుబ్ధత్వము=దుర్గతికి తప్పనిమార్గము. లుబ్ధునియొక్క భావము - ధనాదులయందు వాంఛ, అనర్థముల కెల్ల మూలము. చదువు = వేదవేదాంగాది.

విద్యాపతనము. ఆత్మశుద్ధి=క్రోధచింతాదిరాహిత్యమగుమనస్సు. మహాతీర్థము - ప్రయాగవంటి పుణ్యక్షేత్రము అపవర్గమూలకము, మోక్ష మిచ్చునట్టిది.

దుష్కీర్తి - మృత్యుప్రాయము.

భర్తృహరిమతమున విద్యయే పరమోత్కృష్టమైనధనము. చూ. పద్యములు 12, 16, 17, 93.

అవ. దుర్జనులయొక్కయు సుజనులయొక్కయు స్నేహముల రీతులు.

మ. తొలుత న్దీర్ఘములై పిదం గృశములై తోచుం బ్రభాతంపుఁజా
యలు పోలెన్ఖలుతోడిమైత్రు, లపరాహ్ణాచ్ఛాయలుంబోలె దొ
ల్దొలుతన్స్వల్పములై పిరిం ఘనములై తోఁచున్సుధీసఖ్యముల్
నలినాక్షీనవమన్మథా సురభిమల్లా నీతివాచస్పతీ. 45

నలినాక్షీ నవమన్మథా = స్త్రీలపాలిటి క్రొత్తమన్మథుఁడా, సురభి... స్పతీ, ఖలుతోడిమైత్రులు = దుర్జనులతోడి స్నేహములు, తొలుతన్ = ప్రారంభమున, దీర్ఘములు ఐ = గొప్పవై, పిదన్ = క్రమముగా, కృశములు ఐ = కృశించినవై, ప్రభాతంపుఁజాయలు పోలెన్ = ఉదయకాలమందలి నీడలవలె, తోఁచున్ = గోచరించును. సుధీసఖ్యముల్ = సజ్జనులతోడిస్నేహములు, తొల్దొలుతన్ = మొట్టమొదట, స్వల్పములై = చిన్నవై, పిదన్ = క్రమముగా, ఘనములు ఐ = గొప్పవై, అపరాహ్ణచ్ఛాయలుంబోలెన్ = సాయంకాలపు నీడలవలె, తోఁచున్ = వృద్ధి గోచరించును.

దర్జనులచెలిమి ప్రాతఃకాలపునీడవలె మొదట పెద్దదిగా నుండి క్రమక్రమముగ నశించును. సజ్జనులమైత్రి అపరాహ్ణమందలి నీడవలె మొదట చిన్నదిగానుండి క్రమముగా వృద్ధిపొందును. బుద్ధిమంతులు ఏదియుక్తమో ఆమైత్రి చేయుందురు.

ఈపద్యము లోకవృత్తము నతి నిపుణముగా వర్ణించుచున్నది. ఉపమాలంకారము.

అపరాహ్ణము: దినము మూఁడుభాగములైనప్పుడు కడపటిభాగము; అయిదుభాగములైనప్పుడు నాలవభాగము.

ప్రభాతము+చాయలు - కర్మధారయేతర మువర్ణమునకు 'ంపు'వర్ణాదేశము, తర్వాత 'ంపు' వర్ణమునకు పరుషము పరమైనందున నుగాగమమును తర్వాత ద్రుతకార్యమును జరిగినవి.

ప్రభాతము+చాయలు = ప్రభాతంపు+చాయలు = ప్రభాతంపు+ను+చాయలు = ప్రభాతంపు+ను+జాయలు = ప్రభాతంపుజాయలు. తోలుతఁ+తోలుతఁ = తోలుఁదోలుతఁ. రూ. తోల్దోల్తఁ.

ఆమ్రేడితసంధి (i) ఆమ్రేడితము పరమగునపుడు విభక్తిలోపము బహుళముగా నగును. (ii) ఇంచుక మొదలగు కొన్నిటి తుదివర్ణము వైకల్పికముగా లోపించును. (iii) పదాంతములై అసంయుక్తములైన నులురులయుత్వమునకు లోపముబహుళముగనగు.తోలుఁతఁ+తోలుతఁ=తోలు+తోలుతఁ (i)(ii)

=తోల్+తోలుతఁ (iii)

=తోల్దోలుతఁ.

ఖలుతోడిమైత్రులు-అలుక్సమాసము. సమాసమందు చేతఁ, తోడఁ, వలనఁ అనువిభక్తుల తుదిఅకారమునకు ఇకార మాదేశమగును. ఇట్లు విధించుటచేతనే విభక్తియొక్క నకారములోపించును.

అపరాహ్ణ+ఛాయలు=అపరాహ్ణచ్ఛాయలు. హ్రస్వాక్షరమునకు ఛకారము పరముగా నుండ చకార మంతాగమముగా వచ్చును.

అవ. పురుషునకు మనశ్శల్యములు ఏడు.

మ. స్ఫురణ న్మాసినసజ్జనుండు, ధనలుబ్ధుండైనరాజుం, నిర। క్ష
రుఁడౌరూపరి,రచ్చలోఖలుఁడు,నిష్కంజంబులౌతోయముల్
తరుణత్వం బుడివోవునింతి, వగ లల్పజ్యోతి యాచందురుం,
డరయ న్మానసశంకువు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 46

సురభి...స్పతీ. స్ఫురణఁ బాసిన = పసచెడిన, సజ్జనుండుఁ = సాధువును, ధనలుబ్ధుండు ఐన = ధనమం దత్యాసక్తుఁడైన, రాజుఁ = ప్రభువును, నిరక్షరుఁడు = అక్షరము లేనివాఁడు (చదువు లేనివాఁడు), ఔ =అగు, రూపరి= సౌందర్యవంతుఁడును, రచ్చలోఁ = రాజసదనములోని, ఖలుఁడుఁ =దుర్జనుఁడును (రాజునకు దుర్బోధనలు చేయువాఁడు), నిష్కంజంబులు = తామరలు లేనివి, అగు, తోయముల్ = జలములును (కొలఁకులును), తరుణత్వంబు = యౌవనము, ఉడివోవు = (ఉడిగి+పోవు) తొలఁగుచున్న, ఇంతి=వనితయు, పగలు = పగటియందు, అల్పజ్యోతి = మాసిన కాంతిగలవాఁడు, ఔ, చందురుండు = చంద్రుఁడును, ఆరయఁ = విచారింపఁగా, మానసశంకువుల్ = మనస్సునకు మేకులు (మిక్కిలి దుఃఖకరములు అనుట).

పసచెడిన సాధువును, కేవలము ధనాశాపరుఁడగు రాజును, చదువు లేని సుందరుఁడును, రాజునకు దుర్బోధనలు చేయుచుండు దుర్జనుఁడును, తామరలు లేని కొలఁకును, ప్రాయము తప్పుచున్న వనితయు, పగటియందు తేజోహీనుఁ డయినచంద్రుఁడును ఈయేడ్గురును శూలమువలె మనస్సునకు. దుఃఖము కలుగఁ జేయుచుందురు.

రూపరి - రూపు+అరి - మతుబర్థకము.

చంద్రుఁడు (ప్ర.) - చందురుఁడు (వి.)

పగలు = పగటియందు-కాలవాచకములకు మార్గవాచకములకు సప్తమ్యర్థమున ప్రథమ బహుళముగా నగు.

ఉడివోవు+ఇంతి=ఉడివోవునింతి-ఉదంత తద్ధర్మార్థకవిశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమ మగు.

అప్రస్తుతములగు చంద్రాదులను ప్రస్తుతమగు ఖలునకును దుఃఖ హేతువుచేత ఏకధర్మసంబంధము చెప్పుటచే దీపకాలంకారము.

ప్రస్తుత మగు ఖలునిగుణనిర్ణయమునకు సాధకము 'పస చెడిన సజ్జ

నుఁడు’ ఒకటియుండఁగా కళ్లపుగువ్వలన్యాయమున ఆకార్యమును సాధించు నవి అనేకములు కలుగుటచేత సముచ్చయాలంకారమును. చూ. 19 ప.

అవ. అత్యంతక్రోధశీలు రగు రాజులయనుగ్రహము నిలుకడలేనిది అని సదృష్టాంతముగఁ జెప్పుచున్నాఁడు,

మ. మొరకై యెప్డు బ్రచండకోపుఁడగుచుం బోనాడు భూభర్తకొ
క్కరుఁ డాత్మీయుఁడనంగలాఁడె? సముదగ్రజ్వాలమౌవహ్ని
దు । ర్భరమై వ్రేల్చెడిహోత నైనస్పృశియింప న్గాల్చుఁ గాదే
విశా । లరమావైభవవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 47

విశాలరమావైభవవాసవా=విస్తారమగుసంపదచే ఇంద్రునివంటివాఁడా (ఇంద్రునంతటి వైభవముకలవాఁడా), సురభి...స్పతీ, మొరకు = మూర్ఖుఁడు, ఐ, ఎప్డున్ = సదా, ప్రచండకోపుఁడు = తీక్ష్ణమైన కోపముగలవాఁడు, అగుచున్, పోనాడు=నిందించు, భూభర్తకున్ = రాజునకు, ఒక్కరుఁడు= ఒక్కఁడైనను, ఆత్మీయుఁడు=తనవాఁడు (తనప్రేమకు పాత్రుఁడైయుండునట్టి వాఁడు), అనన్ = అనిచెప్పుటకుఁ కలాఁడె=ఉన్నాఁడా? సముదగ్రజ్వాలము ఔ = తీక్ష్ణమగుజ్వాలలతో కూడియుండునట్టి దగు, వహ్ని=అగ్ని, దుర్భరము ఐ=భరింపవీలుకానట్లుగా (విశేషముగా), వ్రేల్చెడి=(నేయి పురోడాశము మొదలయినవానిని) వేల్చుచున్న, హోతన్ ఐనన్ = యజమానునైనప్పటికిని, స్పృశియింపన్ = (తన్ను) తాఁకగా, కాల్చున్ కాదే=కాల్చునుగదా! అగ్ని దృష్టాంతముచే నీలాటిరాజుల నాశ్రయింపరా దని భావము.

హోత-యజ్ఞముచేయించువారిలో నొకఁడు అని యర్థమైనను ఇట హోమముచేయువాఁడు అని గౌణార్థమున ప్రయోగము.

కాదే - అవ్యయము - ప్రసిద్ధిని దెలిపెడిని. కదా యనునర్థమున నను ప్రయుక్త మగును.

కలాఁడె - కల+వాఁడు+ఎ. క్రియాజన్యవిశేషణములకు విభక్తి ఏవ

తించునపుడు మహదర్థమందు 'వాఁడు' అను ప్రయుక్త మగును. 'కల' మీఁది వాఁడు, వారు శబ్దముల వకారము వైకల్పికముగా లోపించును.

కల+వాఁడు=కల+ఆఁడు = కలాఁడు. లేదా, కలఁడు మున్నగు రూపములమధ్య స్వరము దీర్ఘమగుటయుఁ గలదు అనియేని. ఇచట కలుగుధాతువునకు ఉండు అని యర్థము.

అగ్నిహోత్రుఁడు తనకు ఆజ్యము మొదలగువానిని సమృద్ధిగా నర్పించి తృప్తిపఱచు యజమానునిసైతము తన్నుతాఁకినమాత్రాన మొగమోటమిలేక కాల్చును. అట్లే అత్యంతకోపముగలరాజులకు స్థిరప్రేమకు పాత్రుఁడైనవాఁడొక్కఁడును ఉండఁడు. వారు ఎంతటిహితకారినైనను ఇంచుకతప్పిన చంపింతురు. కావున కోపనులగు రాజుల నాశ్రయింప రాదు.

ఉపమానోపమేయముల సాధర్మ్యమును బింబప్రతిబింబభావమునఁ దెల్పుటచే దృష్టాంతాలంకారము. చూ. 13 ప.

అవ. రాజసేవ మిక్కిలికష్టము.

మ. క్షమతోనుండ భయస్థుఁడండ్రు, కినియన్ గయ్యాళివాఁడండ్రు మా
న మిడ న్మూఁగ యటండ్రు; వాక్పటిమఁ జెందన్వాదరంచండ్రు, పా
ర్శ్వమునన్ నిల్వ మదాంధుఁడండ్రు, కడనిల్వన్ నేదకుండండ్రు, శ
క్యమె భూపాలకసేవ దా సురభిమల్లా నీతివాచస్పతీ. 48

సురభి...స్పతీ, క్షమతోన్ = ఓర్పుతో, ఉండన్ = ఉండిన, (పరిభవాదికముచే కలుగుక్రోధము నణఁచుకొని ఓర్చియుండినను), భయస్థుఁడు = పిఱికి, అండ్రు=అనిచెప్పుదురు. కినియన్=(అవమానాదులను ఓర్చుకొనలేక) కోపగించుకొన్న, గయ్యాళివాఁడు = ధిక్కరించి మాటాడువాఁడు, అండ్రు; మానము ఇడన్=పలుకమిని ఉంచిన (అనఁగా మాటలాడకుండిన[illegible] మూఁగవాఁడు, అటండ్రు, వాక్పటిమన్ = చక్కఁగా మాటలాడుటయందు నేర్పును, చెందన్=పొందఁగా, వాదర=(వాఁడి+దార)=తీక్ష్ణముగ మాటలాడు

వాఁడు (ప్రేలుఁడుగాఁడు అనియేని), అంచున్, అంద్రు; పార్శ్వమునన్ = ప్రక్కలో, నిల్వన్=నిలుచుండిన, మద+అంధుఁడు=గర్వముచే కన్నులుగానని వాఁడు (భయములేనివాఁడు), అంద్రు. కడన్=దూరముగా, నిల్వన్, మేద కుండు=అంబేవ (దిట్టతనములేనివాఁడు), అంద్రు భూపాలకసేవ తాన్ = అ రాజులసేవ యనునది, శక్యమె = అలవి యగునా?

రాజులకొలువుచేయుంట అసాధ్యము. ప్రభువులు సేవకుని తాము పరిభ వించినపు డతఁడోర్చియుండినచో పిఱికి, ఓర్పులేనియెడల గయ్యాళివాఁడు, ఏమియుఁ బలుకక యున్నమూఁగవాఁడు. చక్కఁగమాటాడు నేనివదరుఁబోతు, ప్రక్కననిలిచిన భయభక్తులులేనివాఁడు, దూరమున నెలకొనిన చేతకానివాఁడు అని పలువిధముల నిందింతురు. కనుక రాజులసేవ ఎట్టివారికిని అలవి కానిది.

అతిశయోక్త్యలంకారము.

అంద్రు-అనుధాతువునకు తి, దు, ట అను ప్రత్యయములు పరములగు నపుడు 'ను' స్థానమున సున్న యగు—అనుదురు-అందురు.

బిందువుమీఁది త, ద, లకు నిత్యవైకల్పికము లయి ట, డ - లగు. అందురు-అండురు.

రు-పరమగునపుడు సున్నమీఁది త, ద, డ-ల ఉత్వమునకు లోపము విభాష నగు. అండురు-అండ్రు.

వాదర+అంచున్=వాదరంచున్-అకారసంధి బహుళము.

అను+చున్ = చువర్ణము పరముకాఁగా 'ను' స్థానమున 'ం' అగు = అంచున్. తాన్-వాక్యపూరణము.

అవ. దుష్టరాజు ముందఱ నుండుటచేత సైతము చేటు కలుగుచు.

మ. సముఖానన్ జెడుగాఁడుఁగానియొరులన్ జాలింపఁ,దుచ్ఛృంఖల
 త్వమునన్ వర్తిలుఁదొంటిపాట్లుమదిలోఁదర్కింపఁడొక్కింతభా
 గ్యముచే నౌనదుమంత్రపుంబదవిచేగర్వించు, భూపాలుమ్రో
 ల మనం జూతురె పండితు ల్సరభిమల్లా నీతివాచస్పతీ. 49

సురభి...స్వతీ, సముఖానన్ = ఎదుట, చెడుగు ఆడున్ = క్రూరముగా మాటలాడును, కాని, ఒరులన్ = ఇతరులను, జాలింపఁడు = దయతోఁ జూడఁడు; ఉచ్ఛృంఖలత్వమునన్ = ఉత్ + శృంఖలత్వమునన్ = విధినిషేధముల కతీతుఁడై స్వచ్ఛందగతిని, వర్తించున్ = నడచుకొనును. తొంటిపాట్లు = (తాను మునుపుపడిన) కష్టములను, మదిలోన్ = మనస్సునందు, తర్కింపఁడు = విచారింపఁడు (అనఁగా బొత్తిగా మఱచిపోవును), ఒక్కింతభాగ్యముచేన్ = కొంచెపాటి యదృష్టవశమున, ఔ = కలిగిన, నడుమంత్రపుంబదవిచేన్ = మధ్యకాలమున పట్టిన ఉన్నతస్థితిచేత, గర్వించు = విఱ్ఱవీఁగెడు, భూపాలుప్రోలన్ = రాజునొద్ద, పండితులు, మనన్ చూతురె = జీవింప నిచ్ఛగింతురా?

ఎదుటికి వచ్చినవారిని లేశమయినను దయ చూపక అతికఠినముగా నిరసించుచు, అడ్డులేక స్వచ్ఛందముగా ప్రవర్తించుచు, తనతొంటినీచపుబ్రతుకును బొత్తుగామఱచి, అదృష్టవశమున నడుమంత్రమున కలిగిన యున్నతస్థితిచే పొగరెక్కి కనులు గానక యుండెడు రాజును పండితు లాశ్రయించి జీవింప నిచ్ఛగింపరు. నీచాశ్రయము త్యజనీయము గాని కర్తవ్యము గాదు.

చెడుగాడుట మున్నగుపదార్థముల విశేషణగతిచేత సుఖస్థిత్యభావ మను పదార్థహేతువు తోఁచును గనుక కావ్యలింగాలంకారము. చూ. 20, 31 ప.

సముఖము + నన్ = సముఖ + నన్ = సముఖానన్ - చూ. పొంకానన్ - 4 ప. 37 ప.

పాటు (ఏ. వ.)-పాటులు (బ. వ.); లు, ల పరమగునప్పుడు ట, డ, ర, ల-అను హల్లులమీఁది ఉకారము బహుళముగా లోపించును. 'తొల్లి'-ఔపవిభక్తికము కావున సమాసాదికార్యములలో 'ంటి' ఆదేశము, అంత్యవర్ణమునకు లోపము అగును. తొల్లి + ంటి = తొంటి.

నడుమంత్రపుంబదవి—మధ్యమపదవి.

నడుము + అంతరము = నడుమంతరము-మిశ్రసమాసము-కర్మధారయము. రూ. నడుమంత్రము.

సముమంత్రము+పదవి=సముమంత్రపు+పదవి = సముమంత్రపు+ను+పదవి=సముమంత్రపుంబదవి.

కర్మధారయమునందు మువర్ణకమునకు పు-ంపు-లు బహుళముగా నగును. పుంపులకు పరుషసరళములు పరము లగునపుడు నుగాగమము బహుళము, తర్వాత ద్రుతకార్యము. చూతురె-చూచుదురు - తద్ధర్మార్థకము, చు దు-లకు తువర్ణాదేశము.

అవ. ఈపద్ధతి ప్రారంభమునఁ జెప్పిన "కరుణాలేశము లేదకారణమె యుగ్రంబైన కోపం బిఁకన్" అన్నదానినే ప్రకటింపఁ దలఁచి "దుర్జనులు సజ్జనులకు నిష్కారణవిరోధులు" అనిచెప్పుచు నీపద్ధతిని ముగించుచున్నాఁడు.

మ. తృణవృత్తి జ్జలవృత్తి నాత్మసుఖవృత్తి న్వర్తిలంగా మృగీ
గణముం జేఁపల సాధుల న్మృగయులు న్గైవర్తులున్ దుర్జనుల్
క్షణమాత్రంబు సహింప కేమిపనికై కారింతు రీధాత్రిఁగీ
ర్త్యణుమాత్ర్యావరణోత్సుకా సురభిమల్లా నీతివాచస్పతీ. 50

కీర్త్యణుమాత్ర్యావరణోత్సుకా = కీర్తిలేశమునయినను ఆవరించుకొను నాసక్తికలవాఁడా, సురభి...స్పతీ, తృణవృత్తిన్=గడ్డిని జీవనముగాఁబొందుట చేతను, జలవృత్తిన్=నీటినే జీవనము (బ్రతుకుగా) పొందుటచేతను, ఆత్మసుఖవృత్తిన్=మనస్సంతుష్టిని జీవనముగాఁపొందుటచేతను, వర్తిలంగాన్=సంచరించుచుండఁగా, మృగీగణమున్ = లేళ్లసమూహమును, జేఁపలన్, సాధులన్=సాధువులను, మృగయులున్ = వేటకాండ్రును, కైవర్తులున్=జాలరులును, దుర్జనుల్=దుష్టులును, ఈధాత్రిన్=ఈభూమియందు, క్షణమాత్రంబున్ = క్షణకాలమైనను, సహింపక = ఓర్వలేక, ఏమిపనికై = ఏలాభమునకై, కారింతురు= బాధింతురు?

పరులను పీడింపకయే గడ్డితో జీవయాత్ర గడుపుకొను జింకలు మొదలయిన మెకములను బోయలును, నీళ్లచేత జీవించు చేఁపలను జాలరులును, దొర

కినదానితో తృప్తిపొంది కాలయాత్ర చేయుసజ్జనులకు దుష్టులును లోకమున అకారణశత్రువులుగాఁ గనఁబడుచున్నారు.

తృణవృత్తిచేత వర్తిలంగా మృగీగణమును మృగయులు కొరింతురు; ఈవిధమున యథాక్రమ మన్వయించుటచేత క్రమాలంకారము.

మృగము = మగజింక, మృగీ=ఆడుజింక.

సాధారణముగా జింకలు సాధుమృగములు.

క్షణము=గడియలో ఆఱవభాగము, అనఁగా పది విఘడియలు.

---

## సు జ న ప ద్ధ తి

అవ. దుర్జనపద్ధతిని నిరూపించి తద్వైలక్షణ్యమును దెలుపుటకై సజ్జనపద్ధతి నారంభించుచు, సజ్జనులయందలియాదరాతిశయముచే వారిని ప్రశంసించుచున్నాఁడు.

మ. దమసంపత్తి మహేశభక్తి నిజకాంతాసక్తి విద్యానుర
క్తిమహత్సంగమవాంఛ దేశికవరాంఘ్రిప్రీతి దుస్సంగమో
క్షమనిందామయబుద్ధి యన్యగుణహర్షం బేరియం దుండువా
రమరన్ భూమి కలంకృతు ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 51

సురభి...స్పతీ, దమసంపత్తి=మనోనిగ్రహసామర్థ్యసమృద్ధి, (క్లేశము నోర్చుకొనుశక్తి), మహేశభక్తి=శివునియందు పరమానురాగము, నిజకాంతాసక్తి=తనభార్యయందే ఆసక్తి, విద్యా అనురక్తి=విద్యయందుప్రీతి, మహాత్సంగమవాంఛ = సాధువులతోడి సాంగత్యమునకోరిక, దేశిక వర+అంఘ్రిప్రీతి =గురువులశ్రేష్ఠములగు పాదములయందు ప్రీతి (ఆచార్యునియందు అణఁకువ), దుస్సంగమోక్షము = దుర్జనులతోడి కూడికను వదలుట, అనిందామయబుద్ధి = లోకులనింద కూడ దనుబుద్ధి, అన్యగుణహర్షంబు = ఒరుల సుగుణములయందు సంతోషము, (అసూయలేని గుణములు), ఏరియందున్ ఉండున్ = ఎవరియందు

కలుగునో, వారు = అట్టిమహనీయులు, భూమి = భూమికి, అమరన్ = యుక్తముగా, అలంకృతుల్ = అలంకారముచేయువారు.

మనస్సును నిగ్రహించుట (లేదా, క్లేశము నోర్చుకొనుట), శివునియందు భక్తి, తనభార్యయందే ఆసక్తి, విద్యనేర్వనాసక్తి, సత్పురుషవాసమునందు వాంఛ, గురువులకడ నణఁకువ, దుస్సాంగత్యమును మానుట, జనాపవాదమునకు వెఱచుట, పరులగుణమునందుఁబ్రీతి, - అనునీనిర్మలగుణములు కలవారే భూమి కలంకారము లగుదురు.

దమము-ఇంద్రియనిగ్రహము, క్లేశమునోర్చుకొనము. పురుషునకు శమదమములును, పరాక్రమము దిట్టతనములును భూషణములు.

మహేశభక్తి - పరదేవతయందే భక్తిగాని క్షుద్రదేవతయందు గాదు.

నిజకాంతాసక్తి - పరభార్యాభిలాష నాశహేతువు గావున.

విద్యారక్తి - వేదాంతాది విద్యలు మోక్షసాధనములు బ్రహ్మజ్ఞానజనకములు గావున వానియం దాసక్తిగాని ద్యూతకేళ్యాదులం గాదు.

మహత్సంగమవాంఛ: మోక్షద్వారమునందు శాంతి, విచారము, సంతోషము, సజ్జనసాంగత్యము అనునలువురు ద్వారపాలురు గలరు. ముక్తికి మహత్సేవయే ద్వార మని భాగవతము, భర్తృహరియు 19-వ పద్యములో "తదీయసంగతి మెయి న్సిద్ధించు సర్వార్థముల్" అని చెప్పియున్నాఁడు.

దేశిక...ప్రీతి - దేవునియం దెట్టియుత్తమభక్తి కలదో యట్టిభక్తియే గురువునందును చూపిన అఖిలార్థములు ప్రకాశించును. నమ్రత, భక్తి, శ్రద్ధ చూపవలెను గాని గర్వోద్రిక్తత కాదు. దుస్సంగ మోక్షము - దుస్సహవాసము కోరరానిది. దుర్జనుని దూరముగ విసర్జింపవలయును. చూ. 42 ప. అన్యగుణ హర్షంబు - అన్యులయందు దోషపాదనము పాపహేతువు. చూ. 70. ప.

ఏరు - ఏవారు-లో 'వా' లోపింపఁగా నేర్పడినరూపము.

అవ. సజ్జనునకు స్వభావసిద్ధ మగు గుణములు.

శా. ఆపత్తి న్ధృతి సంపద న్క్షమ, శ్రుతి న్వ్యాసక్తి, సద్గోష్ఠి వా
చాపాండిత్యము, పోర విక్రమము, భాస్వత్కీర్తిపై వాంఛ
యుఁ । రూపింప న్మహనీయు లౌ జనుల కెందు న్లక్షణంబు
ల్సుమీ । యాపూర్ణ ప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 52

అపూర్ణప్రతిభానిధీ - మిక్కిలి నిండియున్న ప్రతిభకు నిధియైనవాఁడా, సురభి...స్పతీ, ఆపత్తిన్ = ఆపదయందు, ధృతి=స్థైర్యము, (చిత్తమున వికారము లేమి), సంపదన్ = సంపదయందు, క్షమ=ఓర్పు, (ఆగ్రహము కాదు), శ్రుతిన్ = వేదమునందు (వినుటయందుఁగాని), వ్యాసక్తి = మిక్కిలి ఆసక్తి (హేయబుద్ధికాదు), సద్గోష్ఠిన్=రాజవిద్వత్సభలయందు, వాచాపాండిత్యము= మాటనేర్పు (సరసవచనరచనాచాతుర్యము, మూఁగతనము కాదు), పోరన్= యుద్ధమునందు, విక్రమము = పరాక్రమము (పలాయనముకాదు), భాస్వత్కీర్తిపైన్ = మంచికీర్తియందు, వాంఛయుఁన్ = కోరికయును, (అనాదరము కాదు), (ఇవి యన్నియుం), రూపింపన్=ఆరయఁగా, మహనీయులు=మహాత్ములు (గొప్పమనస్సుగలవారు), ఔ = అగు, జనులకున్, ఎందున్ = ఎచ్చటను, లక్షణంబుల్ = స్వభావసిద్ధగుణములు; సుమీ.

ఆపదయందు స్థైర్యము, సంపద కలిగినప్పుడు ఓర్పు, వేదశాస్త్రాభ్యాసమునందు ఆసక్తి, సభలయందు మాటనేర్పు, యుద్ధమునందు పరాక్రమము, కీర్తియందు కోరిక,—ఈగుణము లన్నియుం మహాత్ములకు సహజగుణములు.

తనశతకములలో భర్తృహరి శ్రుతులఁగూర్చి చేసిన ప్రస్తావనలఁజూడఁగా నతనికి వేదములందుఁగల యభిమానము తెలియవచ్చును.

అవ. సజ్జనులకు విలక్షణములగు ప్రసిద్ధభూషణములు.

మ. సిరి లేకైన విభూషితుండె యయి భాసిల్లున్ బుధుం, డౌదలన్
గురుపాదానతి, కేల నీగి, చెవులందు న్విన్కి, వక్త్రంబునన్

స్థిరసత్యోక్తి,భుజంబుల న్విజయము, న్జిత్తంబున న్మనో
హారసౌజన్యము గల్గిన స్సురభిమల్లా నీతివాచస్పతీ. 53

సురభిమల్లా నీతివాచస్పతీ, బుధుఁడు = సజ్జనుఁడు, ఔదలన్ = తల యందు, గురుపాదానతి - గురుపాద = గురువుయొక్క అడుగులందు - ఆనతి= మ్రొక్కును, (బంగారుకిరీటాదులు గావు), కేలన్ = చేతియందు, ఈగి = త్యాగమును, (కంకణాదులు కావు), చెవులందున్, విన్కి=శాస్త్రములు వినుట యును (కుండలములుగావు), వక్త్రంబునన్ = నోటియందు, స్థిర సత్య ఉక్తి= నిలుకడయగు నిజమునే పలుకుటయు (తాంబూలచర్వణాదికముకాదు), భుజం బులన్ = బాహువులయందు, విజయమున్ = గెలుపును (భుజకీర్తులు కావు), చిత్తంబునన్ = మనస్సునందు, మనోహారసౌజన్యమున్ = ఒప్పయినమంచి భావమును [చిత్తము హృదయమునకు పర్యాయశబ్దము గనుకను, హృదయ శబ్దము మనస్సునకును ఱొమ్మునకునుగూడ నర్థముగావున చిత్తమునకు ఱొమ్ము నందు అని యాభరణపరముగా గ్రహింపవచ్చును.] (హారములు మొదలైనవి కావు), కల్గినన్ = కలిగినయెడల, సిరి లేక ఐనన్ = సంపద లేకపోయినను, విభూషితుండె ఆయి=అలంకరింపఁబడినవాఁడయి, భాసిల్లున్=ప్రకాశించును.

ఐశ్వర్యవంతులకు హారములు కంకణములు మొదలగు బంగారుసొమ్ము లుండును; ఐశ్వర్యములేని మహాత్ములకు అవిలేకున్నను స్వాభావికాభరణము లుండును. అవి యేవన: శిరమునకు గురుపాదనమస్కారము, చేతులకు సత్పాత్ర దానము, చెవులకు పెద్దలవలన శాస్త్రములవినికి, ముఖమునకు సత్యవచనము, భుజములకు గెలుపు, హృదయమునకు నిర్దోష మగు సౌజన్యము అనునవి. హారాద్యాభరణములచే ఐశ్వర్యము ప్రకటన మగునుగాని గొప్పతన మేర్పడదు. గొప్పతనము త్యాగాదులవలననే కలుగును. చూ. 62 ప.

సిరి - (వి.) శ్రీ (ప్ర.) ఔ+తల=ఔదల. రూ. అవుదల. విన్కి - వినికి - కొన్ని యాచ్ఛికపదముల నడుమ నుండెడి అ, ఇ, ఉ వర్ణములు కూడ బహుళముగా లోపించును.

భూషణాదులకు మూలక మగు ఐశ్వర్యము లేకున్నను తత్ఫలము సిద్ధించుచున్న దని వర్ణించుటచే విభావనాలంకారము.

అవ. మేలుకలుగుటకు దారి.

మ. కలయ ట్లీవి, పరాంగనాధననిరాకాంక్షత్వ, మాచార్యవ
ర్యులపై భక్తి, విధిప్రవర్తనము, కారుణ్యంబు, సత్యంబు,నా
ర్తుల రక్షించుట, సర్వశాస్త్రసమచిత్తుం డౌట, తృష్ణాప్రవా
హాలయంబుల్, సుఖమార్గము ల్సురభిమల్లా నీతివాచస్పతీ.64

సురభి......స్పతీ, కల+అట్లు = యథాశక్తిగా, ఈవి = ఇచ్చుట, (విత్తము విషయమున కుత్సితము పనికిరా దనుట), పరాం......త్వము- పరాంగనా = ఇతరుల స్త్రీలయందును, పరధన = ఇతరుల ధనమునందును, నిరాకాంక్షత్వము = కోరికలేమి, ("స్వప్నమందయినను పరస్త్రీస్మరణకూడదు; పరద్రవ్యమును మట్టిగడ్డతో సమానముగా నెంచవలెను" అనున్యాయముల ననుసరింపవలె ననుట), ఆచార్యవర్యులపై భక్తి = గురువుల యెడ అణకువ, ("గురువులయెడ నమ్రత" అని శ్రుతి), విధిప్రవర్తనము = శాస్త్రప్రకారము నడచుకొనుట, (కర్మానుష్ఠానముల విధి నతిక్రమింపకుండుట), కారుణ్యంబు = దయ (సర్వభూతములందును అనుకంప), సత్యంబు=యథార్థభాషణము (ధర్మోపదేశముచేయు సమయమందు, అనఁగా, "గోబ్రాహ్మణుల నిమిత్తము అసత్యము పలుకవచ్చును" అన్ననిషేధవచనమును మనస్సున నుంచుకొని అనిభావము), ఆర్తులన్ = ఆపదలో నున్నవారిని, రక్షించుట (ఆర్తత్రాణము ఉత్తమధర్మములలో నొకటి), సర్వశాస్త్రసమచిత్తుండు - వేదవేదాంతాది సకలశాస్త్రములయందును సమభావము (వైషమ్యముపూనక ఆయాసిద్ధాంతముల ననుసరించి నడచుకొనుట), కలవాఁడు, ఔట, తృష్ణాప్రవాహాలయంబుల్ = ధనాశయొక్క ప్రవాహమును అడ్డగించుట (నాశముచేయుట అని యేని అభీష్టదానముచే మనోరథమును పూరించుకొనవలయును). (ఈ పేర్కొన్న

గుణసముదాయములు), సుఖమార్గముల్ = అఖండైశ్వర్యము మొదలగుశ్రేయములను పొందుటకు మార్గములు.

యథాశక్తిగ దానముచేయుట, పరస్త్రీలను కాంక్షింపమి, పరధనమును హరింప నభిలాషగొనమి, గురువులయెడ నణఁకువ, సకలప్రాణులందును దయ, సమయమునుబట్టి యథార్థభాషణము, ఆపన్నుల రక్షించుట, ఎల్లశాస్త్రములందును సమభావముకలిగియుండుట,ఆశనుహద్దులోనుంచుట అనువానికి భంగము రానీయక ఆచరణము దుంచిన సకలశ్రేయములు ఫలించును. ఇట్టిగుణసంపత్తి సుజనులకే లభ్యములు గనుక వారు శ్లాఘనీయులు అని భావము.

"దమసంపత్తి మహేశభక్తి" ఇత్యాదిపద్యములలో చెప్పినగుణములు తెలుచుగా దైవికసంపదలు. ఇవి మంచికులమునఁ బుట్టినవారికిని చదువరులకు నే సంభవించును. చూ. భగవద్గీత (16-వ అధ్యా. 1-3 శ్లో.)

"అభయం సత్త్వసంశుద్ధ జ్ఞానయోగ వ్యవస్థితిః,
దానం దమ శ్చ యజ్ఞ శ్చ స్వాధ్యాయ స్తప ఆర్జవమ్.
అహింసా సత్య మక్రోధ స్త్యాగ శ్శాన్తి రపైశునం,
దయాభూతే ష్వలోలత్వం మార్దవం హ్రీ రచాపలమ్,
తేజః క్షమా ధృతి శ్శౌచ మద్రోహో నాతిమానితా.
భవన్తి సంపదం దైవీ మభిజాతస్య భారత."

అవ. సంపదాపదలయందు సుజనులమనోవృత్తి.

మ. నవనీలోత్పలకోమలంబు లగుచు న్భాసిల్లు డెందంబు లా
ర్యవితానంబునకు న్సిరు ల్గలుగుచో; నాపద్దశ న్పర్వతేం
ద్రవిశాలోపలనిష్ఠురంబు లగుచు న్భాసిల్లుఁ జు మ్మంఘ్రిప
ల్లవపీఠానతశాత్రవా సురభిమల్లా నీతివాచస్పతీ. 55

అంఘ్రిపల్లవపీఠానతశాత్రవాఁ=చిగుళ్లవంటి పాదపీఠములకడ నమస్కరించుచున్నశత్రువులు కలవాఁడా (శత్రువులను వశీకరించుకొన్నవాఁడా)

సురభి...స్పతీ, ఆర్యవితానంబునకున్ = మహాత్ములసమూహమునకు, డెందం బులు = మనస్సులు, సిరుల్ కలుగుచోన్ = సంపదలుకలుగునప్పుడు, నవనీల+ ఉత్పలకోమలంబులు=క్రొత్తగా వికసించిన నల్లగలువలవలె మెత్తనివి, అగుచున్ భాసిల్లున్ చుమ్ము=ప్రకాశించునుకదా? (కఠినములుకావు అనుట.) ఆపత్ దశన్ =దారిద్ర్యము మొదలగు అనర్థసంకటములు సంభవించినపుడు, పర్వతేంద్ర... బులు- పర్వతేంద్ర = పెద్దకొండయొక్క-విశాల = విరివియగు-ఉపల = ఱాతి బండలవలె-నిష్ఠురంబులు = కఠినమైనవి, అగుచున్, భాసిల్లున్ (అస్థైర్యమును ప్రకటింపవు).

మహాత్ములమనస్సులు సంపదలు సంభవించునేని కలువకంటె మృదువుగా నుండును. అనఁగా కరుణామయముగ నుండును. ఆపదలువచ్చునేని పెద్దకొండ యందలి ఱాతిబండవలె కఠినముగానుండును. అనఁగా సంపదలువచ్చిన గర్వించి కఠినులు కారనియు, ఆపదలువచ్చిన వెలవెలఁబోరనియు భావము. ఇందులకు విపరీతమైనచో వారిమాహాత్మ్యమునకు భంగము కలుగును. వివేకులకును అవివే కులకు సైత మిదియే ఆదరణీయమార్గము.

పర్వతేంద్ర మనిచెప్పుట బండఱాలసమూహముచేత అత్యంతము దుర్భేద్య మని సూచించుటకు.

ఉపమాలంకారము. 'వలె' అను ఉపమావాచకము "నీలోత్పలకోమ లము" అనుసమాసమందే అణఁగియున్నది.

తుల్యభావమునకు చూ. 52 ప. "అపత్తిన్ ధృతి..."

అవ. అన్యదుస్సాధ్య మగు సుజనులసదాచారప్రకారము రెండుపద్యము లలో వర్ణించుచున్నాఁడు.

మ. అసువు ల్పోవుతఱి న్నఖు న్నయితను న్యాచింపఁ, డాపద్దశన్
విసువం,డెత్తఁడెఁబాపమన్నఁజొరఁ, డెందేసల్పు న్యాయార్జనం
బు,సదాచార మొనర్చు,నీచునడుగ న్బోఁ,డెందు నేర్చెన్బుధుం
డసిధారావ్రత మింతయు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 56

సురభి...స్మృతీ, అసువుల్=ప్రాణములు, పోవుతఱిక్ = పోవుసమయ మందు (ఇఁక నితరసమయములఁ జెప్పవలయునా?) బుధుండు = సజ్జనుఁడు, సఖుక్ సయితముక్ = స్నేహితునికూడ, యాచింపఁడు (ఇఁక నితరునిమాట యేల?), ఆపద్దశక్=ఆపదలు కలిగినప్పుడు, విసువండు=నిర్వేదముపొందఁడు=హేయబుద్ధిపాలు గాఁడు. ఎత్తఱిక్=ఎట్టివేళయందును, పాపము అన్నక్=పాపకార్యమన్నదానిలో, చొరఁడు=ప్రవేశింపఁడు. న్యాయ+అర్జనంబు = న్యాయమైన వృత్తిచేతనే సంపాదనము. సల్పుక్=చేయును. (అన్యాయార్జనము శ్రేయముకాదు గనుక), సదాచారము=మంచినడవడికను, ఒనర్చుక్ = చేయును. (ఇదియే శ్లాఘ్యముగావున), నీచుక్, అడుగక్ పోఁడు=లేశమైనను ప్రార్థింపఁడు, బుధుండు, అసిధారావ్రతము = (కాలుతెగకుండ) కత్తివాదర మీఁదనడచుటవంటినడవడి ఇంతయుఁక్ = ఇదియంతయు, ఎందుక్ నేర్చెక్ = ఎక్కడనేర్చినాఁడోకదా !

ప్రాణాపాయసమయమందైనను ప్రాణప్రియుఁడగు స్నేహితునైనను యాచింపకుండుట, ఆపదలు వైకొన్నను నిర్వేదము పొందమి, పాపకార్యములకు దూరముఁగ నుండుట, న్యాయమార్గముననే ధనసంపాదనము, సదాచారము, దుష్టులను వేఁడకుండుట - అనునీనడవడి కత్తియంచుమీఁద నడచుటవలె కష్టమయినది. అట్లుండియు నిది మహాత్ములకు స్వభావసిద్ధముగ పట్టుపడినది గాని యుపదేశముచేత రాలేదు.

ఆసిధారావ్రతము—అసి=కత్తి, ధార=వాదర (వాఁడియైన యంచు).

1. కాలుతెగకుండ కత్తివాదరమీఁద నడచువ్రతము.

2. కత్తివాదరమీఁద శయనించుటవంటివ్రతము.

3. అసిధారవలె నిశితముగా నుండువ్రతము.

4. తరుణవయస్కులగు భార్యాభర్తలు తమమధ్య ఖడ్గము నుంచుకొని యేకశయ్యమీఁదనుండియు సలిపెడుబ్రహ్మచర్యవ్రతము—అని బహువిధముల

వివరింతురు. అట్లగుటవలన సత్పురుషులు ఎట్టి యసాధారణవిధుల ననుష్ఠింతురో విదిత మగును.

అవ. సుజనవర్తనమున ప్రకారాంతరము.

మ. ఒసఁగుర్ గుప్తముగాగృహాగతుఁ బ్రియంబొందించు మేల్చేసి మా
నస మేతుండఁగు, నన్యు మేలు సభలన్ వ్యాఖ్యానముల్సల్పుఁ, గ్రొ
వ్వొసలారందు సిరిం, బరుం దెగడఁబోఁ, డెచ్చోటనేర్చెన్ బుధుం
డసిధారావ్రత మింతయు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 57

సురభి...స్పతీ, బుధుండు=సత్పురుషుఁడు గుప్తముగా=రహస్యముగా, ఒసఁగుర్ = ఇచ్చును (ప్రకాశముగా కాదు), గృహ ఆగతుర్=తనయింటికి వచ్చినవానిని, ప్రియంబు = (ఎదురుకొనిలేచుట, అభివాదనము, మొదలయిన వ్యాపారవిధానములచేత) అతనికభీష్టమును, ఒందించుర్=పొందునట్లు చేయును. (పరాఙ్ముఖము చూపఁడు). మేల్ చేసి = ఉపకారముకావించి, మానస మేతుండు=మాటలాడక ఊరకుండువాఁడు, అగును. (ప్రకటన చేయఁడు). సభలర్= రాజసభ విద్వత్సభలయందు, అన్యు మేలు = ఇతరులు చేసినయుపకారమును వ్యాఖ్యానముల్ సల్పుర్=వివరించి ప్రఖ్యాపనము చేయును, (ఆవిషయమున తూష్ణీంభావము చూపఁడు; అట్లు చేసిన కృతఘ్నుఁ డగును), సిరిర్ = సంపద యందు, క్రొవ్వు = గర్వమును, ఎసలారండు = అతిశయింపనీయఁడు, పరుర్= అన్యుని, తెగడర్ పోఁడు = నిందించుటకు ఆరంభింపఁడు (తిరస్కరింపఁడు) ఆత్మప్రశంసను, పరనిందను వర్జింపవలయును అని పెద్దలవాక్యము. [బుధుండు -ఎచ్చోటర్ అసిధారావ్రతము ఇంతయుర్ నేర్చెను—56- వ పద్యము క్రింద చూ.]

రహస్యముగ దానముసేయుట, ఇంటికి వచ్చిన వారిని ఆదరించుట, ఒకరికి చేసిన మేలును చెప్పకుండుట, తన కితరులు చేసిన మేలును సభలయందు ప్రకటించుట, సంపదలు వచ్చినను గర్వింపకుండుట, ఇతరులను దూర్చిన

ప్రస్తావములలో వారిని నిందింపకుండుట అనునీయసిధారావ్రతము సత్పురుషు
లకు స్వతస్సిద్ధముగఁ గలుగునదేగాని యుపదేశమువలన లభ్యపడునది కాదు.

సముచ్చయాలంకారము. చూ. ప. 45.

అవ. అధములు, మధ్యములు, ఉత్తములు అగువారి వృత్తిభేదములు.

మ. అడఁగు న్దోయము తప్తలోహపతితంబై, పద్మినీపత్రమం
దిడినన్ముత్తెముభంగి నుండు,మణియై యేర్పాటగు న్శుక్తిలోఁ
బడి యందే,ఖలమధ్యమోత్తములను న్బాటించు మేలిట్లయై
యడరున్ జుమ్ము క్రమంబుతో సురభిమల్లా నీతివాచస్పతీ.

సురభి...స్పతీ, తోయము = నీరు, తప్తలోహపతితంబు = చక్కఁగాఁ
గాల్పఁబడిన యినుమునందు పడినట్టిది, ఐ, అడఁగున్ = నశించును (కంటి
కేమాత్రము కనఁబడక రూపఁడగును.) (అనీటిసే), పద్మినీపత్రమందున్ =
తామరాకుమీఁద, ఇడినన్ = ఉంపఁగా, ముత్తెము భంగిన్ = ముత్యమువలె,
ఉండున్, (ముత్తెపురూపు పొందునుగాని అచ్చము ముత్యముగా మాఱదు.)
(అనీరే), శుక్తిలోన్ = ముత్తెపుచిప్పలో, పడి, అందే = ఆచిప్పయందే, మణి.
ఐ = రత్నముగానే, ఏర్పాటు అగున్ = తయారగును (మాఱును.) ఖల
మధ్యను ఉత్తములకున్ = నీచులకును, మధ్యములకును, ఉత్తములకును,
పాటించు = ప్రాపించు, మేలు = ఉపకారము, ఇట్టి ఐ = ఈవిధమైన ఫలములు
కలిగినదై, క్రమంబుగా = వరుసగా, అడరున్ చుమ్ము = వ్యాపించునుసుమా.

ఎఱ్ఱగా కాలియున్న యినుముపైన పడిననీటిచుక్క, రూపులేక నశించి
పోవును. ఆ నీటిచుక్కయే తామరాకుమీఁద ఉండినచో ముత్యమువలె
తోఁచును. ఆ బిందువే ముత్తెపుఁజిప్పలోఁ బడునేని ముత్యమే అగును. ఇట్లే
అధములను, మధ్యములను, ఉత్తములను కొలుచువారికి ఆ యా యాశ్రయాను
సారము సర్వనాశము, కృతకసౌఖ్యము, వాస్తవసౌఖ్యమును కలుగును. కనుక
మహదాశ్రయమే కర్తవ్యముగాని నీచాశ్రయము కాదు.

"నీచాశ్రయోనకర్తవ్యః కర్తవ్యో మహదాశ్రయః" అని వచనము.

[లోకప్రసిద్ధమగు ఉత్తమమధ్యమాధమ లక్రమమును కవి యిట పాటించ లేదు.]

క్రమాలంకారము చూ. ప. 50. తృణవృత్తిజ్జలవృత్తి." కడపటి పాద విషయమును తక్కిన మూఁడుపాదములలోని విషయముచే సమర్థించుటచేత అర్థాంతరన్యాస మనియుం చెప్పవచ్చును.

సూర్యుఁడు స్వాతినక్షత్రరాశిం జేరినపుడు, అనఁగా స్వాతికార్తె యందు, ముత్తెపుఁజిప్పలు సముద్రోపరిభాగమునకు వచ్చి తమచిప్పలను తెఱచు కొని యుండు ననియుం, అప్పుడు వానియుదరమునఁ బడిన వర్షబిందువులు ముత్యము లగుననియుం ప్రాచీనాచార్యుఁడు వరాహమిహిరుఁడు తన బృహత్సం హితలో నుడివియున్నాఁడు.

మఃత్యముః రత్నములు జాతిసంబంధమైనవి, జాతిసంబంధము కానివి అని రెండువిధములు. మొత్తమున నవి తొమ్మిది: ముత్యము, పద్మరాగము, వజ్రము, ప్రవాళము (పగడము), మరకతము, నీలము, గోమేధికము, పుష్య రాగము, వైడూర్యము అనునవి.

లోహము = (1) బంగారులోనగునవి, (2) ఇనుము.

ముత్తెము, ముత్తియము, ముత్యము అనునవి రూపాంతరములు (వి) మౌక్తికము (ప్ర.)

పద్మినీపత్రము—పద్మినీ = తామరతీఁగయొక్క, పత్రము = ఆకు.

అవ. సత్పుత్త్రాదికము జన్మాంతర పుణ్యముచేతఁగాని లభింపదు.

మ. జనకు న్నొబ్బిచినవాఁడు పట్టి; పతికి న్సంప్రీతి గావించునం
గన యిల్లాలు;సుఖాసుఖంబులసమాకారక్రియుండాప్తుఁ;డెం
దును బుణ్యాత్ములకిట్టిమూఁడువహులున్లోకంబులోఁ జేకుఱుగ్
హానుమత్కేతనవిక్రమా సురభిమల్లా నీతివాచస్పతీ. 59

హనుమత్ కేతన విక్రమా = హనుమంతుని టెక్కెముగాఁగల్గిన అర్జునునివంటి పరాక్రమముగలవాఁడా సురభి...స్వతీ, జనకున్ = తండ్రిని, ప్రోచినవాఁడు = అన్నపానాదులిడి కాపాడువాఁడే, పట్టి = కొడుకు,పతికిన్ = భర్తకు, సంప్రీతి = మిక్కిలి ప్రియమును, కావించు+అంగన = చేయునట్టి ఆఁడుదే, ఇల్లాలు=భార్య, (యదృచ్ఛగా నుండునట్టిదిగాదు), సుఖ+అసుఖంబులన్ = సంపదలుకలిగినపుడును ఆపదలుకలిగినపుడును, కూడ, సమ+ఉపకార క్రియయందు = సమానమైన యుపకారముకలవాఁడే (ఒక్కరీతిగ ప్రేమించువాఁడే), ఆప్తుఁడు = మిత్రుఁడు, ఎందును = ఎప్పుడుగాని, పుణ్యాత్ములకున్ = పుణ్యముచేసినవారికి, ఇట్టి మూఁడువహంబులున్ = ఈమూఁడువిధములును, లోకంబులోన్ = లోకమునందు, చేకుఱున్ = లభించును (సిద్ధించును).

తండ్రిని అన్నపానాదు లిడి పోషించువాఁడే కుమారుఁడు; భర్తకు హితము కోరునదియే భార్య; ఆపదయందును సంపదయందును ఏకరీతిగా ప్రేమించువాఁడే స్నేహితుఁడు. ఇట్టిపుత్రుఁడు, భార్య, స్నేహితుఁడు అను ముగ్గురును పుణ్యముచేసినవారికేఁగాని లభింపరు.

పుత్రః - పుత్ అనునరకమునుండి తరింపఁజేయువాఁడు అనునర్థమును సార్థకముచేయువాఁడు; పుట్టుటమాత్రమే కాదు. "తండ్రి బ్రతికియున్నకాలమున ఆయనచెప్పినట్లుచేయుచు మంచినడవడికలవల్లను, గతించినవెనుక ప్రతి సంవత్సరమును మరణదినమున భూరిభోజనము పెట్టుటవల్లను, గయాక్షేత్రమున పిండదానము చేయుటవల్లను, కడుపునఁబుట్టినవానికి పుత్రత కలుగును." అని స్మృతివాక్యము.

ఇల్లాలు - ఇల్లు+ఆలు = గృహిణి.

పతిభక్తిపర, సాధ్వి, శాంత, సత్యభాషిణియు నగు ఇల్లాలు పతివ్రత యనఁబడును.

ఆప్తుఁడు - రహస్యమును పొందువాఁడు - స్నేహితుఁడు. ఆపదలు

వచ్చినను విడువక సకాలమున సాయపడువాఁడే సన్మిత్రుఁడు అని పెద్దలు పలుకుదురు.

కావించు+అంగన = కావించునంగన - ఉదంతతద్ధర్మార్థక విశేషణమున కచ్చు పరమగునపుడు నుగాగమ మగు.

వహి (ఏ. వ.) వహులు (బ. వ.) చేకుఱు - దూ. చేకూఱు.

అవ. లోకములో మిక్కిలి గౌరవము నొందు పెద్దలనడవడిని వర్ణించుచున్నాఁడు.

మ. పరకార్యంబు లొనర్పఁగాఁ దమపను ల్పాటిల్లు; నోర్వ్ఖలో
త్తరులౌ మూర్ఖుల పెంపఱున్ బరుచరిత్రల్ మెచ్చ నాత్మీయమౌ
చరితం బెన్నిక కెక్కు; నమ్రు లయినన్ సర్వోన్నతత్వస్థితుల్
జరగుం దజ్ఞుల కెట్లొకో సురభిమల్లా నీతివాచస్పతీ. 60

సురభి...స్పతీ, తజ్ఞులకున్ = మహాత్ములకు, పరకార్యంబులు = ఇతరుల కార్యములను, ఒనర్పఁగాన్ = చేయఁగా, తమపనుల్ = తమ కార్యములు (స్వప్రయోజనములు), పాటిల్లున్ = సిద్ధించును. (పరకార్యతత్పరతవల్లనే తమప్రయోజనమునుసాధించువారుకాని ఏకాంతత చేతకాదు.) ఓర్వన్ =ఓర్పుటచేత (ఆక్షేపణచేయుటచేత కాదు) ఖల ఉత్తరులు = దుర్జనులలో గొప్పవారు (అత్యంతనీచులు అనిభావము), ఔ=అగు, మూర్ఖుల పెంపు=మూర్ఖుల యొక్క మహత్త్వము, అఱున్ =క్షయించును. (ఓర్పే వారికి హృదయశల్యమగును), పరుచరిత్రల్ = ఇతరుల సౌజన్యాదిగుణములను, మెచ్చన్ = మెచ్చుటచేత, (ఆత్మప్రశంస చేసికొనకుండుటచే), ఆత్మీయము ఔ = తమ యొక్క చరితంబు = నడవడిక, ఎన్నికకున్ ఎక్కున్ = ప్రకటన మగును. నమ్రులు అయినన్ = వినయవంతులైనను, సర్వ+ఉన్నతత్వస్థితుల్ = సకలవిధ ఔన్నత్యములును, తజ్ఞులకున్ = మహాత్ములకు, ఎట్లొకో=ఏవిధమున, జరగున్ = ప్రవర్తిల్లుచున్నదోగదా!

సత్పురుషులు అణఁకువగలిగి వర్తింతురు, ఆయణఁకువవలననే లోకులు వారిని ఉన్నతదశలో నుంతురు. వారు పరులకార్యముల నెంత శ్రమకోర్చి యైనను చేయుదురు. ఆమంచితనమున కితరులు వారికార్యములను సాఫల్యము చేయుచుందురు. తమ్ము నిందించువారియెడ ఓర్పు చూపుదురు. అట్టోర్పు కొలఁదియు నాదుష్టుల పెంపు తగ్గుచుండును. ఇతరులసుగుణములనే శ్లాఘించుట చేత తమసుగుణములను తెల్లముచేయుదురు. ఇట్టి ఆశ్చర్యకర మగు నడవడికల మహాత్ము లెల్లవారికిని పూజ్యులే యగుదురు.

విరోధాభాసాలంకారము.

---

## పరోపకారపద్ధతి

అవ. సుజనులు పరోపకారపరులు గావున సుజనపద్ధతి యనంతర మూ పరోపకారపద్ధతిని వర్ణించుచున్నాఁడు.

శా. న్యాయంబొప్పఫలించియున్మహీజముల్నమ్రంబు లై కన్పడుం,
దోయంబు న్గొనియుం సువిదూరముగ నుండు న్మేఘు,మత్యున్నత
శ్రీయుక్తుండయియుం వినమ్రతఁబ్రవర్తిల్లుం బుధుండార్యులా
హా! యీదృక్చరితుల్గదా సురభిమల్లా నీతివాచస్పతీ. 61

అడఁకువ పరోపకారులకు సహజగుణము.

సురభి...స్పతీ, న్యాయంబు = స్వధర్మమునుండి చలింపకుండుట, ఒప్పన్ = ఒప్పుచుండఁగా, మహీజముల్ = పనస మామిడి మొదలగుచెట్టులు, ఫలించియున్ = పండ్లకాపుకలిగియు, నమ్రంబులు ఐ = వంగినవై, కన్పడున్ = కనుపడును, మేఘము = మబ్బు, తోయంబున్ = నీటిని, కొనియున్ = పట్టుకొని యుండియును, విదూరముగన్ = విశేషము దూరము కాకుండునట్లుగా (సర్వత్ర వర్షించునిమిత్తము కొంచె మెత్తున నంతరిక్షమున సంచరించుచు), ఉండున్, బుధుండు = సజ్జనుఁడు, అతి+ఉన్నత+శ్రీ+యుక్తుండు = మిక్కిలి యధికమైన

సంపదతోఁకూడినవాఁడు, అయియుంన్ = అయినప్పటికిని, వినమ్రతన్ =అడఁకువతో, ప్రవర్తిల్లున్ = నడచుకొనును (తీక్ష్ణస్వభావులు కారని భావము.) ఆర్యులు=మహాత్ములు, ఈదృక్ చరితుల్ కదా = ఇటువంటినడవడి (ఈనమ్రత మొదలగునవి) కలవారుకదా! అహో=ఆశ్చర్యము! (స్వభావసిద్ధము కాని తెచ్చుకోలు కాదు అని భావము.)

వృక్షములు పండ్ల కాపుచే బరువెక్కి క్రిందికి వంగును; మేఘములు నీళ్లబరువుచే క్రిందికి వ్రేలాడును; ఇట్లే సజ్జనులును సంపదలచే వినమ్రులగుదురు. అడఁకువ పరోపకారులకు స్వతస్సిద్ధగుణము. మహాత్ములు పరోపకారార్థము కలఁగు క్లేశమును క్లేశముగా భావింపరు.

"పరోపకారమునకై వృక్షములు ఫలించును; నదులు ప్రవహించును; పశ్వాదులు తిరుగులాడును: ఈశరీరము పరోపకారముకొఱకే" అని పెద్దల వచనము,

అర్థాంతరన్యాసాలంకారము; క్రియాదీపకము, మాలాప్రతివస్తూపమ, అప్రస్తుతప్రశంసయుం కలవు.

మహిజము=భూమినుండి మొలచినట్టిది - చెట్టు. రూ. మహీజము.

విదూరము = దూరము కానిది - సమీపము.

కదా-ప్రసిద్ధార్థక మగు నవ్యయము.

అహ. దయావంతులకు ముఖ్యము లగు నలంకారములు.

మ. చెవికిం గుండల మొప్పు గాదు, శ్రుతమే; చేదమ్మికి న్గంకణం
బువిభూషాఢ్యముగాదుదాన మె;మహిన్బుణ్యాత్ము నెమ్మేనికిన్
ప్రవిలేపంబులు గావు సొమ్ము, లుపకారప్రౌఢియే; నిక్కమౌ
లవితేంద్రాతిగవైభవా సురభిమల్లా నీతివాచస్పతీ. 62

లవితేంద్రాతిగవైభవా = అల్పముగఁజేయఁబడిన ఇంద్రునియొక్క ఐశ్వర్యముగలవాఁడా (ఇంద్రునివిభవమునకన్నను మించినవిభవము కల

వాఁడా), సురభి ..స్ఫుటీ, మహిక్ = ఈభూమియందు, చెవికిన్, కుండలము= బంగారు రత్నములుకూర్చిన కర్ణభూషణము, ఒప్పు=అందము, కాదు, శ్రుతమే= (శాస్త్రముల) వినికియే, చేదమ్మికిన్ = తామరవంటిచేతికి, కంకణంబు=బంగారు కడియము, విభూషార్థ్యము=శోభనయాభరణము, కాదు, దానమె=(సత్పాత్ర మునకు) ఇచ్చుటయే, పుణ్యాత్మునెమ్మేనికిన్=మహాత్మునిశరీరమునకు, సొమ్ములు= ఆభరణములు, ప్రవిలేపంబులు= కస్తూరి, పచ్చకర్పూరము మొదలగునవికలిపిన) చందనాదులు, కావు, ఉపకారప్రాప్తి నే=పరులకు హితమాచరించుటయందుఁ గలనేర్పే. నిక్కము ఔర్=ఇది నిశ్చయము.

పురుషులచెవులకు శాస్త్రశ్రవణ మలంకారము గాని కుండలములు గావు. హస్తములకు సత్పాత్రదానముగాని కంకణములు గావు. దేహమున కలంకారము పరోపకారముగాని చందనాదులపూఁత గాదు. మహాత్ములకు శాస్త్రములవిని కిడి మొదలగునవియే స్వాభావికాలంకారములు; అవి నాశ మొందనివి. [చూ. ప. 53]

చెవి మొదలగువానికి కుండలాదులుగాక శాస్త్రశ్రవణాదికమే అలం కారములుగా చెప్పుటచేత పరిసంఖ్యాలంకారము. (ప్రశ్న కలిగినను లేకున్నను, ఒకటిచెప్పుటవలన అట్టిదే మఱొకదానినిషేధము శాబ్దము గాని ఆర్థముగాని అగు నెడల పరిసంఖ్యాలంకారము.)

చేదమ్మి-తమ్మి (=తామర) వంటి చేయి-ఉపమానవాచకపదము కడపట నున్నదిగాన ఉపమానోత్తరపద కర్మధారయము; దీనికి ఉపమితసమాసమనియుఁ బేరు. నెమ్మేను=నెఱి+మేను - ప్రాఁతాదుల తొలియచ్చుమీఁది వర్ణములకెల్ల లోపము బహుళము; క్రొత్తశబ్దమున కాద్యక్షరశేషమునకు పరుషేతరములు పరములగునపుడు వానికి ద్విత్వమగు; అన్యములకుసహిత మిక్కార్యములు కొండొకచోఁ గానంబడియెడి.

అవ. మహాత్ములు స్వభావముచేతనే పరహిత [illegible]

ము. జలజాతంబులు వేఁడెనే? రవి వికాసమ్ము బొందించఁగాఁ జేయుఁగ

ల్వాలు ప్రార్థించెనే? చందమామయను వేలంబొప్ప రంజించు; లో
కులు లంచం బిడిరే? తటిజ్జలము మేఘుండిచ్చుఁ; బుణ్యాత్మకుల్
దలఁప న్విశ్వహితక్రము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 63

సురభి...స్పతీ, జలజాతంబులు=పద్మములు, వేఁడెనే=ప్రార్థించినవా? (లేదు అనిభావము), రవి=సూర్యుఁడు, (వానిని), వికాసంబు ఒందఁగాఁ = వికసించునట్లు (పుష్పించునట్లు)గా, చేయుఁ, కల్వలు = కలువలు = ఉత్పలములు, ప్రార్థించెనే, చందమామ, అనువేలంబు = ఎల్లప్పుడు, ఒప్పఁ=ఒప్పగునట్లుగా, రంజించుఁ=రంజిల్లఁజేయును, లోకులు=జనులు, లంచంబు+ఇడిరే= లంచ మిచ్చిరా? తటిన్ = సరియైనవేళలో, మేఘుఁడు, జలము = నీటిని, ఇచ్చుఁ=వర్షించును. తలఁపఁ=ఆలోచింపఁగా, పుణ్యాత్మకుల్=మహాత్ములు, విశ్వహితక్రముల్=లోకమునకు హితము చేయుటయే కార్యముగాఁ గలవారు.

తమ్ము వికసింపఁజేయుమని తామరలు సూర్యుని ప్రార్థింపవు; అతఁడే వానిని వికాస మొందించును. కలువలు చంద్రుని తమ్ము పుష్పింపఁజేయుమని వేఁడుకోవు; తానుగానే చంద్రుఁడు వానిని వికసింపఁజేయును. లోకులు వర్షింపు మని మేఘునకు లంచమీయరు; తానుగానే అతఁడు వర్షించును. ఇట్లే సత్పురుషులును ఇతరులప్రార్థన మక్కఱ లేకయే వారికి హితము చేయుచుందురు.

సామాన్యముచేత విశేషార్థమును సమర్థించుటచేత అర్థాంతరన్యాసాలంకారము.

అనువేలము - అవ్యయము.

చందమామ - (వి) చంద్రముఁడు - (ప్ర.)

మేఘుఁడు - అప్రాణివాచకములైన కొన్నితత్సమములు మహద్వివక్షయందు పుంలింగములు, మహత్తులు నగు. వివక్ష లేనిచో మేఘము.

విశ్వ=భూమి, లోకము. జలమునుండి పుట్టినది జలజాతము-తామర.

౬౪. ఉత్తమమధ్యమాధముల వర్తనములు.

మ. తమయర్థంబు త్యజించి కూర్తురు పరార్థంబుత్తముల్, మధ్యముల్
తమయర్థం బాఱకుండఁ గూర్తురు పరార్థంబుల్, పరార్థంబు స్వా
ర్థముకై త్రుంతురు మర్త్యరాక్షసులు, వ్యర్థం బల్గి యన్యార్థముల్
సమయం జేయ మనుష్యులే సురభిమల్లా నీతివాచస్పతీ. 64

సురభి . . స్పతీ, ఉత్తముల్=ఉత్తమజనులు, తమ+అర్థంబు=తమ ప్రయోజనములను, త్యజించి=వదలుకొని, పర+అర్థంబు=ఇతరులయొక్క ప్రయోజనములను, కూర్తురు=సాధింతురు. మధ్యముల్ = సాధారణులు, తమ+అర్థంబు=తమ ప్రయోజనములు, ఆఱక+ఉండక=భంగమొందకుండునట్లుగా, పర+అర్థంబుల్=ఇతరుల ప్రయోజనములను, కూర్తురు=కూరఁబెట్టుదురు. స్వార్థముకై=తమ ప్రయోజనముకొఱకు, పరార్థంబు=ఇతరులయర్థమును, మర్త్యరాక్షసులు=మనుష్యరూపులగు రాక్షసులు, త్రుంతురు=చెఱఁగొట్టుదురు. వ్యర్థంబు=నిష్ప్రయోజనముగా (తమకు కలుగు ప్రయోజనముకూడ లేకున్నను), అల్గి=అలిగి=కోపముకొని, అన్యార్థముల్=ఇతరుల ప్రయోజనములను, సమయన్ చేయన్=నాశమొనర్చుటకు, (ప్రయత్నించువారు), మనుష్యులే=మనుష్యులగుదురా? (కారు అని భావము.)

తమకార్యములను విడిచి పరులకార్యమును సాధించువారు సత్పురుషులు. తమకార్యములకు భంగమురానీయకయే యితరులకార్యములను నెఱవేర్చువారు మధ్యములు (సాధారణులు). తమకార్యములనిమిత్తము పరులకార్యములను చెడఁగొట్టువారు మనుష్యులలో అధములు, రాక్షసులవంటివారు. తమకేలాటిలాభమును లేకయే ఇతరులకార్యములను చెడఁగొట్టువారు మనుష్యమాత్రులు కానే కారు. అనఁగా, వారు పరమనీచులు.

కూర్తురు-కూర్చు ధాతువు. తద్ధర్మార్థక ప్రథమ పు. బహువ.

కూర్చుదురు. చువర్ణంబుతోడ దుగ్దకారంబు తకారంబగు. కూర్చుదురు - కూర్తురు = కూర్తురు.

అట్లే, త్రుంచుదురు = త్రుంతురు.

అర్థము నానా. శబ్దార్థము- ఇంద్రియార్థము, కారణము, ధనము, నివృత్తి, న్యాయము, ప్రయోజనము, వస్తువు.

అవ. సన్మిత్రలక్షణము.

మ. సమయంబైన నొసంగు, మేల్దెలుపు, దోషంబుల్ నివారించు, నో
చ్చెము దాచుం, బ్రకటీకరించు గుణముల్, చేడ్పడ్డవేళ
న్విడం|డు, మహామిత్రునిచంద మిట్టు లనుచు న్సూచించిరార్యో
త్తముల్| సమరక్ష్మాతలఫల్గునా సురభిమల్లా నీతివాచస్పతీ.65

సమరక్ష్మాతలఫల్గునా = యుద్ధభూమిని అర్జునునివంటివాఁడా, సురభి... స్పతీ. సమయంబు ఐనన్ = (అవశ్యమయిన) సమయమందు, ఒసంగున్ = ఇచ్చును; మేల్ = మేలుకలిగించుపనులను, తెలుపున్, దోషంబుల్ = పాప కార్యములను, నివారించున్ = (ధర్మోపదేశము చేయుటచేత) అడ్డగించును. ఒచ్చెము = అవమానమును (కొఱఁతను), దాఁచున్ = మఱుగుపఱుచును (ఎట్టి సందర్భములందును ప్రకటింపఁడు), గుణముల్ = సౌశీల్యాదిగుణములను, ప్రకటీకరించున్ = వెల్లడిచేయును (మఱుగుపఱుపఁడు), చేడ్పడ్డవేళన్ = ఇక్కట్టును పొందినసమయమందుకూడ, విడండు = విడువఁడు, మహామిత్రునిచందము = మంచిస్నేహితునిలక్షణము, ఇట్టులు = ఇట్టిది (మేలొసంగుట మొదలగు గుణములు కలిగియుండుట), అనుచున్, ఆర్యోత్తముల్ = పెద్దలు, సూచించిరి = తెలియఁజేసిరి.

సన్మిత్రుఁడు అవశ్యకమైనప్పుడు తనమిత్రుని కిచ్చును. మంచిపనులను జేయుటకు ప్రోత్సహించును. పాపకార్యములను చేయనీయఁడు. స్నేహితుని యందలి లోపములను దాఁచును; సుగుణములను ప్రకటించును. ఇక్కట్టుకలిగి నప్పుడుపరిత్యజింపఁడు. మహామిత్రుని ధర్మ మిట్టి దని పెద్దలు చెప్పు చున్నారు.

చేద్పడ్డన్ = చేద్పడు+ఇనన్, - ఇనన్, ఇన పరమగునపుడు పడ్వా దుల తుదివర్ణమునకు అకారముతోఁగూడిన ద్విత్వము వైకల్పికముగ నగును. అగుచో 'ఇన' లోపించును. పడు. ఇడు, చెడు, తగు, అను, కను, కొను, తిను, మను, చను అనునవి పడ్వాదులు.

విడందు - విడు ధా. వ్యతిరేకార్థక ప్రథమ పు. ఏ.

అవ. నీరక్షీరదృష్టాంతముచే సన్మైత్రివర్ణనము.

మ. మును తన్గూడిననీళ్లకున్ నిజగుణంబు ల్పాలిడున్, బాలుగ్రాఁ
గునెడ న్వాని నటించి యజ్జలము గ్రాగున్ దానె, తన్మిత్రనా
శనమున్గన్గొని వహ్నిఁగూలఁజనుఁబా,ల్శాంతంబొనర్చున్‌జలం
బనయం బిట్టివి సఖ్యము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. 66

సురభి...స్పతీ. మును=పూర్వము, తన్=తన్ను, కూడిన=కలిసియున్న (తనతో చెలిమిచేసిన), నీళ్లకున్, నిజగుణంబుల్ = మాధుర్యము, ధావళ్యము మున్నగు తనగుణములను, పాలు, ఇడున్=ఇచ్చును, పాలు, క్రాఁగు+ఎడన్= కాఁగునట్టిసమయమందు (దుఃఖపడువేళ), వానిన్ = ఆపాలను, నటించి = తానుగా భావించుకొని, (తానే అనియెంచి) ఆజలము, తానే, క్రాఁగున్.(ఆవిరిగా మారును; అగ్నిప్రవేశ మొనర్చును), తత్+మిత్ర+నాశనమున్ = ఆ స్నేహితునినాశనమును, పాల్=పాలు, కన్గొని=చూచి, వహ్నిన్ =నిప్పులో, కూలన్ = పడుటకు, చనున్=పోవును (ఆరంభించును). (నీళ్లు ఇుష్కింపఁగా పాలుపొంగును), (ఆపొంగును), జలంబు=నీరు,శాంతంబు+ఒనర్చున్=శమింప జేయును. (కొంచెము చల్లనినీరు చల్లఁగా పొంగుతగ్గును అని భావము. దుఃఖము తీఱి ఆత్మహత్యచేసికొన కించిన ప్రయత్నమును మానుకొనును.) అనయంబు= ఎల్లప్పటికిని, సఖ్యముల్=చెలిమి లక్షణములు, ఇట్టివి.

పాలు తనతోఁ గలసి స్నేహముచేసికొన్ననీటికి తీయఁదనము తెల్లఁ దనము మొదలైన తమగుణములనన్నిటిని తక్షణమే ఇచ్చినవి. పిదప ఆపాలను

కాచుచో ఆపా లగ్నిలో సంతాపముచెందఁగాఁ జూచి సహింప లేక నీరు ఆపాలతో సమానముగా తన్నుఁగూడ తపింపఁజేసికొని ఆవిరియై పోయెను. తమకు మిత్రమగు జలముమీఁది ప్రేమచే దానియాపదను జూడఁజాలక పాలును పొంగి అగ్నిప్రవేశముచేయ సమకట్టినవి. ఇంతలో జలము కలియుటచేత దుఃఖముతీఱి (ఆపొంగు అణఁగి) శాంతించి, ఆత్మహత్యచేసికొను ప్రయత్నమును మానినవి. సన్మిత్రులును ఇట్లే ఒకరియాపదల నొకరు ఓర్వఁజాలరు. ఇది యుక్తమేగదా!

ఇట స్వాభావసిద్ధమగు క్షీరనీరవ్యవహారమునకు పరస్పరసంతాపప్రదర్శనము హేతువు కావించుటచేత క్రియాస్వరూప ఉత్ప్రేక్ష. అదియు అర్థాంతరన్యాసముతో సంకరము.

వంటయింటిలో జరుగు వ్యవహారమునుండి యీపద్యమున నద్భుతముగా నీతి యుపదేశింపఁబడినది. పాలుపొంగుట, నీరుచల్లిపొంగణఁచుట అనునవి నిత్యానుభవములే.

పాలు - నిత్యబహువచనము.

ఇడుక్. క్రాఁగుక్, చనుక్, తద్ధర్మార్థక క్రియలు.

తచ్ఛీల, సంభావనా, సంప్రశ్న, సాతత్య, వర్తమాన, భావి, ఆశీరాదులందు తద్ధర్మార్థక మగు. ఆదిశబ్దముచే భూతార్థమందు విరళ మని యెఱుఁగ వలయును. ఇవి మొ॥ సాతత్యముం దెల్పును.

అవ. సత్పురుషు లెంతెంతవారికో ఆశ్రయములుగా నుందు రని సత్పురుషులమాహాత్మ్యమును వర్ణించుచున్నాఁడు.

మ. ఒకచో వెన్నుఁడుపవ్వళించె నొకచో నున్నారు దైత్యేంద్రులొం
డొకచో శైలచయంబు నిల్చె నొకచో నుగ్రానలంబుల్ బలా
హకము ల్వర్తిలె, నెంతభారసహుఁడో హా ధన్యుఁ డౌ సింధుపా
లకుఁ డైశ్వర్యపురందరా సురభిమల్లా నీతివాచస్పతీ. 67

ఐశ్వర్యపురందరా = సంపదలయందు ఇంద్రుఁడా, సురభి...స్ఫుటీ, (సముద్రమందు), ఒకచోట్ = ఒక ప్రదేశమున, వెన్నుఁడు = (అఖిలలోకములను కుక్షిని ధరించిన) విష్ణుమూర్తి, పవ్వళించెన్ =(యోగనిద్రకై) పరుండెను. ఒకచోట్ = ఇంకొకచోట, దైత్యేంద్రులు = (హిరణ్యాక్ష కాలకేయాదులు) అసురరాక్షసశ్రేష్ఠులు. ఉన్నారు. ఒండు ఒకచోట్ = మఱియు వింకొకచోట, శైలచయంబు=(రక్షణముకుగోరినట్టిమైనాకాది)కొండలసమూహము. నిల్చెన్ =నిలఁబడియున్నవి. ఒకచోట్ = ఇంకొకస్థలమున, ఉగ్రానలంబున్ = భయంకరమగు ప్రళయాగ్నియు (బడబానలము ను), బలాహకముల్ = (పుష్కలావర్తక, సంవర్తకాది నామములతో నొప్పు ప్రళయకాల) మేఘములు,వర్తిలెన్ =వర్తిల్లెను. భారసహుఁడు = భారమునుసహించువాఁడు, అగు, సింధుపాలకుఁడు = సముద్రుఁడు, ఎంత ధన్యుఁడు ఔర్ = ఎంతోపుణ్యవంతుఁ డగును. ఆహా = ఆశ్చర్యము!

సముద్రము తనవిశాలతచేతను గాంభీర్యముచేతను, అనేకవిధముల ఆశ్చర్యము పుట్టించుచున్నది. ఎట్లనఁగా: సముద్రమున నొకవంక సమస్తలోకములను ధరించిన మహావిష్ణువు పవ్వళించియున్నాఁడు; మఱియొక్కవంక ఆయన శత్రువు లగురాక్షసులు ఆయనవలనిభయము తెలియక ఆయనకు దూరముగా కాఁపుర మున్నారు. ఇంకొకవంక ఇంద్రునకు భయపడి పాఱివచ్చిన పర్వతములు దాఁగియుండఁగా వానిబరువునంతయు నాసముద్రము సహించియున్నది. మఱియు నొకవంక ప్రళయకాలమేఘములును బడబానలమును చేరి నీటి నెంతగా పీల్చివేయుచున్నను వర్ధిల్లుచునే యున్నది. సముద్రము యొక్క యీవివిధవ్యాపార మెంతో యాశ్చర్యకరముగా నున్నది. అట్లే మహాత్ములు ఎంతెంతవారికో అనేకులకు ఆశ్రయణీయులుగా నుందురు.

వెన్నుఁడు. (వి) విష్ణుఁడు (ప్ర.)

సింధుపాలకుఁడు = నదులను పాలించువాఁడు - సముద్రుఁడు.

లక్షయోజనములపరిమాణము గలదిగా పరిచ్ఛిన్నమందిన సముద్రము అపరిచ్ఛిన్నులగు వెన్నుఁడు మొదలగువారికి ఆధార మయినట్లు వర్ణించుటచేత అధిక ప్రభేదాలంకారము.

ఆధారాధేయములకు అనురూప్యాభావము అధికము అనిలక్షణము.

ఇందు అప్రస్తుతవస్తువుకు స్ఫుటముగా నుడువకున్నను దీని నప్రస్తుత ప్రశంసాలంకారమున నొకభేదముగాఁ గొనవచ్చును.

విష్ణువు - జలశాయి యగుట ప్రసిద్ధము.

దైత్యేంద్రులు - (1) హిరణ్యాక్షుఁడు విష్ణుమూర్తిపై పగఁగొని ఆయన జలమధ్యమున దాఁగియున్నాఁడని విని యటఁ బోయియుండఁగా వరాహరూపమున విష్ణుమూర్తి యాతని నట వధించెను. అనుభాగవతకథ నిట ననుసంధించుకొనునది.

(2) కాలకేయులు మునులను దేవతలను బాధించుచుండిరి. వారు పగలెల్ల దేవతలకందకుండ సముద్రగర్భమున దాఁగియుండువారు. వారిబాధను తొలగింపు మని దేవత లగస్త్యమహర్షిని ప్రార్థింప నతఁడు సముద్రజలము పుడిసిటఁబట్టి పానము గావించెను. అంతట కాలకేయులు బయటపడిరి. అంత, దేవతలు వారిని సంహరించిరి. అని మహాభారతము.

శైలచయంబు - ఇంద్రునివజ్రాయుధమునకు వెఱచి సముద్రమున దాఁగినవాఁ డొక్క మైనాకుఁడే యని హరివంశము. కాని కవులును పౌరాణికులును మఱికొన్ని పర్వతములు సైతము సముద్రు నాశ్రయించినట్లుగా తన్మాహాత్మ్యము వర్ణించుటకై చెప్పుదురు.

బడబానలము: కార్తవీర్యునికుమారులు భృగుసంతతిని నిర్మూలముగావింప నెంచినవారై తల్లిగర్భమున నుండు పిండములను సైతము కలచివేయుచుండిరి. ఇట్లుండఁగా ఆస్త్రీలలో నొకతె పిండమును రక్షించుకొన నెంచి దానిని తన యూరువున (తొడయందు) గుప్తపఱిచినది. కనుక నాశిశువు జనించినపుడు

దానికి ఔర్వుఁడను నామము కలిగెను. అతనిని వీక్షించినంతనే కార్తవీర్య కుమారుల కండ్లుపోయినవి. అతనికోపాగ్ని లోకమునే దహింప నుండఁగా పితృదేవతల ప్రార్థనముచే నతఁ డాయగ్నిని సముద్రమున పడవైవ నది అశ్వ (బడబా) ముఖమున సముద్రమునడుగున నిలిచెను. కనుక దానికి బడబాగ్ని యని పేరు. అని మత్స్యపురాణము.

బలాహకము - పుష్కలావర్తకాది మేఘములు, ప్రళయకాలమున నేకధారగా వర్షించి లోకముల ముంచునవి.

అవ. పరహితాచరణమున మేరనందినవారిలో నిరువురే జన్మసాఫల్యము కావించుకొన్నవారు.

మ. మహి సర్వంబు ధరించుకూర్మపతిజన్మం బొప్పగు న్క్రిందటన్,
గ్రహచక్రంబుభ్రమింపఁజేయుధ్రువుజన్మంబొప్పగున్ పైనిజం,
బహహా! యన్యులు వ్యర్థపక్షకు లజాండౌదుంబరాంతస్థలా-
న్వహజాతాంతరితక్రిము ల్సురభిమల్లా నీతివాచస్పతీ. (8

సురభి...స్పతీ, క్రిందటన్ = అడుగున, మహిసర్వంబున్ = భూలోకమంతటిని, ధరించు = మోయు, కూర్మపతి జన్మంబు = (అవతారము లన్నిటిలో) ఆదికూర్మముయొక్క అవతార మొకటే, ఒప్పు అగున్ = సార్థకమైనది అగును. (నిరంతరమును క్రిందనే యుండి భూభారమును వీఁపున మోచుచున్నాఁడు అనిభావము.) పైన్ = మీఁద, గ్రహచక్రంబున్ = గ్రహములు నక్షత్రములు మొదలగు జ్యోతుల సమూహమును (శింశుమార మను పేరుగల గ్రహనక్షత్రమండల మనియేని), భ్రమింపన్ చేయు= సుడియునట్లు చేయు, ధ్రువు జన్మంబు = ఉత్తానపాదుని కుమారుఁడైన ధ్రువునియొక్క జన్మము, ఒప్పు అగున్ = సార్థకమగును. నిజము = నిక్కము. అహహా = మిక్కిలి ఆశ్చర్యము. అన్యులు = కడమవారు, వ్యర్థపక్షకులు = నిష్ప్రయోజనమైన పక్షముగలవారు.(నిష్ప్రయోజకులలోఁ జేరినవారు),అజాం...క్రిముల్-

ఔదుంబర = మేడిపండువంటి, అజాండ = బ్రహ్మాండముయొక్క, అంత స్థల = లోపల, అన్వహ = ప్రతిదినమును, జాత = పుట్టి, అంతరిత = చచ్చుచున్న, క్రిముల్ = (దోమలు మొదలగు) పురుగులను బోలినవారు.

విస్తారమగు భూభారమును భరించిన ఆదికూర్మముయొక్క జన్మమును- తనచుట్టును అమర్పఁబడియున్న జ్యోతిశ్చక్రమును త్రిప్పుటకు ప్రధానుఁడగు ధ్రువునియొక్క జన్మమును - ఈరెండే లెక్కింపఁదగినవి. కనుకనే ఆదికూర్మము బ్రహ్మాండములో దిగువకడను, ధ్రువుఁడు పైకడను ఉన్నారు. కడమవారు పర హితముచేయనేరక వ్యర్థజన్ములయి బ్రహ్మాండమునకు పైకిఁగాని క్రిందికిఁగాని పోనేరక దానికడుపులోనే మేడిపండుపొట్టలోని పురుగులవలె పుట్టుచు గిట్టుచు నున్నారు. అనఁగా వారిజన్మములు నిష్ఫలము లనిభావము.

ధ్రువుఁడు భగవదనుగ్రహవశమున సకలలోకోన్నత మగు మేరుశిఖర శిఖామణియై తారాగ్రహసప్తర్షిమండలములు లోనగు జ్యోతిశ్చక్ర మంత టిని తనయధీనమున నుంచుకొని భ్రమింపఁజేయుచున్నాఁ డని విష్ణుపురాణము.

రూపకాలంకారము.

భూమిని ఆదిశేషుఁడును, ఆయనను శ్రీమహావిష్ణువు నవతారమైన ఆది కూర్మమును భరింతు రని పురాణప్రసిద్ధి.

క్రిందు- విశేష్యము - ఔపవిభక్తికము - క్రిందు మొదలగువానికి టివర్ణ మాగమ మగును. అగుచోఁ పూర్వమందున్న ఉకారము ప్రాయికముగా అకారమగును— క్రిందటి.

పై-విశేష్యము: మీఁదు. రూ. పము. దీనిని విశేషణముగా, అవ్యయ ముగాఁ గూడ వాడుట కలదు.

అవ. సత్పురుషుల నడవడి వర్ణించుచు సదాచారమును బోధించు చున్నాఁడు.

మ. అమదుండై, కలుషంబులేక, దయ సత్యం బోర్పు సత్కీర్తిగ

ల్గి,మహాత్సేవ యొనర్చుచు,న్స్వగుణముల్కీర్తింప,కాశం ద్యజిం
చి, మహి న్వైరుల కైన మేలె యిడుచు,న్శిష్టప్రియుండై సుశీ
లమునన్ వర్తిలు జ్ఞాని శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 69

జ్ఞాని = జ్ఞానముగలవాఁడు (సజ్జనుఁడు), అమదుండు = గర్వములేని వాఁడు, ఏ = అయి, కలుషంబు = పాపము, లేక, దయ = కనికరము. సత్యము = నిజముపలుకుట, ఓర్పు = క్షమ, సత్కీర్తి = మంచికీర్తి, కల్గి = కలిగి, మహాత్సేవ = పండితసమూహమునకు శుశ్రూషను, ఒనర్చుచున్ = చేయుచు, స్వగుణముల్ = తనగుణములను, కీర్తింపక = పొగడుకొనక (ఆత్మస్తుతిచేసికొనక), ఆశన్ = ఆశను, త్యజించి = వదలి, మహిన్ = భూమియందు, వైరులకున్ ఐనన్ = విరోధులకైనప్పటికిని, మేలె = హితమునే, ఇడుచున్ = చేయుచు, శిష్టప్రియుండు = సదాచారసంపన్నులకు ప్రియమైనవాఁడు, ఐ=అయి, సుశీలమునన్ = మంచిశీలమునందు, వర్తిలున్ = నడచుకొనును.

సత్పురుషుఁడు గర్వములేక, పాపకార్యములు చేయక, దయ, సత్యము, ఓర్పు, సత్కీర్తి ప్రకటించుచు, పెద్దలను సేవించుచు, ఆత్మస్తుతి బొత్తిగామాని, ఆసను త్రుంచి, పగవారికైనను ఉపకారమొనర్చుచు,శిష్టులకుప్రియుండై,సుశీలమగుమార్గమునే అనుసరించుచుండును. ఈలక్షణములే యెల్లరును కోరఁదగినవి.

మదము - విద్యవలనఁ గలుగుగర్వము. ఇది విజ్ఞానమువలన తొలఁగును. లేనిచో వివేకశూన్యతచే అకార్యములు చేయుఁటయు అనర్థమనుభవించుటయు సిద్ధించును.

కలుషము - పాపకర్మాచరణము - ధర్మంచరేత్యాది వచనమును స్మరించి సత్కర్మాచరణ మొనర్పవలయును. లేకున్న నాశము సంభవించును.

దయ - పరులదుఃఖమును తొలఁగింపవలె నన్నవాంఛ. "దుఃఖితులయందు దయచూపుము" అని శాస్త్రవచనము. లేకున్న చిత్తశుద్ధి కలుగదు.

సత్యము-"సత్యంవద" (సత్యము పలుకుము) అని శ్రుతి. అనృతమునకు మించిన పాపము లేదు.

ఓర్పు-పరిభవాదులు కలిగినపు డేర్పడుకోపము నణఁచుకొనుశక్తి. ఓర్పు లేనిచో క్రోధమువలన కార్యహాని యగును.

సత్కీర్తి - జన్మసాఫల్యార్థము కీర్తిని నిర్వహించుకొనవలయును. కీర్తి లేనిజన్మమువలన నేమిప్రయోజన మని వచనము. లేకున్న జీవన్మృతుఁ డగును.

మహాత్మసేవ-మహాత్ములు తమయుపదేశముచేత నితరులను కృతార్థులు చేయఁగల్గుదురు.

"యస్తు పర్యటతే దేశాన్ యస్తుసేవేతపండితాన్
తస్య విస్తారితా బుద్ధి స్తైలబిందురివామ్భసి."

అనువచనము ననుసరించి మహాత్ములశుశ్రూషచే బుద్ధివైశద్యము కలుగును.

స్వగుణమున్గీర్తింపక-ఆత్మస్తుతియు పరనిందయు స్వశ్రేయమును నాశ మొనర్చు నని పెద్దలవచనము.

ఆశ - అలభ్యమగు పరధనమం దభిలాష. దీనిని వైరాగ్యముచే త్రుంప కున్నచో చిలవలుపలవలుగా పెరిఁగి క్లేశము పాలు కావించును.

వైరులకైనన్ - శత్రుమిత్రులందు సమభావ ముంపవలయు నని భగవ ద్వచనము. లేకున్న బుద్ధి దోషములు వెదకుచు పడిపోవును.

శిష్టప్రియుండు-గుర్వాచార్యాదులమార్గ మనుసరించి వారికి ప్రియము కావించువాఁడు. అందువలన దుర్నీతిమూలమునఁ గల్గెడు నపవాదము తొలఁగును.

ఇందు నుడివిన మదరాహిత్యాదికములెల్ల చిత్తశుద్ధి నిమిత్తకములు. కావున సజ్జనులు వానినే చేపట్టుదురు. సౌజన్యప్రియుఁడు యశఃకామియు నగువాఁ డామహాత్ముల ననుకరింపఁవలయు నని భావము.

అవ. సత్పురుషులు అరుదుగా నుందురు.

మ. ఒరులందున్గుణలేశమున్న నది యోహో యంచుఁ గొండంతఁ జే
సి రహిం జెందు, మహోపకారముల రక్షించు జగం బెల్ల, న
త్యురుపుణ్యామృతపూర్ణ వాఙ్మనసకాయుండుండునొక్కొక్కఁడె
ల్లరలోఁ బుణ్యశరీరి దా సురభిమల్లా నీతివాచస్పతీ. 70

సురభి...స్పతీ,అత్యురుపుణ్యామృత పూర్ణవాఙ్మనసకాయుండు-అతి+ఉరు+పుణ్య = మిక్కిలియధికమయిన పుణ్య మనెడి - అమృత = అమృతముతో - పూర్ణ = నిండిన, వాక్+మనస+కాయుండు = మాటయు, తలంపును, చేష్టయు కలవాఁడు, (అగు), పుణ్యశరీరి=పుణ్యాత్ముఁడగుసత్పురుషుఁడు, ఒరులందున్ = ఇతరులయందు, గుణలేశము = ఎంతో మిక్కిలికొంచెము గుణము, ఉన్నన్ = ఉండినప్పటికిని, ఓహో అంచున్ = భళీ యని మెచ్చుకొనుచు, అది = ఆగుణలేశమును, కొండంతన్ = కొండంతపెద్దదిగా, చేసి, రహిన్ చెందున్ = ఆనందించును. జగంబు ఎల్లన్ = లోకమంతటిని, మహా ఉపకారములన్ = గొప్పయుపకారములచేత, రక్షించున్ = కాపాడును. ఎల్లరలోన్ = జనులందఱిలోను తాన్ పుణ్యశరీరి = ఇట్టిపుణ్యాత్ముఁడగువాఁడు, ఒక్కొక్కఁడె=ఒకానొకఁడుమాత్రమే (ఎక్కడనో ఒక్కఁడుమాత్రము), ఉండును. (సాంద్రముగా నుండరు అనిభావము.)

తమతలఁపులు, మాటలు, పనులు అనునవి అమృతమువంటి పుణ్యముతో నిండియుండునట్లు వర్తించుచు, ఒరులయందుఁగల అత్యల్పగుణమును సైతము కొండంత పెద్దదిగా తలఁచి హృదయముల నానందించుచు, ముల్లోకములందున్న వారిని తమయుపకారములచే రక్షించుచు నుండు సత్పురుషులు కొందఱు మాత్రమే యుందురు. ఏతాదృశగుణసంపత్తి అసాధారణ మని భావము.

వాక్ మనసకాయములు - త్రికరణములు.

వాక్+మనస=వాఙ్మనస-కకారమునకు ఙకారాదేశము అనునాసికసంధి.

గుణలేశము - కర్మధారయసమాసము.

కొండ+అంత - 'అంత' పరిమాణార్థమునవచ్చు ప్రత్యయము.

అతి+ఉరు = అత్యురు - ఇకారమునకు యకార మాదేశము.

పుణ్యా+అమృత - పుణ్యమనెడి యమృతము - రూపకసమాసము.

ఒక్కఁడు+ఒక్కఁడు = ఒక్కొక్కఁడు - ఆమ్రేడితము పరమగునపుడు విభక్తి ప్రత్యయమునకులోపము విభాష నగు.

---

## ధైర్యపద్ధతి

అవ. పరోపకారపరాయణులకు సైతము నిశ్చితార్థమును వదలకుండు టకు నిమిత్తము ధైర్య మవసరముగావున తన్నిరూపణానంతరము ధైర్యపద్ధతి నారంభించుచున్నాఁడు.

మ. మునురత్నంబులు వార్ధిఁబుట్టమదిసమ్మోదాప్తియుఁ జెందఁ; దం
తనె హాలాహల ముద్భవిల్లసురబృందంబార్తియుఁ జెంద; దె
న్నినకార్యంబు సుధార్థ మౌట నది జన్మింపన్ జనెన్; సజ్జనుల్
పని యీడేరక పోదురే సురభిమల్లా నీతివాచస్పతీ. 71

ధీరులు తామకోరిన ప్రయోజనము నెఱవేఱునంతవఱకును మాన రను టను సదృష్టాంతముగ నుదహరించుచున్నాఁడు.

సురభి...స్పతీ, మును=పూర్వము, సురబృందంబు=దేవతలసమూహము, వార్ధిన్=సముద్రమునందు, రత్నంబులు=(కౌస్తుభము మొదలయిన) మణులు-లేక (ఐరావతము, ఉచ్చైశ్శ్రవము మొదలయిన) తత్తజ్జాతిలో శ్రేష్ఠమైన వస్తువులు, పుట్టన్=కలుగఁగా, మదిన్ సమ్మోదాప్తియున్=మనస్సున సంతోషము కలిమిని, చెందదు = పొందలేదు. అంతనె=అప్పుడే, హాలాహలము=కాలకూటవిషము,ఉద్భవిల్లన్=పుట్టఁగా, ఆర్తియున్=దుఃఖమునుసైతము, చెందదు.ఎన్నిన కార్యంబు=తామఃపూనుకొన్న ప్రయోజనము, సుధార్థము ఔటన్=అమృతము

కొలఁదు అగుటచేత, అది = ఆ సుమృతము, జన్మింపన్ = పుట్టఁగా, చనెన్ = పోయెను. సజ్జనులు = సత్పురుషులు (ధీరులు), పని=తామపూనుకొన్న ప్రయోజనము, ఈడేరక = సిద్ధింపక, పోదు రే=పోవుదురా?

అమృతమునకై పాలసముద్రమును మథింపుచున్న దేవతలు, అందలి రత్నలాభమునకు సంతోషింపక, అందుపుట్టిన కాలకూటవిషమునకు భయపడక అమృతమును కనులఁ గాంచునంతవఱకును తమపట్టును మానరైరి. ధీరు లెప్పుడును తాము తలఁచినకార్య మగునంతవఱకు తమ ప్రయత్నములను మానరు.

చూ. 72. "ఘనుల్ పనిసాధింతురు పూనినన్."

రత్నము - (1) మణి. (2) ఆయాజాతి శ్రేష్ఠవస్తువు.

పాలసంద్రమునఁబుట్టిన పదునాల్గు శ్రేష్ఠజాతివస్తువులు:

(1) లక్ష్మి, (2) కౌస్తుభము, (3) పారిజాతము, (4) మద్యము, (5) ధన్వంతరి, (6) చంద్రుఁడు, (7) కామధేనువు, (8) ఐరావతము, (9) రంభాదిదేవాంగనలు, (10) సప్తముఖాశ్వము (ఉచ్చైశ్శ్రవము), (11) హాలాహలము, (12) హరిధనువు - శార్ఙ్గము, (13) శంఖము, (14) అమృతము.

సుధా = అమృతము - కట్టకడపటఁ బుట్టినది.

ఆర్తియొంక్ చెందరు - ధైర్యాతిశయోక్తి సూచితము.

అది జన్మింపన్ చనెన్ - శిలసంపత్తి ఉక్తము.

అర్థాంతరన్యాసాలంకారము.

మును - రూ. మున్ను. సుధార్థము-ఇట అర్థము చతుర్థీవిభక్త్యర్థకము.

బృందము - అమహదర్థకము గావున చెందదు, చనెన్ అను క్రియలును అమహదర్థకములైనవి.

వార్ధి=వార్+ధి; వార్=జలము+ధి=వార్ధి=సముద్రము. ఉపపదసమాసము.

పోదురు - పోవుదురు - తద్ధర్మార్థక ప్రథమ పు. బ.

అకారాదులు దకారాంతములు, ము-డు ప్రత్యయములు పరమగునపుడు 'పొవు' పువర్ణము వైకల్పికముగ లోపించును.

అవ. ఉత్తమాదుల ధైర్యతారతమ్యము.

మ. పనిగా నేర ద టంచుఁ బూనక వెఱంబ్రాపింతు రెంతేజడుల్;
పనికి న్మేకొని విఘ్నలేశము జనింప న్మధ్యము ల్వీఁగి యం
తనె చాలింతు, రనేకవిఘ్నతతు లుత్పన్నంబు లైన న్ఘనుల్
పని సాధింతురు పూనిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 72

పూర్వోక్తవిషయమే యిందు ప్రకారాంతరముగ నుడువఁబడుచున్నది.

సురభి...స్పతీ, జడుల్ = తెలివిలేనివారు, పనికా నేరదు=పని సరిగా ముగియదు, అటంచుర్ = అని చెప్పుచు, పూనక = ప్రారంభింపక, ఎంతేర్ వెఱర్ = ఎంతో భయమును (మిక్కుటమైన భయమును), ప్రాపింతురు=పొందుదురు. మధ్యముల్ = సాధారణులు, పనికిర్, మేకొని = సమ్మతించి, విఘ్నలేశము=స్వల్పమైన అంతరాయము, జనింపర్ = కలుగఁగా, అంతనె=అంతటితోనే (అట్లాగానే), వీఁగి = వెనుదీసి, చాలింతురు = వదలిపెట్టుదురు. ఘనుల్ = గొప్పవారు, పని పూనినర్ = ఒకకార్యమును ప్రారంభించినయెడల అనేకవిఘ్నతతుల్ = లెక్కకుమిాఱినన్ని విఘ్నములసమూహములు, ఉత్పన్నంబులు ఐనర్=కలిగినను, సాధింతురు=నెఱవేర్తురు.

అధములు (తెలివిలేనివారు) విఘ్నములు సంభవించు నని యెన్నకొనుచు కార్యముల నారంభమే చేయరు. మధ్యములు ప్రారంభింతురుగాని ఎంతస్వల్పమగు అడ్డుతగిలినను అంతటితోనే కార్యమును మానుకొందురు. ఘనులు విఘ్నములు మాటిమాటికిని అడ్డుతగులుచున్నను వెఱవక ప్రారంభించిన పనిని సాధించియే వదలుదురు.

పూర్వపద్యమున కాలకూట బడబానలాది విఘ్నములు తాఁకినను ధైర్యగుణసంపన్నతచే అమృతము పుట్టుదనుక పాలసముద్రమును చిలుకుచుండి

రని తెలుపఁబడినది. ఈపద్యమున కొన్నిపట్టుల ధైర్యము, కొన్నిపట్టుల శీలము, మఱికొన్నిపట్టుల రెండును ప్రాధాన్యము లని నిర్దేశింపఁబడినది. ధైర్య మనఁగా మనస్సున నిర్వికారత్వము; శీల మన నియతకులోచితసత్స్వభావము, అని యెఱుఁగునది.

కానేరదు - నేరుచు ధాతువునకుఁ గొన్ని భూతార్థములును తద్ధర్మార్థకములు నగు ప్రత్యయములు పరమగునపుడు రేఫలోపమును, అకారాదులు, ము-డు-పరమగునపుడు చు లోపమును బహుళముగా నగును.

మేకొను - రూ. మెయికొను.

విఘ్నశేశము - అంతటికే బుద్ధివికాసము చాలక తమయశక్తత నొప్పుకొందురు అనిభావము.

అనేక విఘ్నతతుల్-విఘ్నములు పరంపరగా మాటిమాటికి తగుల్కొను చున్నను అపజయము నంగీకరింపక కార్యసాధకదృష్టియే కలవారు అని భావము.

అవ. కార్యార్థి సుఖదుఃఖములను పరిగణింపఁడు.

శా. నేల న్మంజులశయ్యయందు నయినన్ నిద్రించు, వేడ్కన్స్ఫుర
చ్చేలం బేనియు బొంతయేని సరిగాఁ జింతించి పైఁదాలుచు,
న్శాలీయాశనమైనఁ గూర యయినన్ భక్షించు ధీశాత్ముఁ, డే
లా లోఁగున్ సరసాగ్రణీ సురభిమల్లా నీతివాచస్పతీ. 73

సరసాగ్రణీ=రసికులలో శ్రేష్ఠుఁడా, సురభి...స్పతీ, నేలన్ అయినన్ =కటికనేలమీఁదఁగాని, మంజులశయ్యయందున్ అయినన్=మృదులతరమగు పక్క (హంసతూలికాతల్పాదికము) యందుఁగాని, వేడ్కన్ = సంతోషముతో, నిద్రించున్=నిద్రపోవును. స్ఫురత్ చేలంబేనియున్=ప్రకాశమానము లగు పీతాంబరాదివస్త్రములనుగాని, బొంతయేని = గంతనుగాని, సరిగాన్=సమానముగా, చింతించి = భావించి, పైన్ తాలుచున్ = మీఁద వేసికొనును. శాలీయ

అశనము ఐనన్ = వరియన్నమైనను, శూాక అయినన్ = కూరగాయలః మాత్రమే అయినను (నీరసమగు ఆహారము నయినను అని భావము), భక్షించున్ = భుజించును. ధీరాత్ముఁడు = ధీరుఁడు, ఏలా=ఎందును, లోఁగున్ = వెనుదీయును.

కార్యార్థి యగు ధీరుఁడు నడుమనడుమఁ గలుగు సుఖదుఃఖములను లెక్క సేయఁడు. వీలునుపట్టి కటిక నేలమీఁదఁగాని మృదువైన పఱుపుమీఁదఁగాని పరుండును; కాయగసురుగాని వరిబియ్యపు టన్నముగాని భుజించును; బొంతనుగాని, పీతాంబరము మొదలగు మేలివస్త్రములుగాని ధరించును. కాని నేలమీఁద పరుండుట మొదలగువానివలని దుఃఖమునుగాని, మెత్తని పఱుపులపై పరుండుట మొదలగువానివలని సుఖమునుగాని, పాటింపఁడు. కార్యసాధనతత్పరున కివిరెండును సమానములే.

స్ఫురత్ + చేలము = స్ఫురచ్చేలము. ఏలా - 'ఏల'-కు రూ. వేడుక-పదమధ్యమందలి డు-మీఁది ఉకారములోపింపఁగా వేడ్క - అగును. బొంత= చలికప్పునకును పఱుపునకును ఉపయోగముగా దూదిలోనగువానిఁ జేర్చి దట్టముగాఁ గుట్టినగంత; లేదా, మెత్తగాఁ బఱచుకొనుటకై ప్రాఁతగుడ్డలను జేర్చి దట్టముగాఁ గుట్టినగంత. 'ఏని' - ఇక్కడ వికల్పార్థకము. 'ఐనన్' (=అయినన్) ధ్రుతాంతావ్యయము - వికల్పముం దెల్పును.

'ధీరుఁడు-ఎట్టిసమయములందును మనస్సున వికారముపొందనివాఁడుః ప్రాజ్ఞుఁడు.

"శాలీయము" = శాలిధాన్యమునుండి కలిగినబియ్యము.

అవ. ధీరు లెప్పుడును న్యాయమార్గమును వదలరు.

మ. నయశాస్త్రజ్ఞులు తిట్టనీ పొగడనీ, నానాటి కైశ్వర్య మ
క్షయమై వర్తిలనీ కరం బణఁగనీ, కాయంబు వోనీ తిరం
బయి భాసిల్లఁగనీ, స్వధర్మము విడ న్వాంఛింప రత్యుత్తముల్
దయమానాత్మకశేశయా సుగభీమల్లా నీతివాచస్పతీ. 74

దయామాసాక్షీ కుశేశయా = కనికరముతో నిండి తామరలవలె నుండు కన్నులుగలవాఁడా, నయశాస్త్రజ్ఞులు = నీతిశాస్త్రముచక్కఁగా తెలిసినవారు, తిట్టనీ = తిట్టుదురుగాక, పొగడనీ = మెచ్చుకొందురుగాక, నానాఁటికిన్ = దినదినమునకును, ఐశ్వర్యము = సంపద, అక్షయము ఐ = నాశములేనిదై, వర్తిలనీ = ఉండునుగాక, కరంబు = మిక్కిలి, అణఁగనీ = తగ్గిపోవునుగాక, కాయంబు = శరీరము, పోనీ = పోవునుగాక (మరణము కలుగునుగాక), తిరంబు అయి=స్థిరముగా, భాసిల్లఁగనీ = ప్రకాశించునుగాక (చిరకాల ముం డునుగాక), అత్యుత్తముల్ = ధీరులు, స్వధర్మమును = తాము పూనుకొన్న న్యాయమార్గమును, విడన్ = వదలుటకు, హర్షింపరు=సంతసపడరు.

నీతివేత్తలు తప్పని నిందించినను సరి యని భూషించినను, సంపదలు కలిగినను పోయినను, మరణము కలిగినను కలుగ కున్నను, న్యాయమార్గమును దాఁటి ఒకయడుగైనను ఆవల పెట్టరు. వారికి న్యాయమార్గము వదలకుండుటయే ప్రధానముగాని, నిందాస్తుత్యాదులు కావు అని భావము.

చూ. 58 ప. "అసువులొప్పివుకటికి" ఇత్యాది.

తిట్టనీ = తిట్టనిమ్ము = తిట్టన్+ఇమ్ము - ప్రార్థనార్థకంబున తుమున్నర్థక (అన్ - ప్రత్యయాంత) అవ్యయములమీఁది 'ఇమ్ము'నకు 'ఈ' విభాషనగు.

ఇట్లే పొగడనీ, వర్తిలనీ, అణఁగనీ, పోనీ, భాసిల్లఁగనీ. కాయంబు+ పోనీ = కాయంబువోని; ప్రథమమీఁది పకారమునకు వకారాదేశము.

తిరము (వి.) స్థిరము (ప్ర.)

నానాఁటికిన్ - నాఁడు+నాఁడు = నానాఁడు, నాఁడునాఁడు ఆమ్రేడితము పరమగునపుడు ఇంచుక, నాఁడు - ఇత్యాదులందు అంతిమాక్షర లోపము బహుళముగా నగు. నాఁడు ఔపవిభక్తికము కావున 'కిన్' పరమగు చో 'నాఁటికిన్' అగును.

అవ. ధీరలక్షణము, తన్మహిమ.

శా. ఏపుణ్యాత్ము నలంప లేవు మహి నెందే నింద్రియార్థంబులా
శాపాశంబులు రోషవహ్నిశిఖలున్ శ్యామాదృగస్త్రవ్రజం
బాపుణ్యాత్ముఁడె పో జగత్త్రయ మనాయాసంబున న్గెల్చువాఁ
డాపూర్ణప్రతిభానిధీ సురభిమల్లా నీతివాచస్పతీ. 75

ఆపూర్ణప్రతిభానిధీ = సంపూర్ణమైన ప్రతిభకు నిధియైనవాఁడా, సురభి...స్పతీ, మహిన్ ఎందేన్ = భూమియం దెక్కడఁగానీ. ఏపుణ్యాత్మున్ = ఏమహాపురుషుని, ఇంద్రియ+అర్థంబులు = శబ్దాదివిషయములు, (శబ్దస్పర్శ రూపరసగంధములు), ఆశాపాశంబులు = ఆశలనెడు త్రాళ్లు, రోషవహ్ని శిఖలున్ - రోష = కోప మనెడి - వహ్ని = నిప్పుయొక్క - శిఖలున్ = మంటలును, శ్యామా దృక్+అస్త్రవ్రజంబు - శ్యామా = స్త్రీలయొక్క - దృక్ = చూపు లనెడి - అస్త్ర = బాణములయొక్క - వ్రజంబు = సమూహమును, అలంపన్ లేవు = బాధింపలేవో, ఆపుణ్యాత్ముఁడె పో = నిశ్చయముగా ఆసత్పురుషుఁడే సుమా, జగత్త్రయము = మూఁడులోకములను, అనాయాసంబునన్ = శ్రమములేకయే, గెల్చువాఁడు = స్వాధీనముకావించుకొనువాఁడు.

ఎవఁడు పంచేంద్రియములను గెల్చునో, ఎవనిమనస్సును లోభ మను త్రాఁడు కట్టఁజాలదో, ఎవనిహృదయమును కోపాగ్ని దహింపలేదో, ఎవఁడు స్త్రీల కడకంటిచూపులకు భ్రమసి కామమునకు లొంగఁడో వాఁడే ధీరుఁడు. వానికే ముల్లోకములును వశము లగును. అతనికి సాధింపరాని దొకటియు నుండఁబోదు.

ఆశాపాశము = లోభము-పరస్వాపహరణాది కామాదులుకూడ సూచితము. పాశమును చెప్పుట బంధించుశక్తివలన.

దృగస్త్రము = బాణములెంతనిశితములో చూపులును అంతనిశితములు-తరుణుల కడకంటిచూపులు తప్పక సమ్మోహింపఁజేయునవి. ఏపుణ్యాత్ముఁడు—ఆ పుణ్యాత్ముఁడు—ఏ ఆ-లు సంబంధార్థక సర్వనామములు.

పో-నిశ్చయార్థకము. చూ. ప. 12-విద్యయె పో. జగత్త్రయము - స్వర్గ మర్త్యపాతాళములను మూఁడులోకములు. ద్విగుసమాసము.

ఆశాపాశములు, రోషవహ్ని, దృగస్త్రము - రూపకములు.

అవ. సహజమగు ధైర్యగుణము నెన్నఁటికిని మాన్పఁ దరము కాదు.

శా. ధీమంతు ల్విధిదుర్విపాకమున నార్తిం జెందియుఁ ధీరతా
సామగ్రిం ద్యజియింతురే? శిఖశిఖాజాలం బధోగామి యౌ
నే మర్త్యు ల్తలక్రిందుగాఁ గొనిరయేనిఁ భాగ్యసౌభాగ్యలీ
లామందీకృతవాసవా సురభిమల్లా నీతివాచస్పతీ. 76

భాగ్య...వాసవా-భాగ్య = సంపదచేతను - సౌభాగ్య=సౌందర్యము యొక్కలీలచేతను - మందీకృత = తక్కువచేయఁబడిన-వాసవా = ఇంద్రుఁడు కలవాఁడా (సంపదయందును సౌందర్యమునందును ఇంద్రునిమించినవాఁడా యనుట), సురభి...స్పతీ, ధీమంతుల్ = విద్వాంసులు, విధి...మునఁ-విధి= భాగ్యముయొక్క- దుర్విపాకమునఁ = పరిణామముచెడుటచేత, (అదృష్టము పండకపోవుటచేత), ఆర్తిఁ చెందియుఁ = దుఃఖములపాలైయున్నను, ధీరతా సామగ్రిఁ = ధైర్యమనెడి ఉపకరణమును, త్యజియింతురే = వదలిపెట్టుదురా? (వదలిపెట్టరనుట). (ఇందులకు దృష్టాంతము), మర్త్యుల్ =మనుష్యులు' తలక్రిందుగాఁ = అధోముఖ మగునట్లుగా, కొనిరయేనిఁ =పట్టికొన్నప్పటికిని, శిఖశిఖాజాలంబు = అగ్నియొక్క జ్వాలలయొక్క సమూహము, అధోగామి = దిగువవంక వ్యాపించునది, ఔనే = అగునా? (కాదు.)

అగ్నిని తలక్రిందుగాపెట్టినను దానిజ్వాల క్రిందివైపునకుఁగాక మీఁదికే ప్రసరించులాగున ధైర్యవంతుని కెట్టియిక్కట్టు వచ్చినను, ఎంత నీచదశ కలిగినను వానిధీరతమాత్రము కొఱవడక మీఁదుమిక్కిలి ప్రకాశించుచునే యుండును. దృష్టాంతాలంకారము.

శిఖ=జ్వాల, అది కలది, శిఖి = నిప్పు.

కొనిరి+అ+ఏనిన్ = కొనిరయేనిన్. అ-అవధారణార్థకము.

అవ. శీలహానికన్న మరణము మేలు.

మ. తనసద్ధర్మముఁ దప్పుకన్న గిరిమూర్ధం బెక్కి దేహంబు తు
త్తునియల్గా మహిఁ బడ్డ మేలె; శిఖియందు న్జొచ్చినన్మేలె; పం
బినకాలాహిముఖాగ్రమున్ గేలొసఁగినన్మేలే సుమీ యాజిఖే
లనగాండీవశరాసనా సురభిమల్లా నీతివాచస్పతీ. 77

ఆజిఖేలన...సనా-ఆజి = యుద్ధమనెడి-ఖేలన = క్రీడయందు-గాండీవ= గాండీవ మను - శరాసనా=విల్లుగలిగిన అర్జునునివంటివాఁడా (యుద్ధమున నర్జునునివంటివాఁడా అనుట). సురభి...స్పతీ, తన సత్ ధర్మమున్ = తనమంచి ధర్మమును, తప్పుకన్నన్ = అతిక్రమించుటకంటెను, గిరిమూర్ధంబు = కొండయొక్క శిఖరమును, ఎక్కి, దేహంబు = ఒడలు, తుత్తునియల్ = చిన్నచిన్న తునుకలు, కాన్ = అగునట్లుగా, మహిన్ = నేలమీఁద, పడ్డన్ = పడినను, మేలు+ఎ=మంచిదే, శిఖియందున్ = నిప్పులో, చొచ్చినన్ = ప్రవేశించినను, మేలె; పంబిన...నన్ - పంబిన = అతిశయమైన - కాల+అహి=నల్లత్రాఁచుయొక్క - ముఖాగ్రమున్ = నోటియందు, కేలు = చేతిని, ఒసఁగినన్= ఇచ్చినను, మేలు+ఏ+సుమీ=మంచికార్యమగును సుమా.

ఎత్తయిన పర్వతశిఖరమునుండి నేలమీఁదఁ బడి తుత్తునియలుగా నలఁగినయైనను, నిప్పులో పడియైనను, (వాఁడికోఱల విషజ్వాలలచే) నతిశయిల్లుచుండు నల్లత్రాఁచునోటియందు చేయిపెట్టఁగా విషమెక్కుటచేతనైనను మడియుట ఒక పక్షమున మే లనవచ్చునుగాని సద్ధర్మమును తప్పుటమాత్రము బొత్తిగా మేలు గాదు. ప్రాణము పోవునట్లున్నను శీలమును త్యజింప రాదు అని భావము.

తప్పుకన్నన్ - తప్పుట+కన్నన్.

"ఉంచి, కన్న, పట్టి, కంటె, వల్ల, వలన, పంకొండ్యో జనిసః" అని

ఆంధ్రకౌముదియందు పంచమీవిభక్తి ప్రత్యయములు. కన్నన్'—'కంటెన్'
అనునర్థమున వచ్చును.

కొఱకు, కంటె, పొంటెలు పరములగునపుడు భావార్థక టవర్ణకమునకు
లోపము విభాష నగు.

తుత్తునియల్ = తునియలు+తునియలు - ఆమ్రేడితము పరమగునపుడు
అందదుకు ప్రభృతులు యథాప్రయోగముగ గ్రాహ్యములు.

పద్దన్-పదము+ఇనన్-ఇనన్, ఇన పరమగునపుడు పద్యాదుల తుదివర్ణ
మునకు అకారముతోఁగూడిన ద్విత్వము వైకల్పికముగ నగును. అగుచో 'ఇన'
లోపించును.

పంబిన - పంబుధాతువు భూతార్థకవిశేషణము, దూ- పమ్మిన.

మొగానన్ - మొగము+నన్ = మొగ+నన్ = మొగానన్.

లు, ల, న-లు పరములగునపు డొకానొకచో మువర్ణకమునకు లోప
మును తత్పూర్వస్వరమునకు దీర్ఘమును విభాష నగు.

ముఖము (ప్ర.) మొగము, మోము (వికృతులు.)

మేలె, మేలే—ఎ, ఏ. లు నిశ్చయార్థకావ్యయములు.

పంబిన కాలాహిమొగానన్ - మిశ్రసమాసము.

కేలు - నిత్యైకవచనము. శర+ఆసనము=బాణమునకు ఆసనము విల్లు.

అవ. శీలరక్షణమువలని లాభము.

మ. ఘన మౌశీలము గల్గుధీరులకు సింగంబు ల్వశప్రాయముల్,
వన రాసుల్చిఱుగాలువ, ల్ఘనులుమాల్యంబు, ల్మహోగ్రాగ్ని చ
ల్లనితోయంబు, విషద్రవంబు సుధ, శైలశ్రేష్ఠ మల్పోపలం
బనవద్యోదయభాసురా సురభిమల్లా నీతివాచస్పతీ. 78

అనవద్యోదయభాసురా = కొంచెముకాని ఉన్నతిచేత ప్రకాశించు
వాఁడా, సురభి...స్పతీ, ఘనము = గొప్పది, ఔ = అగు, శీలము = సత్స్వ

భావము, కల్లు, ధీరులకున్ = మహాత్ములకు, సింగంబుల్ = సింహములు (హింసాకరములైనను), శశప్రాయముల్ = కుందేటితో సమానములు (నిర్బాధక మగు ననుట), వనరాసుల్ = సముద్రములు (దాటరానివి అనుట), చిఱుకాలువల్ = చిన్నకాలువలతో సమానము (సునాయాసముగా దాటఁ దగిన వనుట), ఫణులు= పాములు (విషమువల్లను కోపమువల్లను భయంకరము లైనవి). మాల్యంబుల్ = పూలదండలు (చల్లనైనవి), మహా+ఉగ్ర+అగ్ని= మిక్కిలి భయంకరమగునగ్ని (దహించునట్టిది), చల్లనితోయంబు = చల్లనైన నీటితో సమానము, విషద్రవంబు=విషరసము (ప్రాణప్రయాసహేతు వనుట), సుధ = అమృతముతో సమానము; శైలశ్రేష్ఠము = పర్వతశ్రేష్ఠము (మేరువు), అల్ప+ఉపలంబు = చిన్నఱాయివలె (నగును.)

ఎవఁడు సత్స్వభావము కలిగియుండునో అట్టివానికి సమస్తమును దహించునగ్ని నీటివలె చల్లఁబడును; హింసాకర మగుసింహము కుందేటివలె నిర్బాధక మగును; అపారమగుసముద్రము చిన్నకాలువవలె దాఁట శక్యమగును; విషరోషభీషణ మగుపాము మెత్తని పూలదండవలె నుండును; ప్రాణోపద్రవకర మగువిషము అమృతప్రాయ మగును; గొప్పపర్వతము అడ్డుగాక చిన్నఱాతివలె నగును. అనఁగా, శీలసంపన్నునకు దుఃఖహేతువు లన్నియు సుఖహేతువు లగును. ఉపమాలంకారము.

సింగము (వి.) సింహము (ప్ర.)

శశ ప్రాయము: 'ప్రాయము'- సమాసమం దుత్తరపదమై సమాన మను నర్థ మిచ్చును.

వన+రాశి— వన మనఁగా జలము - దానియొక్క 'రాశి' సముద్రము.

రాశి (వి.) రాసులు (బ.)

అవద్యముకానిది అనవద్యము—అధికము.

ఫణి - ఫణము - అనఁగా పడగ - దానినికలది ఫణి. చల్లనితోయము=

చల్ల+తోయము - అకారాంతములైన గుణవాచకములకుఁ గర్మధారయమున నివర్ణము బహుళముగా నాగమ మగును.

ఘనము ఔ శీలము-విశేష్యమునకు (శీలము) దగ్గఱగా నుండు విశేషణము (ఘనము)నకు అగు, ఔ-లుచేరును. ఆవిశేషణములు ప్రథమాంతములే యగును.

అవ. ధీరుల కెప్పటికిని సంతాపము కలుగదు:

మ. పయిపైఁ గొమ్మలుగొట్టినన్ మరియిగుర్పన్ జూడమా వృక్షములన్
క్షయమున్ బొందియు వెండియున్ గళలు గాంచన్ జూడమా చంద్రు నెం
తయు దైవంబనుకూలమౌఁ బ్రమదమందన్ గాంతుమంచు న్ఘను
ల్భయము న్జెంద రొకప్పుడు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 79

సురభి...స్పతీ, పయిపైన్ = మీఁదుమీఁదుగా, వృక్షములన్ = చెట్లను, కొమ్మలు, కొట్టినన్ = నఱుకఁగా, మరి = మరల, ఇగుర్పన్ = చిగిరించుచుండఁగా చూడమా=(మనము) చూచుటలేదా? క్షయమున్ పొందియున్= (కృష్ణపక్షమున) తగ్గుదలను పొందినప్పటికిని, వెండియున్ = మరల, (శుక్లపక్షమందు), కళలు కాంచన్ = కళలు పెరుఁగుచుండఁగా, చంద్రున్=చంద్రుని, చూడమా = చూచుటలేదా? ఘనుల్ = ధీరులు, "ఎంతయున్ = మిక్కిలి, దైవంబు=విధి, అనుకూలము ఔన్ = హితమైనది అగును; (అంత), ప్రమదము=సంతోషము, ఆందన్ కాంతుము = పొందఁగల్గుదుము" అంచున్ = అని, ఒకప్పుడున్ = ఒక సమయమందైనను, భయమున్ చెందరు = భీతిపొందరు.

ధీరులు (శీలవంతులు) ఒకానొకప్పుడు తమకు కష్టములు సంభవించిన యెడల, కొమ్మలుకొట్టినచెట్టు మరల చిగిర్చి యెదుగుటను, క్షీణించినచంద్రుఁడు వెండియుఁ గళలుగాంచి నిండుకొనుటను చూచి, తమకును అట్లే మరల నభివృద్ధి కలుగు నని యూహించి సంతాపము నందక యూఱడిల్లుదురు. తరుచంద్ర దృష్టాంతములచేత అభివృద్ధి తప్పక సూచితము.

ఇగుర్పక్ - ఇగుర్పు+అక్—

అకారాది ప్రత్యయములును, మధ్యమపురుష ము-డు-వర్ణకములును పర మగునపుడు-చు, ఇంచు-ల చకారమునకును, తలఁచు మున్నగుకొన్ని ధాతువుల చకారమునకును పకారము బహుళముగా సాదేశ మగును.

చూడమా-చూడము+ఆ—ఆ ప్రశ్నార్థకము.

ప్రాను (ఏ.) ప్రాఁకులు (బ.)

కలన్వాదుల నువర్ణము కుజ్జుఁ; బహువచనము పరమగునపుడు నిత్యము గా నగు. కలను, కెలను, కొఱను, కొలను, గవను, నెఱను, ప్రాను, వరను, వలను-ఇవి కలన్వాదులు.

అవ. శీలమే సమస్తమునకు భూషణము.

మ. తప మక్రోధత, సౌమ్యత స్సిరి, మహత్వం బోర్మి, ధర్మంబు ని
ష్కపటత్వంబున, బల్మి మౌనమున, శాస్త్రశ్రీ వినీతి, స్థనం
బు పవిత్రార్పణ, జ్ఞానలక్ష్మి ప్రశమస్ఫూర్తి, స్సమస్తంబు శ్రీ
లపరత్వంబున శోభిలు న్నరభిమల్లా నీతివాచస్పతీ. 80

ను: భి... స్పతీ, తపము = చాంద్రాయణాదితపస్సు, అక్రోధతక్ = కోపములేమిచేతను (కోపశీలత్వముచేతఁగాదు), సిరి=ఐశ్వర్యము, సౌమ్యతక్ =మంచితనముచేతను (దౌర్జన్యముచేతఁగాదు), మహత్వంబు = సామర్థ్యము (గొప్పఁదనము), ఓర్మిక్ = ఓర్పుచేతను (ఆగ్రహముచేతఁగాదు), ధర్మంబు= పుణ్యకర్మాచరణము (సత్పాత్రదానము), నిష్కపటత్వంబునక్=డంబములేమి చేతను (ద్రవ్యనాశముశిక్షముచేతఁగాదు), బల్మి=పరాక్రమము, మౌనమునక్= మాటనియమముచేతను (అసంబద్ధప్రలాపిత్వము చేత ఁగాదు), శాస్త్రశ్రీ= శాస్త్రవిద్యాసంపద, వినీతిక్ = అణఁకువచేతను (గర్వాతిశయముచేతఁగాదు), ధనంబు, పవిత్రార్పణక్=సత్పాత్రమునందు వినియోగించుటచేతను, (నట విటాదులకై ఖర్చుపెట్టుటచేతఁగాదు), జ్ఞాన లక్ష్మి=తెలివిసంపద (కర్తవ్యా

కర్తవ్యవివేకము అనియేనియు, ఆత్మవిషయకమనియేనియు); ప్రశమస్ఫూర్తిన్ =శాంతి (భోగాసక్తినుండి విరమించుట)చేతను (మిక్కిలియిచ్చగల్గియుండుట చేతఁగాదు); సమస్తంబు = అన్నియు, (ఈచెప్పినవి) శీలపరత్వంబునన్ =మంచి నడవడియందలి తత్పరత్వము చేతను, శోభిలున్ = ప్రకాశించును.

తపస్వియై కోపములేకుండుటయు, సంపదలు కలిగి సుజనుఁడుగ నుండుటయు, సమర్థుఁడై ఓర్పుచుండుటయు, నెపములేక ధర్మము నొనర్చుటయు, శూరుఁడై మితభాషి యగుటయు, జ్ఞానముకలిగి ఇంద్రియలోలత లేకుండుటయు, విద్యావంతుఁడై వినయము కలిగియుండుటయు, ధనముండి సత్పాత్రమందు వినియోగించుటయు అనువానిలో నొక్కొక్కటియు పురుషునకు అలంకారముగా నొప్పును. వీని కన్నిటికిని కారణమయిన శీలము ఒక్కటే వీని కన్నిటికిని శోభ తెచ్చును. కనుక నన్నివిధముల శీలమే ఆశ్రయణీయ మని తాత్పర్యము.

బలిమి - బల్మి —లకారముమీఁది ఇకారమునకు లోపము; ఓర్మి - ఓరిమి - రేఫమీఁది ఇకారలోపము. అచ్చికముల పదమధ్యముల న ల డ ర-ల యుత్వమునకు లోపము బహుళముగా నగు; లాఁతి యచ్చునకు సహిత మొకానొకచో నుడినడుమ లోపము గానఁబడియెడి.

---

## —దైవపద్ధతి—

ధైర్యశీలములు సైతము దైవాయత్తము లగుటచేత, నాపద్ధతుల పిదప దైవపద్ధతిని నిరూపించుచున్నాఁడు.

అవ. పౌరుషమునకన్న దైవమే బలము.

మ.గురుఁడాచార్యుఁడువజ్రమాయుధములేఖుల్సేనపై దిక్కుశ్రీ
హరి, స్వర్లోకము పాళెపట్టు ద్విరదం బైరావతం, బిట్టియ

చ్చెరు వౌసాధన ముండియు న్మఖపుఁ డాజి న్బాఱు ద్దైవంబు లే
కరయం బౌరుష మొప్పునే సురభిమల్లా నీతివాచస్పతీ., 81

సురభి...స్పతీ (ఎవనికి), ఆచార్యుఁడు = (హితాహితముల) సంప్ర దాయమును నేర్పువాఁడు. గురుఁడు=బృహస్పతియో, ఆయుధము, వజ్రము= వజ్రమో, (ఏదో ఇనుముతో చేసినదిగాక పర్వతముల రెక్కలునఱికినను మొక్క పోని దని భావము), సేన=దండు, లేఖుల్=వేల్పులో, (దుర్బలులగు లౌకికులు కా రనుట), పైదిక్కు = శరణమొసఁగి రక్షించువాఁడు, శ్రీహరి = శ్రీమహా విష్ణువో (సకలలోకాధీశ్వరుఁడేకాని క్షుద్ర దేవతలు కా రనుట), పాళెపట్టు= రాజ్యము (దండు ఉండఁదగుస్థానము, కోట, అనియేని), స్వర్లోకము = స్వర్గ లోకమో, (ద్విరదంబు = ఏనుఁగు, ఐరావతంబు = ఐరావత మనెడు తెల్ల యేనుఁగో, (చౌదంతిగానిసామాన్యమైన యేనుఁగుఁ గన్న కాదనుట), ఇట్టి=పూ ర్వోక్తప్రకారమైన, అచ్చెరువు+ఔ=ఆశ్చర్యముపుట్టించు, సాధనము=(అసా ధారణమును అద్భుతశక్తి కలదియు నగు) ఉపకరణము, ఉండియున్=ఉన్న ప్పటికిని, మఖపుఁడు = ఇంద్రుఁడు, ఆజిన్ = యుద్ధమునందు, పాఱున్ = ఓడి పరుగెత్తెను. అరయన్ = ఆలోచింపఁగా, దైవంబు = దైవబలము, లేక, పౌరుషము = పురుషప్రయత్నము, ఒప్పునే = సరిపడునా (ప్రయోజనవంత మగునా అనుట.) (అనఁగా కాదు అని భా.)

ఇంద్రునికి మంత్రి బృహస్పతి, ఆయుధము వజ్రము, సైనికులు దేవ తలు, పైదిక్కు విష్ణుమూర్తి, కోట స్వర్గము, పట్టపేనుఁగు ఐరావతము. ఇట్టి అసాధారణశక్తిగలిగిన యింద్రుఁడే యుద్ధములో రాక్షసులకు ఓడి పరువెత్తి పోయెను. కావున సొంతపురుషకార మున్నను దైవబలము లేకున్న ఫలింపదు. దైవముముందఱ పౌరుష మెందుకును పనికి రాదు. కనుక దైవమే ప్రధానము.

పౌరుషము నిష్ఫలమైన దనినా,

"ఉద్యోగినం పురుషసింహ ముపైతి లక్ష్మీ

దైవం ప్రధాన మితి కాపురుషా వదన్తి,
దైవం నిహత్య కురు పౌరుష మాత్మశక్త్యా
యత్నే కృతే యది న సిద్ధ్యతి కోఽత్ర దోషః."
అను పెద్దలవచనమును పరిశీలించునది.

సాభిప్రాయవిశేషణము లుండుటచే పరికరాలంకారము.

గురుఁడు - గురువు - ఉకారాంతంబగు మహత్తునకు ఢువర్ణకము బహుళముగా నగు.

లేఖుల్ - (బ. వ.) లేఖుఁడు (ఏ. వ) లేఖు ౦ - కంఠహస్తపాదములయందు మంచిరేఖలు గలవారు; లేదా, ధ్యానముకొఱకు పటాదులందు వ్రాయఁబడువారు; లేదా, ప్రాణుల శుభాశుభఫలమును వ్రాసెడువారు.

దిక్కు- (1) దిశ. (2) ప్రాపు, గతి, దారి.

పాశిపట్టు-పాశము+పట్టు - వృత్తియందు మువర్ణకమునకు లోపము. పట్టు=స్థానము, పాశము=దండు.

ద్విరదము - ద్వి=రెండు, రదము = కొమ్ములు, (దంతములు) కలది = ఏనుఁగు.

ఐరావతము-ఇరా=నీళ్లు, అదికలది "ఇరావతము"-సముద్రము. అందుఁ బుట్టినది ఐరావతము - చౌదంతి - నాల్గుదంతములుకల వెల్లయేనుఁగు.

మఖపుఁడు - మఖము=యజ్ఞము, దానిని పాలించువాఁడు మఖపుఁడు-ఇంద్రుఁడు.

అవ. నరుల వృద్ధిక్షయములకును, బంధమోక్షములకును దైవమే కారణము.

మ. అశనాపేక్షఁ గరండము న్గొఱికి డాయ న్మూషిక న్మింగి త
త్పిశితప్రాశనతృప్తమై యరిగె నెందే బెట్టెలో పాము తు

త్కృశత న్హాసి; సుఖాసుఖంబులకు నుర్వి న్దైవమే కారణం
బళధస్వచ్ఛమనోబ్జ శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 82

అళధస్వచ్ఛమనోబ్జ=అతిస్వచ్ఛమైన కమలమువంటిహృదయముకలవాఁడా, సురభి...స్పతీ, అశనాపేక్షన్ = తిండికోరికతో, కరండమున్ = (పామును పెట్టియున్న) పెట్టెను, కొఱికి, డాయన్=దగ్గఱకురాఁగా, పెట్టెలోపాము=పెట్టె లోపలనున్న పాము, (అవచ్చిన) మూషికన్=ఎలుకను, మింగి, తత్...ప్తము-తత్=దానియొక్క-పిశిత= మాంసమును-ప్రాశన = తినుటచేత - తృప్తము=తృప్తి పొందినట్టిది, ఐ=అయి, క్షుత్+కృశతన్=ఆఁకటివలన కలిగిన బక్కదనమును, పాసి=విడిచి (కోలుపోయిన బలమును మరల పొంది), ఎందేన్ = తనయిచ్ఛ వచ్చినచోటికి, అరిగెన్=వెళ్లెను. ఉర్విన్=భూమియందు, సుఖ అసుఖంబులకున్=సుఖదుఃఖములకు, దైవమే, కారణంబు.

ఒకానొకరాత్రి యొకయెలుక తిండికై యొకపెట్టెలోపలికి బొక్క చేసికొని దూరెను. అంతకుముందే అందొక పా ముండెను. అది ఆఁకలిచేత నింద్రియపాటవము దప్పి కృశించియుండెను. ఆయెలుక లోనికి ప్రవేశింపఁగానే పాము దానిని తిని, ఆయెలుక చేసినఁబొక్కగుండ బయటికి పాఱిపోయెను. ఈవృత్తాంతమువలన వృద్ధిక్షయములకుఁగాని బంధమోక్షములకుఁగాని దైవమే గొప్పకారణ మని యెంచి జనులు సంకటములు కలిగినపుడు తహతహ పడక నెమ్మదిగా నుండఁదగును.

పెట్టెలోపాము = పెట్టెలో నున్న పాము.

అవ. దైవమును నమ్మినవానికిని నమ్మనివానికినిఁ గలుగుదశలు.

మ పడియాళుక్రియ లేచుచెండుకరణి న్భంగంబుఁ బ్రాపించియున్
వడిమైఁగార్యము చక్కఁబెట్టుకొనువిద్వాంసుండుమృత్పిండమ
ట్లడఁగు న్దాని యపండితుండు పతితుం డై లేవఁగాఁ డేఁడు త
ల్లడపా టొందుచు ధాత్రిలో సురభిమల్లా నీతివాచస్పతీ. 83

సురభి...స్ఫతీ, ధాత్రిలోన్ = భూమియందు, విద్వాంసుండు, భంగంబులన్=(కారణాంతరములచేత) హానిని (చెఱుపును), ప్రాపించియున్ = పొందినను గూడ, పడి=నేలమీఁదపడి, ఆశుక్రియన్ = వేగముగా, లేచు=పైకి ఎగసెడు, చెండుకరణిన్ = బంతివలె, వడిమైన్ = వేగముతో, కార్యము= పనిని, చక్కఁబెట్టుకొనున్ = సరిచేసికొనును (ఆచెఱుపును దాఁటి పూర్వస్థితికి వచ్చును అనుట), అపండితుఁడు, పలితుండు ఐ=నీచదశను పొందినవాఁడై, మృత్పిండము+అట్లు = మట్టిముద్దవలె, తల్లడపాటు+ఒందుచున్ = కలత నొందుచు, అడఁగున్ కాని=అణఁగిపోవునే కాని, లేవఁగాన్ లేఁడు (పూర్వస్థితికి రాఁజాలఁడు).

సజ్జనుఁడు హీనస్థితి నందెనా, క్రిందఁ బడినచెండు మరల పైకి లేచునట్లు వెంటనే మరల ఉన్నతదశకు వచ్చును; దుర్జనుఁడు గనుక హీనస్థితి నందెనా, క్రిందఁబడిన మట్టిముద్ద యట్లే అణఁగియుండునట్లు మరల మంచిదశకు రాలేక అట్లే పడియుండును. ఉపమాలంకారము.

తల్లడము+పాటు - పడ్వాదులు పర మగుచో మువర్ణకమునకు లోప పూర్ణబిందువులు విభాషనగు. పడు, పాటు, పట్టు, పెట్టు, పఱచు మొదలగు నవి పడ్వాదులు - తల్లడపాటు.

అవ. దైవబలములేనివాని కెక్కడను సుఖము గలుగదు.

శా. ఎండన్ నెత్తి తపింప బట్టతలవాఁ డెందే నిలన్ నీడఁ గూ
ర్చుండన్ దాళకుజంబు క్రింది కరుగన్ బ్రోత్కంపమై దానియ
ప్పం డవ్వేళనె తెప్పున న్బయిఁ బడె న్బ్రాణంబు వోఁ; దుర్దశ
ల్దండం బాయునె డాగిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. 84

సురభి...స్పతీ, బట్టతలవాఁడు, ఎండన్ = ఎండచేత, నెత్తి = తల తపింపన్ = కాఁపఁబడఁగా ఇలన్=భూమిమీఁద, ఎందేన్ = ఏతావునైనను, నీడన్=నీడయందు, కూర్చుండన్=కూర్చుండుటకై, తాళకుజంబు క్రిందికిన్=

తాటిచెట్టుక్రిందికి, అరుగన్ = పోఁగా. ప్రోత్కంపమైన్ = మిక్కిలి కంపిం చుటచేత, దాని+ఆ+పండు=ఆచెట్టులోనిపండు (ఆ-ప్రసిద్ధార్థకము), అవ్వే ళనె=ఆ+వేళనె = ఆసమయాననే, తెప్పునన్ = శీఘ్రముగా (తటాలున), ప్రాణంబు+పోన్ =ప్రాణముపోవునట్లుగా, పయిన్ =తలమీఁద, పడెన్, దుర్ద శల్ =ఇడుములు, డాఁగినన్ = దాఁగుకొన్నను, దండన్ = సమీపమును, పాయునే=విడుచునా? (విడువ దనుట).

బట్టతలవాఁడొకఁడు ఎండచే నెత్తి కాలి, తాళ లేక నీడగల ప్రదేశమును కోరి వానిదౌర్భాగ్యముచే దగ్గఱనుండిన తాటిచెట్టుక్రిందికిఁ బోయెను. వాఁడు పోయి నిలిచెనో లేదో, దైవికముగ నాచెట్టునుండి యొకపండు వానితలమీఁదఁ బడెను. అంత తల బల్లున బ్రద్దలయ్యెను. తఱచుగా అదృష్టహీనుఁడు ఎచటికిఁ బోయినను అచటికే ఆపదలును తఱుముకొనిపోవును. దైవబలములేనివాని కెచ్చటను సుఖము కలుగదు.

'బట్టతలవాఁడు' - స్వభావసిద్ధముగనే తలవెండ్రుకలు మొలవనివాఁడు. "తాటిచెట్టు"ను జెప్పుట నీడ మృగ్య మనుటకు.

దోమలకు భయపడి గ్రామమువదలి అడవులకేఁగఁగా నచట పులినోటఁ బడుటవంటిది యిది. అర్థాంతరన్యాసాలంకారము.

కు+జము=భూమినుండి మొలచినట్టిది-చెట్టు.

ప్ర+ఉత్+కంపము=ప్రోత్కంపము. మిక్కిలి కంపము.

దానియప్పండు=దాని+ఆ+పండు - ఒక్కొకచో సమాసగతపూర్వ పదము వ్యవహితోత్తరపద మొంటితోడను వాని వెక్కంటితోడను అన్వ యించెడి.

అవ. దైవమే బలియము.

మ. రవిశీతాంశుల కావిధుంతుదునిచే నారళ్లు గన్న, న్భుజం
గవిహంగద్విరదేంద్ర బంధనవిధు ల్గన్గొన్న, విద్వజ్జనుల్

భువిలో యాచకులై చరించెడివిధంబు ల్చూడ, దైవంబె చా
ల వరిష్ఠం బని తోఁచెడి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 85

సురభి...స్పతీ, భువిలోన్ = భూమియందు, రవి+శీతాంశులకున్ = సూర్యచంద్రులకు. ఆ+విధుంతుదునిచేన్ = రాహుగ్రహముచేత, (కలుగు), ఆరట్లు=పీడలు, కన్నన్ = చూచినను, భుజంగ+విహంగ+ద్విరదేంద్ర+బంధనవిధుల్ = పాములు పక్షులు ఏనుఁగులు వీనికి కట్టును, కన్గొన్నన్ = చూచినను, విద్వజ్జనుల్ = బుద్ధిమంతులు, యాచకులు ఐ=(పేదఱికముచే) బిచ్చమెత్తుకొనువారై, చరించెడివిధంబుల్ = సంచరించునట్టిరీతులను, చూడన్ = చూడఁగా, దైవంబె=దైవ మొక్కటే, వరిష్ఠంబు = అన్నిటికన్నను వరమైనది, అని, తోఁచెడిన్=తోఁచును.

బంధించుటకు శక్యముకాని పాములు, పక్షులు, ఏనుఁగులు కట్టు పడుటయును, జగములను ప్రకాశింపఁజేయు సూర్యచంద్రులు రాహువుబారిని పడుటయును, బుద్ధిమంతులు పేదలై యాచించుటయును చూడఁగా, అన్నిటికన్న దైవమే బలాఢ్య మని తోఁచును. దైవమే అన్నిటికిని మూలము.

శీత+అంశువు - చల్లనికిరణములు గలవాఁడు - చంద్రుఁడు,

విధుంతుదుఁడు - విధువు=చంద్రుఁడు, వానిని తుదతి = వ్యథఁబెట్టు వాఁడు, విధుంతుదుఁడు=రాహువు.

భుజంగము-భుజం=కుటిలముగా, గమ్=పోవునట్టిది భుజంగము-పాము.

విహంగము - విహాయసమందు = ఆకాశమందు. గమ్ = పోవునట్టిది. విహంగము. రూ. విహంగమము.

ఆరడి (ఏ. వ.) ఆరట్లు - (బ. వ.); రూ. అఱడి.

ఆరడి+లు=ఆరడులు, డి - మీఁది ఇకారమునకు, ఉకారాదేశము. తర్వాత 'డులు'-నకు ట్లువర్ణాదేశము.

వరము (నిజ.) వరీయము (తర.) వరిష్ఠము (తమ.)

కనినన్ = కన్న
కన్గొనినన్ = కన్గొన్నన్ } చూ. 77 ప. పద్యమ్.

కను+కొను = కన్+కొను = కన్+గొను=కన్గొను. శబ్దపల్లవక్రియ.

అర్థాంతరన్యాసాలంకారము; కావ్యలింగము.

తొలి మూఁడుపాదములును నాలవపాదమునకు హేతువుగా నుడువఁబడినవి కావున కావ్యలింగాకారము.

అవ. గుణవంతుల నల్పాయువులనుగాఁ జేయుట బ్రహ్మయొక్క మూఢత్వము.

మ. మహికిన్ భూషణమై మహత్త్వములకున్ బట్టౌనరశ్రేష్ఠునిన్
మహిఁ నిర్మించి యనంత కాలము మనన్గానీఁడు లోకేశ్వరుం;
డిహిహీ! యంతకు నీతిపెంపొసఁగఁగా నేలా వృథాగాక? బా
లహరిద్వాహసముద్యుతీ సురభిమల్లా నీతివాచస్పతీ. 86

బాలహరిద్వాహసమద్యుతీ = బాలసూర్యునితో సమానమైనకాంతిగలవాఁడా, సురభి...స్పతీ, లోకేశ్వరుండు = బ్రహ్మ, మహికిన్ = భూమికి, భూషణము ఐ=అలంకారమై, మహత్త్వములకున్=గొప్పగుణములకు, పట్టు+ఔ=ఆకరమగు, నరశ్రేష్ఠునిన్ = పురుషరత్నమును, మహిన్=భూమియందు, నిర్మించి=సృజించి, అనంతకాలము = చిరకాలము, మనన్ కాన్+ఈఁడు= జీవించియుండనీయఁడు. ఇహిహీ = ఇసీ, అంతకున్ = ఆమేరకు, నీతిపెంపు= (అటువంటిసృష్టికి) నడకపెంపును, ఒసఁగఁగాన్=ఇచ్చుట, ఏలా=ఎందులకు?

బ్రహ్మ సకలగుణసంపన్నుఁడును, భూమికి అలంకారభూతుఁడును అగు పురుషశ్రేష్ఠుని నిర్మించుట మంచిపనియే యైనను, అట్టివాని నల్పాయువును చేయుటమాత్రము మిక్కిలి శోచనీయము. కావున నట్టిసృష్టిని కొనసాగించుట నిష్ప్రయోజనమే యగును. అది బ్రహ్మకు తెలివిలేమియే యనఁదగు ననుట తాత్పర్యము.

హారిద్వాహుఁడు-హారిద్వర్ణము (పచ్చనికాంతి) గల గుఱ్ఱములు వాహనముగాఁ గలవాఁడు సూర్యుఁడు.

ఈఁడు - ఇచ్చునకు సర్వంబునకు 'ఈ' యగు.

ఇచ్చు+అక్+ఁడు=ఈఁడు. రూ. ఈయఁడు.

అవ. ఎంతటివానికైనను పాడువిధి యలంఘ్యము.

మ. ఉరుతేజోనిధి హేళి చంద్రపరిభుక్తోన్ముక్త మైనట్టి యం
బరఖండంబె గ్రహించి వర్తిలుఁబగల్పద్మారియున్ రేయిఁ గ్ర
మ్మఱ నేతెంచి గ్రహించుఁదానదియె; యున్మాలిన్యమున్బాయ లే
రరయ న్వారలు సైతముక్ సురభిమల్లా నీతివాచస్పతీ. 87

సురభి ..స్పతీ, పగల్=పగటిపూట, ఉరుతేజోనిధి = అత్యధికమయిన కాంతికినిధియైన, హేళి = సూర్యుఁడు, చంద్రపరిభుక్తోన్ముక్తము - చంద్ర= చంద్రునిచేత-పరిభుక్త=చక్కఁగా అనుభవింపఁబడి-ఉన్ముక్తము = విడువఁబడినట్టిది, ఐనట్టి, అంబరఖండంబె = ఆకాశభాగమునే, గ్రహించి = కైకొని, వర్తిలుక్=సంచరించును; రేయిక్=రాత్రియందు, పద్మారియుక్=పద్మములకు వైరియగు చంద్రుఁడును, క్రమ్మఱక్=మరల, ఏతెంచి=వచ్చి, తాను, అదియె = దానినే (ఆయనుభవించివిడిచిన యంబరభాగమునే), గ్రహించుక్ = కైకొనును, అరయక్=విచారింపఁగా, వారలుసైతముక్ = ఆసూర్యచంద్రులు కూడ, ఉన్మాలిన్యముక్=అధికమగు మాలిన్యమును, పాయక్ లేరు=వదలిపెట్టఁజాలరు.

మహాప్రభావమునకు నిధి యగుసూర్యుఁడు ముందురాత్రి చంద్రుఁడు సంచరించిన యాకాశమార్గముననే మఱుదినము పగలు సంచరించును. అతఁ డస్తమించినతర్వాత మరల చంద్రుఁ డామార్గముననే సంచరించును. ఒకరు అనుభవించి విడిచినదానినే యింకొకరు మరల మరల ననుభవించుచున్నారు. ఈ యెంగిలి యనుభవము దైవబలమువలన నట్టిగొప్పవారిని సైతము వదలినది.

కాదుగదా? ఇఁక నితరులసంగతి చెప్పవలెనా? కావున నెంతవారికైనను పాడువిధి వదలదు అని తాత్పర్యము.

పగల్ - పగటియందు - కాలవాచకములకు మార్గవాచకములకు సప్తమ్యర్థమునఁ బ్రథమ బహుళముగా వచ్చును.

అంబరము = ఆకాశము, వస్త్రము.

ఉత్ + మాలిన్యము = ఉన్మాలిన్యము; తకారమునకు నకారాదేశము.

వారలు - వారు, వీరు - పదములపై మరల లు-ల వర్ణములు చేరుట యుఁగలదు. అపుడు వెనుకనున్న ఉకారము అకార మగును.

సైతము. రూ. సయితము (వి.) సహితము (ప్ర.)

అవ. దైవయోగము నెవరును దాఁటలే రనుటయే.

మ. క్షితిమృత్యుంజయసంశ్రితుండయిసముత్కృష్టామృతస్థానమై
సతతం బోషధినాథుఁడై శతభిషక్సంసేవ్యుఁడై యొప్పుచుం
డుతుషారాంశుని రాజయక్ష్మ విడ దెందుక్; దైవపాకం బన
ల్పతరం బెరికి శక్యమే సురభిమల్లా నీతివాచస్పతీ. ౭౭

సురభి...స్పతీ, క్షితిక్=భూమియందు, మృత్యుంజయసంశ్రితుండు= శివుని ఆశ్రయించినవాఁడు, అయి, సముత్కృష్ట+అమృతస్థానము = ఉత్తమోత్తమమైన అమృతమునకుఁ బ్రోఁకఅ, ఐ=అయి, సతతంబు = ఎల్లప్పుడును, ఓషధినాథుఁడు = (మందు) మొలకలకు దొర, ఐ = అయి, శతభిషక్ సంసేవ్యుఁడు - శత = నూఱులకు (నూఱులకొలఁదిరోగులకు) - భిషక్ = వైద్యులచే-సంసేవ్యుఁడు = సేవింపఁబడినవాఁడు (శతభిషజ్నక్షత్రముచే వెంబడింపఁబడినవాఁ డని వాస్తవికార్థము), ఒప్పుచుండు, తుషారాంశునిక్ = చంద్రుని, రాజయక్ష్మ=క్షయరోగము, విడదు = వదలదు; ఎందుక్ = ఎచ్చటను, దైవపాకంబు = దైవముయొక్క పరిణామము, అనల్పతరంబు = మిక్కిలిగొప్పది. ఎరికిక్ = ఎట్టివారికైనను, (ఆదైవమును దాఁటుట), శక్యమే = సాధ్యమగునా? (కా దనుట).

చంద్రుఁడు మృత్యువు నేజయించిన పరమశివుని శిరోభూషణమై ఆయన నాశ్రయించియున్నాఁడు. ఇదియునుగాక సర్వశ్రేష్ఠ మగు అమృతమునకు స్థానమైనవాఁడు. సర్వరోగములను పరిహరింపఁదగు మూలికలకెల్ల దొర. ఎల్లప్పుడును నూర్గురువైద్యులు అతనివెంటనే యుందురు. అతఁడు స్వయముగా చల్లనికిరణములు గలవాఁడు. ఇంతయుండియు నాతనిని క్షయరోగము వదలక పీడించుచున్నది. దీనినంతను చూడఁగా పాడుదైవముయొక్క పరిణామము నెంతటివారును తప్పించుకొన సమర్థులు కా రనుట తెల్లమగుచున్నది.

మృత్యుంజయుఁడు: మార్కండేయుని రక్షించునిమిత్తము మృత్యువును జయించినవాఁడు అనియేనియుఁ, స్వయము మరణము లేనివాఁ డనియేనియు. మృత్యుంజయసంశ్రితుఁడు—దక్షశాపమునకు భయపడి చంద్రుఁడు శివుని కడఁకేగి ప్రార్థింపఁగా, ఆయన యతనిపై జాలిగొని తనశిరమునం దుంచుకొనె నని గాథ.

ఓషధినాథుఁడు—(చూ. ప. 35). ఓషధి అనఁగా 1. మూలిక. 2. ఫలము పక్వమైనంతనే యెండిపోవు వరిమొదలగునది. వానిని బ్రతికించు వాఁడు చంద్రుఁడు. తఱుచుగా వెన్నెలబలమున మొక్కలు ఓషధులు అభి వృద్ధిచెందును గనుక చంద్రుని ఓషధినాథుఁ డనుట.

ఇంతకన్న నిట్లనుట సరిపోలునేమో ?

ఓషధీనాథము సోమలత; దీనిరసమునే సోమయాగమున ప్రాచీన ఋషులు వినియోగించుచుండిరి. లతానామమైన సోమశబ్దమునకును, చంద్ర పర్యాయమైన సోమశబ్దమునకును భ్రమవలన సాంకర్యమేర్పడి లతాపరక సోమశబ్దమును తత్పర్యాయములును చంద్రునకుసైతము వాచక మయ్యెను.

శతభిషక్—1. శత=నూఱు, భిషక్=వైద్యులు - నూర్గురువైద్యులు, 2. తారామండలములో నిరువదినాల్గవదగు శతభిషమనెడి నక్షత్రరాశి. ఇందు నూఱునక్షత్రములు కలవు.

రాజయక్ష్మ-(1) చంద్రునకేర్పడిన క్షయరోగము. (2) క్షయరోగ సామాన్యము. "అనేకరోగముల ననుగమించునదియు, బహురోగములకు ముందు వచ్చునదియు గనుక, నిది రోగముల కన్నిటికిని రాజు గాన నీపేరు" అని వాగ్భటుఁడు. "చంద్రుఁడు దక్షప్రజాపతిపుత్రికల నిరువదేడ్గురను వివాహమాడియు, వారిలో రోహిణియందుమాత్ర మత్యంతానురాగము పూని యుండెను. అపక్షపాతమునకై కినిసి దక్షుఁ డాతనిని నిరంతర క్షయరోగి యగునట్లు శపించెను కాని కుమార్తెలెల్లరును తమభర్త ననుగ్రహింపవలసిన దని తండ్రిని ప్రార్థింపఁగా వారివేడికోలున కంగీకరించి యతఁ డతని కాక్షయము నియతకాలిక మగున ట్లనుగ్రహించెను" అనునది పురాణకథ.

అల్పము=కొంచెము, న+అల్పము=అనల్పము = కొంచెముకానిది-గొప్పదైనది.

అవ. దైవము గొప్పవారి కెన్నియాపదలు కలిగించినను వారి కెప్పుడును ధైర్యముపోదు అనుచున్నాఁడు.

మ. అమలజ్ఞానుని వెఱ్ఱిదైవము వృథాయాసంబుచేఁ జిత్తదో
షము పొందించుట కాపద ల్సలిపిన న్సల్పంగనీ, కల్పనా
శమునం దేని కలంగునా యతఁడు నిస్సారంబు లౌస ప్తశై
లములు న్వారిధులుం బలేఁ సురభిమల్లా నీతివాచస్పతీ. 89

సురభి...స్పతీ, వెఱ్ఱిదైవము = మూఢదైవము అమలజ్ఞానునిన్ = నిర్మలమైనజ్ఞానముతోఁ గూడినవానిని (గొప్పవానిని), వృథా+ఆయాసంబుచేన్ = వట్టిశ్రమచేత, చిత్తదోషము = అధైర్యమును, పొందించుటకున్ = పొందునట్లుచేయుటకై, ఆపదల్ = ఇడుములను, సలిపినన్ = చేసినను, సల్పంగనీ = చేయనిమ్ము. అతఁడు = ఆమహాత్ముఁడు, కల్పనాశమునం దేని=కల్పాంతమందైనను (ప్రళయమందైనను), నిస్సారంబులు+ఔ=సారము

లేనట్టి, సప్తశైలములున్ + వారిధులున్ బలెన్ = ఏడుకులపర్వతములవలెను, ఏడుసముద్రములవలెను, కలంగునా = దైన్యముచెందునా? (చెందఁ డనుట).

వెఱ్ఱిదైవము మహాత్ములను పరీక్షింపఁ గోరి వారిధైర్యమును నాశము చేయుటకై వారి నెన్నో యిడుములపాలు కావించుచుండుట తెలివిమాలినపని. సప్తకులపర్వతములును సప్తసముద్రములునైనను ప్రళయకాలమున తమ మేరలు మీఱి నడచుకొనుచే మోగాని మహాత్ములుమాత్రము అప్పటికిని తమధైర్యమును పట్టువదలరు.

గాంభీర్యస్థైర్యాదులందు మహాత్ములకును సముద్రకులపర్వతములకును సామ్యముఁ జెప్పుట కవులయందు సామాన్యముగాఁ జూపట్టుచున్నది. ఈ పర్వతసముద్రముల దృష్టాంతముచేత ధీరులధైర్యధ్వంసనము అత్యంతదుష్కర మనియు, అటు చేయ నెంచుట వృథాయాసహేతు వనియుఁ సూచితము.

కులపర్వతములు:

"మహేంద్రో, మలయ, స్సహ్య. స్శుక్తిమా, నృక్షపర్వతః
విన్ధ్యశ్చ, పారియాత్రశ్చ. సప్తైతే కులపర్వతాః".

సప్తసముద్రములు:

"లవణ, ఇక్షు, సురా, సర్పి, దధి, క్షీర జలార్ణవాః."

అమలజ్ఞానుఁడు - నిర్మలమైనజ్ఞానముగలవాఁడు - జ్ఞానమువలన మనః పారిశుద్ధ్యమును, తన్మూలమున స్థైర్యమును సిద్ధించును.

సల్వంగనీ—చూ. 74 ప.

శైలము—శిలాసంబంధమైనది - పర్వతము.- ఋ.

వారిధి - వారికి నిధియైనది వారిధి - సముద్రము.

అవ. అన్నిటికిని దైవమే శరణము.

మ. ప్రభు వౌదైవము మేర చేసినది దప్పం బాఱి హెచ్చబ్బునే
విభవం బాఢ్యులఁ జేరినంతటనె? ప్రావృడ్వారిదం బెల్లచోఁ
నభివర్షింపఁగఁ జాతకంబునకు నాల్గైదంబుబిందు ల్గదా
లభియించు న్మొగ మెత్తిన న్సురభిమల్లా నీతివాచస్పతీ. ౧౦

సురభి...స్పతీ, ఆఢ్యులన్ = గొప్పవారిని, చేరినంతటనె = ఆశ్రయింపఁగానే, ప్రభువు = సమర్థము, ఔ = అయిన, దైవము, మేరచేసినది= ఏర్పాటుకావించినది, తప్పన్ పాఱి = తొల్గయి (అతిక్రమించి), విభవంబు= ధనము, హెచ్చు = అధికము, అబ్బునే=దొరకునా? ప్రావృడ్వారిదంబు— ప్రావృట్ = వర్షాకాలమందలి - వారిదంబు = మేఘము, ఎల్లచోన్ = అన్ని చోట్లను, అభివర్షింపఁగన్ =నిండుగ వానకురియుచున్నను, చాతకంబునకున్ = వానకోయిలకు, మొగము+ఎత్తినన్ = నోరు తెఱచిన, నాల్గు+ఐదు+అంబుబిందుల్ కదా=నాలుగో అయిదో నీటిబొట్లుమాత్రమేకదా, లభియించున్ = దొరకును.

సమర్థమగుదైవము ఎవని కెంత యనినిర్ణయించునో వాని కది తనంతటనే దొరకును. దీనికై యొకని నాశ్రయింప నక్కఱలేదు. ఒకవేళ ఆశ్రయించిన, వా రెంతగొప్పవా రయినను విధినిర్ణయమునకంటె హెచ్చు కలుగనే కలుగదు. ఎల్లదిక్కులను వ్యాపించి వర్షాకాలమున మేఘము ఎంతసమృద్ధిగా కురియుచున్నను మేఘు నాశ్రయించిన వానకోయిలకు తలయెత్తి నోరు తెఱవఁగా వానచినుకు లేనాలుగో అయిదోమాత్రమేగదా నోటబడును! అంతకంటె నెక్కువపడదు. కావున అన్నివిధముల దైవమే శరణము.

వారిదము - వారి = జలమును, ద = ఇచ్చునట్టిది - మేఘము.

నాల్గైదు - బహువ్రీహి.

# కర్మ పద్ధతి

సర్వము దైవాధీన మని దైవపద్ధతిని ముగించినపిదప ఆదైవము సైతము కర్మాధీనముగనే యున్న దని నిరూపించుచు దైవముకన్నను కర్మయే గొప్పదను చున్నాఁడు.

అవ. కర్మ బలీయ మని వర్ణించుచున్నాఁడు.

మ. విధిచేఁ గాని సురల్ తమంతనె ఫలావిష్కారకుల్ గారు; త
ద్విధి యన్నన్ నియతక్రియాఫలద. మూర్విన్ దత్ఫలం బన్నఁ గ
ర్మధురాయత్తమిటౌటఁ జేసి భజనార్హంబౌచుఁ గర్మంబెయ
త్యధికంబై ప్రవిభాసిలున్ సురభిమల్లా నీతివాచస్పతీ. 91

సురభి...స్పతీ, సురలు = ఇంద్రాదివేల్పులు, విధిచేన్ గాని=దైవము చేతనేగాని, తమంతనె = స్వయముగా, ఫల+ఆవిష్కారకుల్ = ఫలమును వెలయించువారు (ఫలము నిచ్చువారు), కారు; తత్ విధి+అన్నన్ = ఆదైవ మన్ననో, నియతక్రియాఫలదము - నియత = నిర్ణయింపఁబడిన - క్రియా = జ్యోతిష్టోమము, తపము, దానము మొదలగు కర్మములయొక్క, ఫలదము = ఫలమును ఇచ్చునది, (అగును), ఉర్విన్ = భూమియందు, తత్+ఫలంబు+ అన్నన్=ఆఫల మన్ననో, కర్మధురాయత్తము=కర్మభారమునకు అధీనమైనది, ఇటు, ఔటన్+చేసి = అగుటచేత, కర్మంబె = ఆకర్మమె, భజనార్హంబు+ ఔచున్ = పూజింపఁదగిన దై, అత్యధికంబు+ఐ = మిక్కిలిగా, ప్రవిభా సిలున్ = ప్రకాశించును.

వేల్పులను భజింతమా యనిన వారు ఫలము నీయ స్వతంత్రులు గారు: వారును మనవలెనే విధికి వశమైనవారే. అట్లయిన విధిని భజింతమా యన్న ఆవిధియుం ఆయాకర్మకనుకూల మగు ఫలమునిచ్చునే గాని స్వతంత్రముగా నీయఁ జాలదు. మఱి ఫల మన్ననో కర్మాధీనము. కావున వేల్పులకుఁగాని, విధికిఁగాని

మ్రొక్కుట యెందుకు? విధిస్సైతము దేనిని దాటఁజాలదో అకర్మకే మ్రొక్కు దము. కనుక మంచిఫలముకొఱకై మంచిపనులు చేసికొనవలసిన దని దీనిభావము.

పూర్వపూర్వమునకు ఉత్తరోత్తరము ప్రత్యుత్కర్ష మనుటచే మాలా దీపకాలంకారము. దీనినే సారాలంకార మని కావ్యప్రకాశము పేర్కొను చున్నది. కొటఁజేసి—జడవాచకముల ద్వితీయాదిరూపములమీఁద 'చేతన్' విభక్తి యర్థమున 'చేసి' వచ్చుటయుఁ గలదు.

అతి+అధికము = అత్యధికము. ప్ర+వి+భాసిలు = ప్రవిభాసిలు.

ప్ర, వి, అతి—అనునుపసర్గలు భృశార్థకములు.

అవ. కర్మయొక్క సకలనియంతృత్వము.

మ. అజు బ్రహ్మాండఘటాళి సల్పు ఘటికా రాచార్యుఁ జేసె; న్వృష
ధ్వజు భిక్షాటనుఁ జేసె;సూర్యు భ్రమణవ్యాసంగిగాఁ జేసె; నం
బుజనాభున్ వివిధావతారతరళాత్ము న్జేసె; నక్కర్మ మె
ల్లజనశ్రేణి కలంఘ్య మౌ సురభిమల్లా నీతివాచస్పతీ. 92

సురభి...స్పతీ, (ఏకర్మము), అజున్=బ్రహ్మను, బ్రహ్మాండఘటాళిన్- బ్రహ్మాండ+ఘట = బ్రహ్మాండము లనెడు కుండలయొక్క - ఆళిన్=వరుసను, సల్పన్ = చేయుంటకు, ఘటికార+ఆచార్యున్ = కుమ్మరుల కాచార్యునిగా, చేసెన్ = చేసెనో, వృషధ్వజున్ = వృషభమును ధ్వజముగాఁ గలిగిన శివుని, (మృత్యువును జయించినవాఁడైనను అనుట), భిక్షాటనున్=బిచ్చ మెత్తుకొనుచు తిరుగువానినిగా, చేసెన్, సూర్యున్=(సకలలోకప్రకాశకుఁడగు) సూర్యుని, భ్రమణ వ్యాసంగి కాన్ = (ఒక నిమిషమైన విశ్రాంతి లేక) తిరుగుటయందు మిక్కిలి ఆసక్తికలవాఁడు అగునట్లు, చేసెన్, అంబుజనాభున్ = (తామర నాభియందుకలవాఁడును, కుక్షియందు అఖిలభువనములు కలవాఁడును అగు) విష్ణుమూర్తిని, వివిధావ...త్మున్ - వివిధ = పలువిధములైన - అవతార = అవతారములచే - తరళ = ప్రకాశించు - ఆత్మున్ = శరీరము కలవానినిగా

"మత్స్యః కూర్మో వరాహ శ్చ నరసింహోఽథ వామనః,
రామో రామశ్చ కృష్ణశ్చ బుద్ధః కల్కీచ తే దశ"

విష్ణువునకు అవతారబాధ కలుగునట్లు భృగు దూర్వాసుల శాపము కల దని యోగవాసిష్ఠరామాయణమునను మత్స్యపురాణమునను కలదు.

అవ. సకలనియామక మగుటవలనను, సకలశ్రేయములకు నిధానమగుటచేతను సత్కర్మాచరణ మత్యావశ్యక మని పద్యద్వయముచే ఉపదేశించుచున్నాఁడు.

మ. ఘను నత్యల్పునిగా, వివేకి జడునింగాఁ, జెంత దూరంబుగాఁ,
ననవద్యామృతము న్విషంబుగ, సఖు న్ప్రాణాపహుంగా,నొన
ర్చు నహో కర్మము! దానిమానిమరిదుర్బుద్ధు ల్గుణౌఘోపలా
లనము న్గోరుదు రేలొకో సురభిమల్లా నీతివాచస్పతీ. 93

సురభి...స్పతీ, కర్మము = సత్కర్మమనుదేవత, ఘనున్ = గొప్ప వానిని, అత్యల్పునిగాన్ = మిక్కిలి నీచునిగాను, వివేకిన్ = బుద్ధిమంతుని (విద్వాంసుని), జడునిన్ కాన్ = బుద్ధిలేనివానినిగాను (మూర్ఖునిగాను), చెంతన్ = సమీపమును, దూరంబుగాన్, అనవద్య+అమృతమున్ = ఉత్తమోత్తమమైన అమృతమును, విషంబుగన్, సఖున్ = స్నేహితుని, ప్రాణాపహుంగాన్ = ప్రాణమును అపహరించువానినిగాను, ఒనర్చును = చేయును (మార్చును), అహో = ఆశ్చర్యము. దానిన్ = (అట్టి సర్వశక్తిమంత మగు) కర్మమును, మాని, మరి, దుర్బుద్ధులు = చెడబుద్ధికలవారు. గుణౌఘోపలాల నమున్-గుణ = రజస్తమాదిగుణములయొక్క - ఓఘ = సమూహముయొక్క - ఉపలాలనమున్ = బుజ్జగింపును, (రజస్తమోగుణాత్మకము లగు నర్థములను), ఏలొకో కోరుదురు = ఏకారణముచేతనో కోరుచున్నారు. (గుణములు క్లేశ కరములైన ఫలముల నిచ్చునవి యైనను వానినే కోరుదురు.)

సత్కర్మము సుజనులను దుర్జనులుగాను, విద్వాంసుని మూర్ఖునిగాను, చెంతను దూరముగాను, అమృతమును విషముగాను, స్నేహితుని శత్రువుగాను ఒనర్చుశక్తికలది. కోరినకోర్కులను అనుభవింపఁ దలఁచువాఁడు దుఃఖమయము

-లగు రాజసతామసకృత్యముల నాశ్రయింపక సత్కర్మమునే ఆశ్రయింప వలయును.

అశక్యమును శక్యము చేయఁగలుగు ననుటచే విశేషాలంకారము.

అపహము = చెఱచునట్టిది.

ప్రాణాపహుఁడు - ప్రాణమును చెఱచునట్టివాఁడు - చంపునట్టిశత్రువు.

గుణ + ఓఘ = గుణౌఘ - వృద్ధిసంధి - అ, ఓల-కు రెంటికిని ఔ - ఆదేశము.

ఓఘ + ఉపలాలనము = ఓఘోపలాలనము - గుణసంధి. అ, ఉ-లకు ఓ - ఆదేశము.

అవ. సంపదాపదలు శుభాశుభకర్మాయత్తములు గావున ఆదే సత్కర్మా-చరణోపదేశము.

మ. శుభకర్మంబు కలంతసేపు దయిత ల్శుద్ధాంతము ల్ఛత్రముల్
సుభటౌఘుంబ; బది దీఱిన న్సకలము న్సూత్రంబు విచ్ఛిన్న మై
న భువి న్జెందినము త్తియంబులగతి న్నానావిధం బౌను వ
ల్లభతారంజితభూజనా సురభిమల్లా నీతివాచస్పతీ. 94

వల్లభతారంజితభూజనా - వల్లభతా = స్వపరిపాలనముచేత - రంజిత= సంతోషపెట్టఁబడిన - భూజనా = ప్రజలుగలవాఁడా, సురభి...స్పతీ, శుభకర్మంబు=మంచికర్మము (దానివలన కలుగు అదృష్ట మనుట), కలంతసేపున్ = ఎంతకాలము ఉండునో అంతకాలమును, (ఎంతకాలముకూడ వచ్చుచుండునో అంతకాలము), దయితల్ = ప్రియురాండ్రు, శుద్ధాంతముల్ = పరిశుద్ధములైన అంతఃపురములును, ఛత్రముల్ =(తెల్ల) గొడుగులు (రాజచిహ్నములు) సుభట+ఓఘుంబు = మంచిభటుల సమూహమును, (అనునవి యుండును), అది= అశుభకర్మము, తీఱినన్ = వ్యయము కాఁగా, సకలమున్ = ప్రియురాండ్రు, అంతఃపురము, గొడుగు అనునవి యెల్ల, సూత్రంబు = దారము, విచ్ఛిన్నము

ఐనన్ = పెరుగఁగా, భువిన్ = నేలను, చెందిన = పొందిన (నేలమీఁద పడిన), ముత్తియంబులగతిన్=ముత్యముల (విధమున) వలె, నానావిధంబుల= నలుదిక్కుల చెదరినట్టిది, ఔను=అగును.

పురాకృతపుణ్య మున్నంతవఱకును, ప్రియురాండ్రు, మేలయిన యంతః పురములు, తెల్లగొడుగుతోఁగూడిన ప్రభుత్వము, వీరు లగుభటసేన అనునవి మనుష్యుఁడు అనుభవింపఁగల్గును. ఆపుణ్యము ముగియఁగానే అని యన్నియుం పెరిగిపోయిన ముత్యాలపేరులోని ముత్యములవలె నలుదిక్కుల చెదరి మాయ మగును.

శుద్ధాంతము = పరిశుద్ధులై నరక్షకులు సమీపమందుఁ గలిగినది, రక్షింపఁ బడిన ప్రాంతములం కలది. రాచనగరు, నగరిలో స్త్రీలుండుగృహము.

కల+అంత-కలంత = అంతపరిమాణార్థకము - కనుక సంధినిత్యము.

ఛత్త్రముల్ =(ప్రకరణబలముచే) తెల్లగొడుగు అనియర్థము. అది రాజచిహ్నము. కాన దొరతన మని భావము.

ముత్తియము—ఇయకుమాఱుగా సామాంతమున కెత్వము బహుళముగా నగు - ముత్తియశబ్దమునందుమాత్రము ఇత్వలోపము కానఁబడియెడి - ముత్తి యము - ముత్తెము - ముత్యము. ఉపమాలంకారము.

అవ. ఏపనిచేసినను దానిపర్యవసానమును ముందు ఆలోచించుకొని చేయవలెనుగాని తొందరపడరాదు అనుట.

మ. అగుణంబైని గుణాఢ్యమైని యొకకార్యం బెద్ది యైన న్మదిన్
ముగియన్ యోచనఁజేసిపూనఁగఁదగు, న్మాపన్క్రియాత్పాదితం
బగునేనిన్ గడగండ్లు గాక యధికం బౌచిత్తశల్యం బగున్
లగదత్యుజ్జ్వలసద్గుణా సురభిమల్లా నీతివాచస్పతీ. 95

లగదత్యుజ్జ్వలసద్గుణా - లగత్ = స్థిరపడిన-అతి+ఉజ్జ్వల = మిక్కిలి ప్రకాశవంతమైన - సద్గుణా = మంచిగుణములుకలవాఁడా, (సహజమగు సద్గు

ణములచే ప్రకాశించువాఁడా), సురభి...స్పతీ, అగుణంబేనిక్ = చెడ్డది గాని, గుణాఢ్యమేనిక్ = మంచిదిగాని, ఎద్దియైనక్ ఒకకార్యంబు=ఏదైనను ఒకపనిని, మదిక్ = మనస్సునందు, మునియక్=పూర్తిగా, యోచనక్ చేసి = ఆలోచించి, పూనఁగక్ తగుక్ = ప్రయత్నించుట తగియుండును. పూన్కి= కార్యారంభముచేయుట, రయ+ఉత్పాదితంబు=మిక్కిలి తొందరకలిగినట్టిది, అగునేనిక్=అయినయెడల, కడగండ్లు=కష్టములు, కాక=తప్ప, (కష్టములతో పాటు), అధికంబు+ఔ=మిక్కిలియైన, చిత్తశల్యము=హృదయమునకు ములికి అగును (మనోవేదన పుట్టించి బాధించును అనుట).

ఎవఁడుగాని మంచిదో చెడ్డదో యొకపనిని చేయ నెంచిన ముందుగా దానిపర్యవసానమును దీర్ఘముగా ఆలోచించుకొనవలయును. అట్లుకాక తొందరపడి యాకార్యము నారంభించిన నది కడగండ్లపాలుగావించుటేగాక యావజ్జీవము హృదయమున గుచ్చుకొన్న బాణపుములికివలె బాధించుచుండును. కావున సావధానముగ విమర్శించినతరువాతనే యేకార్యమునుగాని పూనుకొనఁదగును; అట్లుచేసిన చిత్తమునకు సమాధానము కలుగును.

కడగండ్లు - నిత్యబహువచనము. (కడ+కండ్లు.)

కండు=విపత్తు-కండ్లు=విపత్తులు. కడగండ్లు = మరణముదనుక నుండువిపత్తులు-అగచాట్లు. కాక = వినార్థక మగు నవ్యయము.

మది (వి.) మతి (ప్ర.) పూన్కి-రూ. పూనికి-పూనుధాతువు కృదంత రూపము-"కోరు మొదలగువానికి 'ఇకి' వర్ణకమగును." విను, పోలు, మను, పూను మొదలగునవి కోర్వాదులు. ఉపమాలంకారము.

అవ. సత్కర్మము ననుష్ఠింపనివాఁడే మందభాగ్యుఁడు.

మ. ఘనసారంబునఁ గోద్రవావృతియొసంగ, న్రత్న భాండంబు చం
దనదారు ల్గొని తెల్కపిండి దగ వండం, బైఁడినాఁగంట దు
న్ని నెఱె న్ధూదికి నాట జిల్లెడులు, చింతించు న్మహిం బుట్టి పు
ణ్యనిరీహుం డగువాఁడు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 96

శ్రీసుర...స్పతీ, మహిన్ = (కర్మభూమియగు) ఈ దేశమున, పుట్టి, పుణ్యానిరీహుండు - పుణ్యా = (తపము మున్నగు) పుణ్యకార్యములయందు-నిరీహుండు = కోరికలేనివాఁడు, అగువాఁడు = అగునట్టిమనుజుఁడు, ఘనసారంబునన్ = కప్పురపు టరఁటితో, కోద్రవ+ఆవృతి = ఆరెవద్లచేనికి కంచెను, ఒసంగన్ = ఏర్పఱచుటకును, చందనదారుల్ = మంచిగంధపుచెక్కలను, రత్నభాండంబు = రత్నముతో చేయఁబడిన కుండను, కొని=తీసికొని, తెల్కపిండి = గానుగపిండిని, తగన్ = ఒప్పుగునట్లుగా, వండన్ = వండుటకును, వైఁడి నాఁగంటన్ = బంగారునాఁగేటితో, (నేలను), దున్ని, నెఱిన్=పూర్తిగా, దూదికిన్ = దూదికొఱకు, జిల్లేడులు = జిల్లేడుచెట్లను (జిల్లేడుదూది పట్టువలె మెత్తగ నుండును); నాటన్=నాటుటకును, చింతించున్ = ఆలోచించువాఁడగును.

ఈభరతఖండము శాస్త్రోచితకర్మలు చేయఁదగినభూమి అట్టిదానియందు జనించికూడ తపస్సు మొదలగు పుణ్యకార్యము లేపురుషుఁడు చేయఁడో వాఁడే భాగ్యహీనుఁడు, మూర్ఖుఁడుకూడ. ఎట్లన ఆరెవద్లచేనికి కప్పురపుటరఁటులను కంచెగా నిర్మించువాఁడును, తెలకపిండిని వండుకొనుటకు చందనపుకట్టెలను రత్నాలకుండను ఉపయోగించువాఁడును, జిల్లేడుదూదికోసము బంగరు నాఁగేటితో నేలను దున్నువాఁడును ఎట్టివా రగుదురో వారితో సమానుఁడగును. అనఁగా, ఉత్తమఫలసాధనమును నీచఫలసాధనమునకై వినియోగించుకొను మూర్ఖుఁ డగు నని భావము. కనుక అన్నివిధముల శ్రేయస్సునకు సత్కర్మానుష్ఠానమే తగినది.

భారతీయుఁల కీదేశము కర్మభూమి; చంద్రలోకస్వర్గలోకాదులు భోగభూములు. ఇచట పుణ్యకార్యము లొనర్చువారికి స్వర్గాదిలోకములు ప్రాప్తించుననియు, తత్ఫలానుభవ మచట ముగియఁగా వారు మరల పుణ్యకార్యాచరణనిమిత్త మీభూమియందు జనింతు రనియు శ్రుతులు నుడువును.

ఘనసారము=(1) కర్పూరము, (2) కర్పూరపుటనఁటి.

ఆవృతి=ఆవరణము=చుట్టుకొనియుండునది=కంచె, వెలుగు.

రత్నభాండము = రత్నములతో చేసిన కుండ - వజ్రవైడూర్యములతో సంబంధించినది.

దారుల్ : దారువుల్ - అనుశబ్దమున వువర్ణము లోపింపఁగా సిద్ధించిన రూపము. వువర్ణలోపము రాహు, బాహు శబ్దములలోవలె.

తెల్కపిండి=తెలక పిండి-ల మీఁది అకారము లోపింపఁగా తెల్కపిండి అగును. రూ. తెలికపిండి.

పైఁడి=బంగారము. రూ. పసుఁడి, పసిఁడి.

నాఁగంటన్ - నాఁగలి+టి+అన్ - నాఁగలి ఔపవిభక్తికము గావున తుదివర్ణమునకు 'టి' ఆదేశము; హ్రస్వముమీఁది టివర్ణమునకు బిందువువచ్చి నాఁ గంటి+అన్ అగును. తర్వాత అనుహాదర్థకము జడవాచకము గావున తృతీయా సప్తముల 'అన్' ఆదేశము. ఇట తృతీయార్థకము. రూ. నాఁగేలు, నాఁగెలు.

జిల్లెడు-రూ. జిల్లేడు.

పుణ్యానిరీహుఁ డెవఁడో వాఁడు ఘనసారంబున క్రోద్రవావృతి యొసంగును. ఇత్యాదివిశిష్టములగు ఒసఁగుట, వండుట, నాటుట అనువానిచేత నిర్దిష్టమైన వాక్యములయర్థ మసంభవము కావున అసంభవవస్తువుల సంబంధముచే మాలానిదర్శనాలంకారము. చూ. 5 ప. మూర్ఖపద్ధతి.

అవ. పుణ్యకర్మమే సర్వమునిచ్చును గావున దానినే గడింపవలయును.

శా. ప్రావీణ్యంబులరావు, బల్చదువులన్ రా,వన్వవాయంబులన్
రా, వుర్వీశ్వరనిత్యసేవకతన న్రా, వుజ్జ్వలాకారతన్
రా, వేనాఁట ఫలించు వృక్షముగతి న్సత్కర్మమైశ్వర్యముల్
తా వై నాఁటికిఁ జేకుఱు న్సురభిమల్లా నీతివాచస్పతీ. 97

సురభి...స్పతీ, ప్రావీణ్యంబులన్ = వివిధములగు విషయములుగల నేర్పరితనముచేత, (ఐశ్వర్యముల్ = సంపదలు), రావు = కలుగవు, బల్చదువులన్ = గొప్పచదువులచేతను, రావు, అన్వవాయంబులన్ = కులముచేతను,

రావు, ఉర్వీశ్వర నిత్యసేవకతనక్ - ఉర్వీశ్వర = రాజులయొక్క-నిత్య=ఎడ తెగని-సేవకతనక్=కొలువుచేతను, రావు, ఉజ్జ్వలాకారతక్=చక్కఁగా ప్రకాశించుచున్న ఆకారముచేత (చక్కఁదనముచేత)ను, రావు, సత్కర్మము=పుణ్యకర్మ, ఐశ్వర్యముల్=సంపదలయొక్క, తావు=స్థానము;ఐ=అయి, ఏనాఁటక్ = ఏయే సమయములందు ఫలింపవలయునో, నాఁటికిక్ = ఆయాసమయములందు, ఫలించు = ఫలమొసఁగునట్టి, (పరిపక్వసమయమందే అనుట), వృక్షము గతిక్=చెట్టువలె, చేకుఱుక్=సిద్ధించును.

పురుషునకు పలువిధముల నేర్పరితనము, గొప్పవిద్య, మంచికులము, ఎడతెగని రాజసేవ, సౌందర్యము అనునివి ఐశ్వర్యాదిఫలముల నీయఁజాలవు. దానిదాని ఋతువులో ఆయాచెట్టు ఫలించునట్లు, పూర్వముచేసికొన్న పుణ్యములు వానివానికాలము వచ్చినప్పుడు చక్కఁగా ఫలముల నిచ్చును.పురాకృత పుణ్యకర్మవిశేషమునకు వ్యతిరేకముగా ఫలము కలుగఁజాలదు. కావున సత్కర్మములనే చేయవలసినది అని భావము.

ఫలించుట యనుధర్మ మొక్కటిమాత్ర ముదాహరింపఁబడి యుండుటచే దీపకాలంకారము.

3, 4 పాదములలో ఉపమాలంకారము.

బల్-బలువు అను విశేషణమునకు వృత్తియందు అంత్యవర్ణము లోపింపఁగా బలు అగును. హల్లు పరమగుచో బలు-లోని ఉత్వమునకు వికల్పముగ లోప మగు. గతి - ఉపమావాచకము.

ఐశ్వర్యముల్ తావు-ఐశ్వర్యములయొక్క తావు. యొక్కశబ్దలోపము బహుళము.

అవ. ఇందును దైవప్రభావమే.

మ. మునుఁగన్గాక పయోధిలో,రిపుచయంబున్గెల్చుఁగా కెట్టులేక,
విసువీధి న్జన నేర్చుఁ గాక, కృషివాణిజ్యాదులం బోర్లుగా

క,నిలింపాచల మెక్కఁగాక,చదువు లైక్కట్టుఁగా, కెచ్చురా
దనయం బున్నది పోదు శ్రీసురభిమల్లా నీతివాచస్పతీ. 98

శ్రీసురభి...స్పతీ, (పురుషుఁడు), పయోధిలోన్ =సముద్రమునందు, మునుఁగున్ కాక=మునుఁగనీ, రిపుచయంబున్ =శత్రుసమూహమును, గెల్చున్ కాక= గెలువనీ, ఎట్టులేన్ = ఏదోయత్నముచేత, వినువీథిన్ =ఆకాశమార్గమునందు, చనన్ =పోవుటకు, నేర్చున్ కాక=సమర్థుఁడుకానీ, కృషి+వాణిజ్య+ఆదులన్ = సేద్యము, వర్తకము, మొదలైనవానియందు, పోర్లున్ కాక = పొరలున్+కాక = పొరలాడనీ, నిలింప+అచలము = దేవతలకు ఆవాసమైన పర్వతము (మేరువు=బంగారుకొండ)ను, ఎక్కున్ కాక=ఎక్కనీ, చదువుల్ = (వేదాది) సమస్తవిద్యలును. కైకట్టున్ కాక = వశమైనఁగానీ, అనయంబున్ = అవశ్యముఁగా, ఎచ్చు=అధికము, రాదు, ఉన్నది, పోదు.

పురుషుఁడు సముద్రములో మునిఁగినను, పోరిలో శత్రువులను గెలిచినను, ఎంతో ప్రయత్నముచేసి (యోగాదుల నభ్యసించి) ఆకాశగమనము సాధించినను, సేద్యమును వర్తకమును చేసికొనుచు వానియందే మునిఁగి యున్నను, మేరువుకొన కెగిరినను, వేదాదివిద్యల నన్నిటిని కైవసముచేసికొన్నను, ఇట్టివి యెన్ని సాధింపఁగల్గినను అదృష్టమున్నంతమాత్రమే లభించునుగాని అంతకన్న హెచ్చు రాదు; ఉన్నదానికి లోటు లేదు.

పయోధిలోన్ మున్గున్. (1) జలస్తంభనాదివిద్యలు నేర్చి జలమున సంచరించుశక్తి. (2) ముత్యములు మున్నగు రత్నములకై సముద్రమున మునుఁగుట-అనియైనను.

వినువీథిన్ చనన్, నిలింపాచల మెక్కున్ - ఈరెండుకార్యములు యోగానుసంధానముచే సాధితములు.

చదువుల్-వేదవేదాంగాదివిద్యలు.

నాల్గువేదములు, ఆఱువేదాంగములు, మీమాంస, న్యాయము, పురాణము, ధర్మశాస్త్రము అని విద్యలు పదునాలుగు: వీనితో ఇతిహాసములు, ఆగమములు మొదలగు ఆఱువదినాల్గుం గూడ చేరును.

కొందఱిమతమున చదువులన్న ఆన్వీక్షకి, త్రయీ (వేదములుమూఁడు), దండనీతి యనునవి మూఁడు; మఱికొందఱిమతమున ఆన్వీక్షకి, త్రయీ, వార్త, దండనీతి అనునవి నాల్గు.

ఇచటఁ జేర్కొనఁబడిన్న ముసుఁగుట మొదలగునవి చతుష్షష్టికళలలో నంతర్భూతములు.

"రానున్నది రాక మానదు, పోనున్నది పోక మానదు."

"యద్భావం తద్భవతి, యదభావి నతద్భవేత్"-అని న్యాయము.

అవ. మహాసంకటసమయములందును పూర్వపుణ్యమే శరణ మగును.

మ. అనియందు న్వనియందు దావశిఖియం దంభోధియం దద్రిసా
నునికాయంబులయందు శత్రుతతియందు న్సుప్తునైన న్ప్రమ
త్తుని నైన న్విషమాసనస్థు నయిన న్దోడై సుకర్మంబు పా
లనము జేయు జనావళి న్సురభిమల్లా నీతివాచస్పతీ. 99

సురభి...స్పతీ, అనియందుక్ = యుద్ధమునందును, వనియందుక్ = అడవియందును, దావశిఖియందుక్ = కార్చిచ్చు (అడవినిప్పు)నందును, అంభోధియందుక్ = సముద్రమునందును, అద్రి+సాను+నికాయంబులయందుక్ = కొండకొనల ప్రోవులందును, శత్రుతతియందుక్ = పగవాండ్రగుంపునందును, సుప్తుక్ ఐనక్ = నిద్రితునిగాని, ప్రమత్తుక్ ఐనక్ = మత్తుగొన్న (తెలివి లేక, పరాకుపడియున్న) వానినిగాని, విషమాసనస్థుక్-విషమ = ఆపదయందు-ఆసనస్థుక్ = నెలకొనినవానిని, అయినక్ = కాని (మిట్టపల్లములుగా నుండు నేలమీఁదకూర్చున్నవానిని; లేదా, భయముపుట్టించు స్థానమునం దున్న

వాటిని), (అగు), జనావళిన్=జనసమూహమును, సుకర్మంబు = పూర్వపుణ్యకర్మము, పాలనముగ్ చేయుగ్ = రక్షించును.

పురుషుని యుద్ధములో, కార్చిచ్చులో, సముద్రములో, కొండకొనలలో, శత్రువులనడుమను, నిద్రలో, కైపులో, ఆపదలలో పురాకృతపుణ్యములే రక్షించును; ఇతరములు కావు.

కవి పునర్జన్మ కల దనుటను 97, 99 పద్యములలో సూచించుచున్నాఁడు.

అవ. పుణ్యాత్మునకు సర్వత్ర సకలసౌఖ్యములు గలుగు నని చెప్పుచు ఉపసంహరించుచున్నాఁడు.

మ. భయదారణ్యము రాజధాని యగు; భూభాగం బశేషంబు ర
త్నయుతంబై కనిపించు; నెల్లజనులు న్సన్మిత్రులై కొల్తు రెం
తయుఁ; దొల్మేనను బెట్టిపుట్టినమహాత్మశ్రేణి కిష్టార్థ మె
ల్లయెడ న్గల్గు సుఖంబున న్సురభిమల్లా నీతివాచస్పతీ. 100

సురభి...స్పతీ, తొల్ మేనను = పూర్వజన్మమునందు, ఎంతయుగ్ = మిక్కిలి, పెట్టిపుట్టిన = (పురాకృతపుణ్యముచే) అదృష్టవంతులైన, మహాత్మశ్రేణికిన్ = పెద్దలసముదాయమునకు, భయద+అరణ్యము=భయముపుట్టించు అడవి, రాజధాని = రాజు నివసించెడి ముఖ్యపట్టణము, అగున్, అశేషంబు= సమస్తమైన, భూభాగంబు = భూమియు, రత్న+యుతంబు+ఐ=మణులతో కూడుకొన్నట్టిదై, కనిపించున్ = కనఁబడును, ఎల్లజనులున్ = జనులందఱును, సన్మిత్రులు = సౌజన్యముతో కూడిన స్నేహితులు (ఆప్తులు), ఐ, కొల్తురు=సేవింతురు, (వారికి), ఇష్ట+అర్థము=కోరినవస్తువు, సుఖంబునన్=మిక్కిలి సంతోషముతో, ఎల్ల+ఎడన్=అన్నిస్థలములందును, కల్గున్=కలుగును.

ఎవఁడు పూర్వజన్మమున విస్తారమైన పుణ్యకార్యము లాచరించి యుండునో ఆమనుష్యునికి ఘోరారణ్యములోకూడ సకలభోగములును రాజ

-ధానిలో రాజునకు జరిగినట్లు జరుగును; పెఱవా రెల్లరును ఆప్తు లగుదురు; భూమిపై అడుగిడినచోట్లనెల్ల రత్నములును నిధులును దొరకినంతసౌఖ్యము కలుగును. కనుక స్వశ్రేయోభిలాషి సత్కర్మాచరణతత్పరుఁడై యుండఁ దగు ననుట సందర్భాభిప్రాయము.

భయదము=భయమును ఇచ్చునట్టిది-క్రూరమృగాదుల ప్రాచుర్యముచేత.

రాజధాని=రాజునకు నివాసమైనది-సమస్తభోగములను సాధించునది.

ఆశేషము-శేష మేమియు లేక-చతుస్సముద్రాంతమైన భూమి.

రత్నయుంతము-(1) శ్రేష్ఠమైన వస్తువులతో సమృద్ధమైనది.

(2) మహాపద్మము మొదలగు నవనిధులతోను నిండినది అనఁగా సమస్తఫలముల నొసఁగునది.

పెట్టిపుట్టువాఁడు - అదృష్టవంతుఁడు - జాతీయశబ్దములు.

నీతిశతకము సమాప్తము.

చెన్నపురి: వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము.—1954

# ప్రశ్నలు

1. క్రిందిభావములను వివరించుపద్యములం జెప్పుఁడు :
   - (a) మూర్ఖులతో స్నేహము కష్టము.
   - (b) జ్ఞానార్జనము అత్యావశ్యకము.
   - (c) ఐశ్వర్యబలము.
   - (d) సేవకావృత్తి యతికఠినము.
   - (e) కవి నృపతులతారతమ్యము.
2. (a) 26, 57, 60, 66 పద్యములలోని భావములను విశదీకరింపుఁడు.
   - (b) ఈపద్యములలోని సమాసములను వివరింపుఁడు.
3. దానప్రాశస్త్యమునుగూర్చికాని, కర్మప్రాధాన్యత నుద్దేశించికాని, విశదీకరించుచు రెండేసిపద్యములచే నుదాహరింపుఁడు.
4. సందర్భోచితముగ నర్థవివరణము చేయుఁడు :
   - (a) జాగిలం బవ్వేల్పుందొరఁ జూచి కొంకదు గృహీతార్థావమానంబు (9)
   - (b) పండితగ్రామణు ల్మది నూహింప నలంతులే. (11)
   - (c) గురుత్వలఘుత్వంబుల నిశ్చితంబులగుచర్థశ్రేణిదోపించు. (36)
   - (d) కూ శెవ్వరి మే లనున్ (43)
   - (e) మే లిట్లరై యడరున్ జుమ్ము క్రమంబుతో. (58)
   - (f) చెన్నారు నవ్వేశ్యలీల జనాధీశులనీతి. (38)
   - (g) తొలుత నీర్ఘములై పొరిం గృశములై తోఁచున్. (45)
   - (h) ఎందును బుణ్యాత్ముల కిట్టి మూఁడుపహులు న్లోకంబులోఁ జేకుఱున్. (59)
5. (i) జరనైనన్ క్షుధనైన. (ii) ఘనసారంబునఁ గోద్రవావృతి, (iii) తమయర్థంబుఁ బరిత్యజించి, (iv) క్షితి మృత్యుంజయ, (v) ఘనసత్యల్పునిఁగా—అనుపద్యములకు సంపూర్ణవ్యాఖ్య వ్రాయుఁడు.

6. (a) భర్తృహరి నీతిశతకమునకు స్వతంత్రకర్తయా? సంధాతయా?
(b) నీతిశతకమునుండి కవి కిష్టదైవ మొకటి యుండె ననుటకు వీలు కలదా? భక్తిబలముచే నాతనికి ప్రియతమ మగుస్థాన మేది?

7. క్రిందివిషయములంగూర్చి కవి భావము లెట్టివి?
(i) కర్మ. (ii) విద్య. (iii) మానవభోగములు.

8. నీతిశతకమును రచించిన మూలకవియొక్కయు,అనువాదకునియొక్కయు కాలములను సప్రమాణముగ నిర్ణయింపుఁడు.

9. క్రిందిభావములకు సమానమైన పద్యములను నీతిశతకమునుండి యుదాహరింపుఁడు.

(a) దారిద్ర్యమునకుమూలము తృష్ణయేగాని ధనాల్పత కాదు.

(b) Full many a flower is born to blush unseen
And waste its sweetness on the desert air.

10. 26, 67, 68, 85, 83, 92-పద్యములలోని పురాణగాథల వివరింపుఁడు.

11. దైవపౌరుషములంగూర్చి కవిమత మేది? కర్మమునకును, దైవమునకు నతం డభేదము పాటించెనా? సదృష్టాంతముగ నిరూపించునది.

12. నీతిశతకమున వివిధపద్ధతి విభజన మెంత సమంజసము? ఆపద్ధతుల కన్నిటికిని పరస్పర సంబంధము కలదా?

13. కవి నీత్యుపదేశమునఁ జేపట్టిన విధానమును విశదీకరింపుఁడు.

14. అనువాదకుని యనువాదవిధానమును విమర్శింపుఁడు.

15. క్రిందిప్రయోగములలోని వ్యాకరణవిశేషములను సప్రమాణముగ నిరూపించునది:

దిరిసెంపునివ్వరి, పుప్రివ్వాల్, రోఁత్రై, మెఱపుచయ్యాల్, అలరుంగుత్తి, ఆంద్రు, ఐశ్వర్యముల్తావై.

16. కవియాంధ్రజాతీయముల వాడిన విధానమును వివరింపుఁడు.

# పద్యకావ్యములు

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| పంచతంత్రము, నారాయణకవిది | ... | 2 | 8 |
| డిటో వేంకటనాథరాజకవికృతము | ... | 2 | 8 |
| ప్రభావతీప్రద్యుమ్నము, పింగళిసూరన | ... | 2 | 0 |
| పాండురంగమాహాత్మ్యము, తెనాలిరామకృష్ణకవి, సటీక | ... | 6 | 8 |
| బిల్హణీయము, చిత్రకవిసింగనార్యకవి | ... | 1 | 4 |
| భారతసావిత్రి | ... | 0 | 2 |
| భోగినీదండకము, బమ్మెర పోతన | ... | 0 | 2 |
| భోజరాజీయము, అనంతామాత్యకృతము | ... | 4 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము | ... | 5 | 0 |
| మొల్లరామాయణము, ఆతుకూరి మొల్ల విరచితము | ... | 1 | 8 |
| రంగనాథరామాయణము, ద్విపద | ... | 6 | 0 |
| రాజశేఖరవిలాసము | ... | 0 | 8 |
| రాజయోగసారము, ద్విపద | ... | 0 | 8 |
| రాధికాసాంత్వనము, క్రొత్తకూర్పు | ... | 1 | 8 |
| రామరాజీయము | ... | 0 | 12 |
| రామాభ్యుదయము | ... | 2 | 8 |
| రుక్మిణీకల్యాణము, సటీక | ... | 0 | 10 |
| రుక్మిణీపరిణయము | ... | 0 | 12 |
| రుక్మాంగదచరిత్ర, ఏకాదశీమాహాత్మ్యము | ... | 1 | 8 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వసిష్ఠజనకసంవాదము | ... | 0 | 12 |
| వామనపురాణము | ... | 5 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద | ... | 1 | 4 |
| విజయవిలాసము | ... | 1 | 0 |
| డిటో టీకాతాత్పర్యము | ... | 3 | 4 |
| వివేకసింధువు, కొండనార్యప్రణీతము | ... | 1 | 8 |

| | | రూ. | అ. |
|---|---|---|---|
| | | | 8 |
| వీరభద్రవిజయము, పోతనది | ... | 2 | 6 |
| వేమనపద్యములు | ... | 0 | 8 |
| ,, బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 8 |
| ,, (2728) చిన్నసైజు | ... | 3 | 8 |
| ,, (2728) ఆంధ్రతాత్పర్యముతో | ... | 7 | 8 |
| వేమనశతకము | ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము | ... | 1 | 4 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవి | ... | 1 | 4 |
| శశాంకవిజయము (తారాశశాంకవిజయము) | ... | 1 | 0 |
| శ్రీమద్ధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 8 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | ... | 3 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి | ... | 3 | 0 |
| సానందోపాఖ్యానము | ... | 2 | 0 |
| హారవిలాసము | ... | 1 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, ద్విపద, గౌరనకృతము, క్యాలికోబైండు | | 3 | 0 |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము | ... | 0 | 8 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తికృతము | ... | 6 | 0 |
| సమీరకుమారవిజయము, పుష్పగిరి తిమ్మనప్రణీతము | ... | 1 | 8 |
| సప్తమస్కంధము, ప్రహ్లాదచరిత్ర (భాగవతములోనిది) | ... | 0 | 12 |
| సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయ | ... | 1 | 8 |
| సౌగంధికాప్రసవాపహరణము, ద్విపద, క్యాలికోబైండు | ... | 3 | 0 |
| హంసవింశతి, అయ్యలరాజు నారాయణామాత్య | ... | 1 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణప్రణీతము | | 5 | 0 |

| | | | |
|---|---|---|---|
| వీరభద్రవిజయము, పోతనది | ... | 2 | 6 |
| వేమనపద్యములు | ... | 0 | 8 |
| ,, బ్రౌనుదొరగారి ఇంగ్లీషుతో | ... | 1 | 8 |
| ,, (2728) చిన్నసైజు | ... | 3 | 8 |
| ,, (2728) ఆంధ్రతాత్పర్యముతో | ... | 7 | 8 |
| వేమనశతకము | ... | 0 | 8 |
| వైజయంతీవిలాసము | ... | 1 | 4 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవి | ... | 1 | 4 |
| శశాంకవిజయము (తారాశశాంకవిజయము) | ... | 1 | 0 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 8 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | ... | 3 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవి | ... | 3 | 0 |
| సానందోపాఖ్యానము | ... | 2 | 0 |
| హరవిలాసము | ... | 1 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, ద్విపద, గౌరనకృతము, క్యాలికోబైండు | | 3 | 0 |
| శ్రీవేంకటేశాంధ్రము, పద్యకావ్యము | ... | 0 | 6 |
| శివలీలావిలాసము, కూచిమంచి తిమ్మకవిప్రణీతము | ... | 0 | 8 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, పరశురామపంతుల లింగమూర్తి గురుమూర్తికృతము | ... | 6 | 0 |
| సమీరకుమారవిజయము, పుష్పగిరి తిమ్మనప్రణీతము | ... | 1 | 8 |
| సప్తమస్కంధము, ప్రహ్లాదచరిత్ర (భాగవతములోనిది) | ... | 0 | 12 |
| సుదక్షిణాపరిణయము, తెనాలి అన్నయ | ... | 1 | 8 |
| సౌగంధికాప్రసవాపహరణము, ద్విపద, క్యాలికోబైండు | ... | 3 | 0 |
| హంసవింశతి, అయ్యలరాజు నారాయణామాత్య | ... | 1 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణప్రణీతము | | 5 | 0 |

వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్
292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.